

# యుగపురుషుడు

డా॥ వేదవ్యాస IAS., Ph.D.

# విషయసూచిక

# అంకితం

అంతా నడిపిన నీకు
అడుగడుగునా చేయూతనిచ్చి తోడుపడిన నీకు.
అంతా నిండిన "నేను" గా నన్ను నడిపించే నీకు.
అందరిలోను "అందరి" లాగ, దీన్ని అందుకుని
ఆదరించే - నీకు.

నాలో కదిలి నీవు నేనైన నీకు.
ప్రేమతో ఆత్మార్పణతో నీదైన యీ చిన్న కానుక
నీదాన్నే నీకు సమర్పిస్తున్నాను.
తీసుకో! స్వామి!

# నివేదన

కీ. శే. పద్మశ్రీ వి. నాగయ్య
మాజీ ప్రెసిడెంటు
**USCEFI**

నేను ఆధ్యాత్మిక చింతనగల ఒక కళాకారుణ్ణి.

నా చిన్ననాటి నుండి నాకు వేదపఠనమన్నా, భగవన్నామ సంకీర్తన మన్నా, పురాణ కాలక్షేపాలన్నా ఆసక్తి మెండు.

నాటకాల్లో కూడా భక్తి ప్రధానమైన నాటకాలు, సంఘ సంస్కారానికి తోడ్పడే నాటకాలు నాకు అత్యంత అభిమానమైనవి.

నా చిన్నతనంలో -

"ఇందుగలడందులేడను - సందేహమువలదు చక్రి సర్వోప గతుం డెందెందు వెదకిచూచిన - అందందే గలడు దానవాగ్రణి వింటే" ....

...అంటూ ప్రహ్లాద పాత్రలో లీనమై నారాయణ సంకీర్తనచేస్తూ కొన్నివందల నాటకాలు ప్రదర్శించాను. వయస్సుతోపాటు నాలో భగవద్భక్తి కూడా పెంపొందుతూ, శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారి

"సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే - నిర్మోహత్వం
నిర్మోహత్వే - నిశ్చలతత్వం
నిశ్చలతత్వే - జీవన్ముక్తిః"

అన్న శ్లోకాన్ని మననం చేసుకుంటూ నిత్యమూ, సత్సాంగత్యం కోసం పరితపించే వాడిని. అచిరకాలంలోనే నా అన్వేషణ ఫలించి నాకు కొందరు మహనీయుల సత్సాంగత్యం లభించింది.

అట్టి మహనీయులలో శ్రీ వేదవ్యాసగారొక మాణిక్యం లాంటి వారు.

ఆయన ప్రస్తుత మన దేశ కాల పరిస్థితులనూ, మన సమాజంలో గల వక్రమార్గాన్నీ, చీకటి జీవితాలనూ, నరరూప రాక్షసుల్నీ చూచి విసిగి వేసారి,

....ఒకనాటి పవిత్ర భారతభూమి, ఈనాడు అపవిత్ర మారణ భూమిగా మారినందుకు ఎంతో చింతించి, ఆవేదన చెంది, చివరికి దేశంలోని సక్రమమైన విద్యావిధానం లోపించడంచేతనే ఈ విషమ పరిస్థితి తలఎత్తిందని ఎంచి, ఈ అధమాధమ పరిస్థితుల్ని ఎదుర్కొని, మానవాభ్యుదయాన్ని నెలకొల్పడానికి మన ప్రాచీన విద్యావిధానం తప్ప వేరే మార్గంలేదని, భారత సంస్కృతిని తిరిగి ఈనాడు మళ్ళీ పునరుద్ధరించి ఆనాటి జ్వాజ్జల్య శోభతో మన కన్నులఎదుట సజీవమై ఆవిర్భవింపజేయుటయే తప్ప, వేరే ఇతర మార్గం లేదని నాకు ప్రబోధన చేశారు.

శ్రీ వేదవ్యాసగారి ప్రబోధన, దైవానుకూల్యం ఈ రెండింటి సహాయంతో నేను నిమిత్తమాత్రుడిగా 'United Social Cultural and Educational Foundation of India" — అన్న దివ్య సంస్థ ఏర్పడింది.

దీన్ని ఆదర్శ సంస్థగా ఏర్పరచటానికి అహర్నిశలూ నిర్విరామంగా కృషిచేస్తున్న మిత్రబృందంలో ప్రముఖులు విద్వాన్ మహాకవి, శ్రీ పిలకా

గణపతిశాస్త్రిగారి వంటి సరస్వతీ పుత్రులతోబాటు అస్మదీయుడికి కూడ ఒకస్థానం లభించడానికి కారణం ఈ మహాయజ్ఞంలో శ్రీ వేదవ్యాసగారి ప్రబోధనా ప్రభావమే! దీనితో నన్ను ధన్యుణ్ణి చేశారు. వారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.

భగవంతుడు సంకల్పించిన ఈ మహాక్రతువులో నేనెంత వరకూ నాపాత్రను పోషించగలనో చెప్పలేనుగాని, సినిమారంగంలో పెద్దల ఆశీస్సులతో, కళావేత్తలు ప్రసాదించిన క్రమశిక్షణతో, కళాభిక్షతో, యధోచితంగా పాత్రలను పోషించిన నేను ఈ మహాయాగంలో కూడ అదే క్రమశిక్షణతో, చిత్తశుద్ధితో, శ్రీ వేదవ్యాసగారి అడుగుజాడలలో నడవటానికి ప్రయత్నించగలనని భావిస్తున్నాను.

శ్రీ వేదవ్యాసగారొక మహావ్యక్తి, పుణ్యపురుషులు. వారి భావాలూ, ఆదర్శాలూ ఉదాత్తమైనవి. ఆ యుగపు వేదవ్యాస మహర్షియే ఈ యుగంలో "ఈ వేదవ్యాస" గా అవతరించారేమో అని ఒక్కొక్కప్పుడు అనుకొంటూంటాను. ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు.

1934, గుంటూరు మండలంలో వీరి జననం. చిన్నతనంలో ఎక్కడా స్కూలులో విద్య అభ్యసించలేదు.

పసితనంలోనే వేద, సంస్కృత, జ్యోతిష విద్యలు వారి పూజ్య పితృదేవులవద్ద అభ్యసించారు. కాలంతోబాటు ఆంగ్లవిద్య కూడ అవ సరం కనుక గుంటూరు హిందూకళాశాలలోనూ, ఆంధ్ర విశ్వవిద్యా లయంలోనూ, విద్యాభ్యాసం చేసి, జీవశాస్త్రంలో B.Sc., (Hons) డిగ్రీని పందొమ్మిదవఏటనే పొందిన ఘనత శ్రీ వేదవ్యాస గారికే లభించినది. 'లయోలా' (Loyola) కాలేజీలో పనిచేసి తరువాత I.A.S లో ఉత్తీర్ణులై

గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణకై, ప్రభుత్వోద్యోగిగా వుంటూ కర్నూలులో Special కలెక్టరుగా కొంతకాలం, హైద్రాబాదులో జాయింటు కలెక్టరు గాను పనిచేసి వీరు ప్రస్తుతం హైద్రాబాదులో వుంటూ ఆంధ్రప్రభుత్వంలో ప్రిన్సిపలు కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

అందరికీ ఆదర్శప్రాయంగా తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తూ, తీరిక సమయాల్లో సమాజ సేవాధర్మ నిర్వహణకై వేదశాస్త్ర పరిశోధన, ప్రాచీన భారతీయ సంస్కృతి పునరుద్ధరణకు కృషిచేస్తూ మన ప్రాచీన వేదశాస్త్రాల్లోని అధ్యాత్మిక సత్యాలను ఈనాటి "సైన్సు" అనే విజ్ఞాన సాంకేతిక అణుసిద్ధాంత రహస్యాలతో పోల్చి, వాటి పరిశోధనలు జరుపుటలో నిమగ్నులైయుంటారు. అట్టి పరిశోధనల సారాంశమే శ్రీ వేదవ్యాసగారు రచించిన ఈ 'యుగపురుషుడు' అన్న గ్రంధము. దీన్ని మీకు మా సంస్థ "USCEFI" అందించే ప్రథమ ప్రసూనాంజలిగా సమర్పిచడానికి* ఆనందిస్తున్నాము.

ఇందలి విషయం సంగ్రహంగా చెప్పాలంటే :-

1. భారతదేశ నిర్మాణ చరిత్రే మహాభారతంలోని కావ్య వస్తువు.
2. ఇది భరతజాతి గాథ.
3. నవభారత నిర్మాతగా శ్రీకృష్ణుడు.
4. శ్రీకృష్ణుడు - రాజకీయసేవ. సాంఘీక వాదం - శ్రీకృష్ణుని సామాజికవాదం.
5. శ్రీకృష్ణుని కాలం.
6. యుగపురుషుడుగా శ్రీకృషుని వ్యక్తిత్వం.

---

* ఇది షష్ఠమ ముద్రణం. ఆంధ్రదేశం ఇచ్చిన ఆదరణకు ఇదే నిదర్శనం.

7. శ్రీకృష్ణుడు - భక్తియోగం.

ఇత్యాది అపూర్వమైన అద్భుత విషయాలను, చక్కటి సంభాషణా శైలిలో మృదుమధుర భాషలో యావదాంధ్రులనే కాక, యావద్భారతీయులను కూడ ఉత్తేజపరచి వారిలో ఒక నూతన చైతన్యాన్ని రేకిత్తించే విధంగా, భావపూరితంగా రచించిన శ్రీ వేదవ్యాసగారు నిజంగా సార్ధక నామధేయులేకాక ధన్యజీవి, పావన పురుషుడు.

USCEFI - సంస్థపరంగా ప్రప్రధమంగా ఇంతటి అమూల్యమైన గ్రంధం వెలువరించగలగడం చాల శుభసూచకమే గాక మాకు ఎంతో ముదావహం కూడాను.

లోక కల్యాణంకోసం యిటువంటివి పెక్కు గ్రంధాలు శ్రీవేదవ్యాస గారి కలంనుండి రావాలని కోరుతూ వారికి నా గౌరవపూరితమైన ధన్యవాదాలర్పిస్తూ మానవజాతి శ్రేయస్సును కోరే ప్రతివారూ ఈ గ్రంథాన్ని పఠించి, ఆనందించి తరించగలరని మనసారా అశిస్తున్నాను.

మీకూ మా సంస్థ USCEFI ని గూర్చి తెలుసుకొనవలెనని కుతూహలం వుండడం సహజం! ఈసంస్థ, దాని పనీ, ఈ గ్రంథం చివరి భాగంలో పొందుపరుస్తున్నాము.

సకల సన్మంగాళాని భవంతు

ఇట్లు,

సుజన విధేయుడు,

పద్మశ్రీ వి. నాగయ్య

ప్రెసిడెంటు

"USCEFI"

మద్రాసు

13-10-69

# జీవితంలో మరపురాని వ్యక్తి - 'వ్యాసమహర్షి'

**రచన : జి. యస్. రాజు**

(టెలీకమ్యూనికేషన్స్ రీసెర్చిసెంటర్ డైరెక్టర్
కమ్యూనికేషన్స్ మంత్రిత్వశాఖ, న్యూఢిల్లీ)

ఆజానుబాహుడు, అరవందదళాయతనేత్రుడు. అసమాన ప్రజ్ఞాశాలి! వేదవేదాంగ సారమెరిగిన ఆచార్యుడు ఐ.ఏ.ఎస్. అధికారి! ముచ్చటగా మూడుపదులలో తిరుగాడే ఈ మూర్తీభవించిన వ్యక్తి ఎవరబ్బా! పిన్నవయసులోనే ఐ.ఏ.ఎస్‌కు రాజీనామాచేసి మళ్ళీ ఆఫీసరైన ఈ వ్యక్తి చుట్టూ యోగ, జ్యోతిష మంత్ర శాస్త్రాలలో అనుభవమున్న అనేకమంది అనుచరులు తిరుగాడుతారే! వీరిలో ఈ మహత్తేమిటి ?

నల్లని మృదువైన చుబుకము, విజ్ఞానకాంతులు వెదజల్లే నేత్రాలు, భుజాలవరకు విలాసంగా తిరుగాడే నల్లని కేశములు కలిగిన యీ యోగిపుంగవుడు నిష్కళంక దేశభక్తుడు, ఉత్తమ వేదాంతి, కళాకారుడు, సాహితీవేత్త, శిల్ప, విజ్ఞానశాస్త్రాలను వేదోపనిషత్తులతో సమన్వయించటంలో దిట్ట. పట్టుదలతో పోరాడటమేగాదు ప్రసన్నచిత్తంతో ప్రేమించగలడు కూడా! విద్యావాచస్పతి. ఉపన్యాసధురీణుడైన ఈ సద్గుణ సంపన్నుడు నిజంగా అపూరూపమైన వ్యక్తిగదూ!

శ్రీ వేదవ్యాస్‌గార్ని చూడగానే నాలో రేగిన భావతరంగిణియే ఈ వ్యాసరచనకు ఆలంబన.

చిఱునవ్వు చిందించే ఆయన మోము నాకు ఆయనతో జీవితంలో విడరాని బంధంవేసింది. విజ్ఞాన సముదాయమంతా పోతపోసి తయారైన విగ్రహం ఆయన. అంతటి అనన్య ప్రతిభాశాలిని పరిచయం చేయడం ఎలాగ? అసలు నేను ఆయన గూర్చి తెలుసుకొన్న దెంత? ఇది జవాబులేని ప్రశ్న. విశ్వాంతరాళంలో నిక్షిప్తమైన ప్రశ్న.

వేదవ్యాస! ఎంతచక్కని పేరు! ఎంత తగినపేరు! ఈ వేదవ్యాసను గూర్చి ఆలోచిస్తుంటే నా భావాలు గతంలోకి పరిగెత్తాయి.

నేనాయనను కలుసుకున్నది అయాచితంగా మాత్రం కాదు. అదే దైవసంకల్పం. నేనాయనను ప్రప్రథమంగా 1966 డిసెంబరులో హైద్రాబాద్‌లో ఒక ప్రముఖ హోటల్లో కలుసుకోవడం జరిగింది. ఆయనను దర్శించాలని ఆయనతో సంభాషించాలని ఉరకలు వేసే నా హృదయానికి కళ్ళెంవేసి పదినిముషాలసేపు ఇంటర్వ్యూ సంపాదించాను. రెండు విధాలుగా అది ముఖ్యమైంది. ఏమంటే ఒకటి : వివాహ సంబంధమైన విషయాలు మాట్లాడడానికి. రెండు, ఆయనను పరిచయం చేసుకోవాలనే నా ఉబలాటం తీర్చుకొనడానికి.

శ్రీ వేదవ్యాసగారి 'నివాసం' కేవలం ఒక సామాన్యగృహం కాదు. అది ఒక ఆశ్రమం! అక్కడ ఐహికచింతలకు స్థానంలేదు. జీవిత సమస్యలనుండి మనల్ని ఎక్కడికో దూరతీరాలకు చేర్చే శాంతికుంజం ఆయన భవనం. ఈ విషయం తెలుసుకోవడానికి నాకెంతోసేపు పట్టలేదు. అయితే అదేమి విచిత్రమో! మనం అయన సహచర్యం వదలి

ఆ గృహంవీడి కాలూనితే చాలు! మళ్ళీ మన భావాలు మనచుట్టే పరిభ్రమిస్తూ వుంటాయి.

ఆయనను చూడటానికి వచ్చేవారికై ఆయన యెక్కువ కాలం వినియోగిస్తారు. అలుపూ సొలుపు ఏమివుండదు. అడ్డులేని ప్రవాహంలా అలా ఒకరి వెనుక ఒకరు వచ్చేవారిని చూసి నేనాశ్చర్యపడ్డాను. ఆయన అభిప్రాయంకై వచ్చేవారు కొందరైతే ఆయనతో ఉన్నత మైన వైజ్ఞానిక జ్యోతిష విషయాలు చర్చించేవారు కొందరు! ఆయన నాయకత్వంను కోరే అనుయాయులు కొందరైతే ఆయనను మానవ నిక్షిప్తమైన అయ స్కాంత శక్తిగా భావించేవారు మరికొందరు! వీరందరూ ఆయన ఇంటి చుట్టూ ఆయనతో సమావేశంకై తహతహలాడే వారే!

ఈయన ప్రవర్తన చూస్తుంటే నాకప్పుడప్పుడు అనిపిస్తుంటుంది, ఈయనకూ, "షిర్డీ" ఆశ్రమంలోని ఆ మహర్షికీ అవినాభావ సంబంధం కలదేమోనని! స్వానుభావానుసారం వారిరువురూ ఒక కోవకు చెందిన వారే.

ఆయన ఒకసారి నాకు "నూతనయుగం" గూర్చి విపులీకరిస్తూ "విశ్వశక్తి" ఏ విధంగా మానవునిలో ప్రవేశిస్తుంది? దాని ప్రభావం అతనిపై ఎలా ఉంటుంది? అన్నది నాకు నాపైననే ప్రయోగాత్మకంగా చూపించారు.

ఆయన ఆధ్యాత్మికచింతనను గూర్చి వ్రాయాలంటే ఒక గ్రంథమే అవుతుంది. ఆయన ఏడవ ఏటనుండి సంస్కృత, యోగాసనాలు అభ్య సించేవారు. ఉపనిషత్తులు, వేదాలూ అధ్యయనం చేసేవారు. మాష్టర్ సి.వి.వి. (C.V.V.) గారి 'నూతనయోగం' ఆయన్ను ప్రభావితుణ్ణి చేసింది.

హైద్రాబాదులో ఉన్నప్పుడు వారి ఇంట్లోని 'యోగపాఠశాల' (yoga school) నన్నాశ్చర్యపర్చింది! కొందరు ఒంటికాలిపై నిలబడి తమ శరీరాన్ని ముళ్ళు వేసినట్లు మెలికలు త్రిప్పగల్గేవారు! ఇదంతా చూస్తుంటే ఇది భూలోకమా? మరోలోకంలో ఉన్నానా అనిపించేది!

ఒకసారి శ్రీ వేదవ్యాస నెల్లూరులో ఉన్నప్పుడు, కాలిఫోర్నియాకు చెందిన ఆత్మపరిశోధన కేంద్రం సభ్యులు ఆయనను కలుసుకొని జీవిత పరమార్థం గూర్చి ముచ్చటించారు. నేనాశ్చర్యంతో "వీరందరూ మీకెలా తెలుసు?" అనిప్రశ్నిస్తే, "కొండవద్దకు మహ్మద్ వెళ్ళకపోతే కొండే అతణ్ణి చేరుతుం" దన్న ధోరణిలో భగవదాదేశానుసారం పుణ్యపురుషుల సమాగమం జరగుతుందన్నారు! ఎంతటి ఆత్మస్థైర్యం ఆయనది!!

శ్రీ వేదవ్యాస సార్థకనామధేయులు. వేదశాస్త్రాలు ఆయనకు కరతలామలకం. 1967లో తిరుపతిలో శ్రీ జగద్గురు కంచికామకోటి పీఠాదిపతి సమక్షంలో జరిగిన వేదసదస్సులో గాయత్రి మంత్రవిశేషాన్ని గూర్చి శ్రీ వేదవ్యాస్ చేసిన ఉపన్యాసాన్ని జగద్గురువులు సమీక్షిస్తూ వేదానికి కొత్తభాష్యాన్ని చెప్పారని శ్రీ వేదవ్యాస్‌ను ప్రశంసించడం ఆయన పాండితీప్రకర్షకు నిదర్శనం.

కేవలం ఆధ్యాత్మిక తత్త్వవేత్తగానేగాక శ్రీ వేదవ్యాస్ రచయితగా మంచి ప్రావీణ్యం కలవారనటానికి నిదర్శనం హిందూమతంపై ఆయన వ్రాసిన ఉద్గ్రంథమే* ! అంతేగాక నక్షత్ర గమనాలను గూర్చి ఆయన యునెస్కో అంతర్జాతీయ సంస్కృత మహాసభలో చేసిన ప్రసంగం ఆయన ఖగోళశాస్త్ర విజ్ఞానానికి మచ్చుతునక.

---

* HINDUISM IN SPACE AGE :
(USCEFI) 3/67 Old Rajendra Nagar, New Delhi - 60.

ఉపన్యాస మివ్వడంతో శ్రీ వేదవ్యాసగారి చాతుర్వము ప్రేక్షకులను పులకింపచేస్తుంది. నిజంగా ఆయన గంభీరోపన్యాసం చేస్తుంటే శ్రీ రామానుజులు వారే ఎదుట నిలిచినట్లనిపిస్తుంది. శ్రీ వేదవ్యాస జ్యోతిషశాస్త్రంలో నిధియని చెప్పటానికి కీ॥ శే॥ మాజీ రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్, కీ॥ శే॥ మాజీ రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరిగార్ల రాజకీయ భవిష్యత్తులను గూర్చి ముందు చెప్పడమే నిదర్శనం.

విజ్ఞాన సర్వస్వమును కలిగి సకలశాస్త్ర పారంగతులు అయిన శ్రీ వేదవ్యాసను గూర్చి ఎన్నిపుటలు వ్రాసినా కొరవపడే వుంటుందనడం అతిశయోక్తి కాదు.

– **జి. యస్. రాజు,**
(కేంద్ర ప్రభుత్వం)

('సమాచారము' రాజమండ్రి పత్రిక సౌజన్యంతో)

ఐదో కూర్పుకు :-

# ముందుమాట!

ఈ **'యుగపురుషుడు'** అన్న నా చిన్నపుస్తకం ఇంతత్వరలోనే ఐదవ సారి పునర్ముద్రణకు రావడం — తెలుగుపాఠకుల ఆదరాభిమానములనే కాకుండా 'ఒక పాఠ్యగ్రంథంగా కూడా ఈ పుస్తకం అనేకమంది విద్యార్థినీ విద్యార్థులకు మన ప్రాచీన పురాణాలగురించీ, ఆనాటి హిందూసంస్కృతి గురించీ అవగాహన ఏర్పడటానికీ ఎంతో తోడ్పడినందువలననే' — అని తెలిసి సంతోషిస్తున్నాను.

ఈ **'యుగపురుషుడు'** గ్రంథం చిన్నదేగాని దీనివెనుక చరిత్ర పెద్దది! ఇది నేను రచయితగా పుస్తకాలు వ్రాయాలని దృఢనిశ్చయం చేసుకున్న తరువాత వ్రాసిన మొట్టమొదటి పుస్తకం. నా జీతం రాళ్ళలోని ఐదువేల రూపాయలతో వెయ్యికాపీలు మాత్రమే అచ్చువేయించాను 1964 లో! సంవత్సరం తిరిగేసరికల్లా ఈ గ్రంథం పునర్ముద్రణచేసిన కాపీలు అమ్ముడుపోవడమేకాక పాఠకులనుంచి శరపరంపరగా సందేహాలు-

సమాధానాలు ప్రశ్నోత్తరాలుగా వర్షించసాగినాయి. దానికితోడు దీనిలోని కొన్నిభాగాలు చెప్పకుండా, కనీసం నా అనుమతిలేకుండా కొందరు తస్కరించడం, సినిమాల్లో వాడుకోవడంకూడా జరిగింది. ఆ మహనీయులకు కూడా నా కృతజ్ఞతలు!

ఈ గ్రంథం ప్రచురించిన తరువాత ఈమధ్యకాలంలో నేను దాదాపు 70 గ్రంథాలను రచించి ప్రచురించి పునర్ముద్రణ చేయటంకూడా ఆశ్చర్యంగా జరిగిపోయింది! అన్నిటికన్నా ముఖ్యంగా మహాభారతంమీద నేను చేసిన పరిశోధన — **'మహాభారత కాలనిర్ణయం'** అన్న నా చిన్న పుస్తకానికి ఎంతో ఆదరణ లభించడమేకాక — ఇది ఆంగ్లంలో **"The Astronomical Dating of the Maha Bharata War"** అన్న పెద్ద గ్రంథానికి ఆంధ్రాయూనివర్సిటీనుండి సంస్కృతంలో డాక్టరేట్ లభించడం కూడా జరిగింది.

ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే — నా డాక్టరేట్ పరిశోధనకు కూడా ఈ యుగపురుషుడు గ్రంథంలోని **'శ్రీకృష్ణుని కాలం'** అన్న జ్యోతిష ఖగోళ గణిత పరిశోధనయే మూలం. శ్రీకృష్ణప్రభువు జాతకం ఎంత మందినో ఆకర్షించింది, అలరించింది. ఆతరువాత సంస్కృత భాగవతం, హరివంశం, విష్ణుపురాణాలను ఆధారంగాచేసుకొని స్వతంత్ర రచనగా నేను చేసిన **'భాగవత రసామృతం'** ఒక బృహద్గ్రంథంగా పెరిగి, విస్తరించి ప్రజలలో అభిమానమేకాక భక్తివిశ్వాసాలనుకూడా కలిగించిందని తెలిసి — నా రచన చరితార్థమైందనుకున్నాను. ఇలాంటి ఈ అద్భుతగౌరవం మన తెలుగుపాఠకులు ఎంతమంది రచయితలకు, గ్రంథకర్తలకు ఇచ్చారు? అందుకే ఈ అపూర్వ ఆదరణకు నేను మనసా భగవానునికి

ప్రణామం చేయకుండా **కృతజ్ఞతలు** సమర్పించకుండా ఉండలేకపోతు న్నాను.

యుగపురుషుడుగా ఇందులో అవతరించిన శ్రీకృష్ణభగవానుడు శ్రీమద్భాగవతంలో "**పరమపురుషుడు**"గా విస్తరించి అందులో దశమ స్కంధం రెండవభాగంలో విరాట్పురుషుడుగా భూమ్యాకాశాలను నింపే శాడు. అట్టి శ్రీకృష్ణప్రభువు ఈ భూమిమీద 125 సంవత్సరాల 7 మాసాలు జీవించాడని తెలిసి — శ్రీకృష్ణుని నిర్యాణం జరిగినరోజునే ఇప్పటి ప్రస్తుత 'కలియుగం' ఆరంభమైందనీ జ్యోతిషపరిశోధనా ఖగోళగణితంతో ఈ కలియుగ ప్రారంభతేదీని కనుక్కోగలిగాను — అది **18-ఫిబ్రవరి-3102 B.C.** శుక్రవారంనాటి అర్ధరాత్రి 2 గంటలప్రాంతంలో ఈ **కలియుగం** ప్రవేశించిందని!

ఇది కేవల జ్యోతిష, గణిత చమత్కారమో లేక మ్యాజిక్కు అనుకోకుండా — కర్నాటకరాష్ట్రం షిమోగాజిల్లాలోని తీర్థహళ్ళి తాలూకాలో లభించిన పరీక్షిత్తు కుమారుడైన జనమేజయుడు సర్పయాగం చేస్తుండగా యిచ్చిన దానశాసనం పై విషయాన్నే ధృవపరచింది! అందులో పంచాంగం వివరాలతో తిథి, వారం, నక్షత్రాలతో సరిచూడగా నేను నా డాక్టరేట్ పరిశోధనలో నిర్ణయించిన 3102 తేదీకి — కేవలం 15 నిమిషాల తేడా! ఇంకో ఆశ్చర్యం ఏమిటంటే — ఈ 15 నిమిషాల తేడా కూడా ఆధునిక సైంటిఫిక్ ఖగోళశాస్త్రజ్ఞుల లెక్కలు తప్పుగా వుండటంవల్లనే అని తెలిసి ఆశ్చర్యపోయాను!

దక్షిణదేశంలోని తిరువళ్ళూరు బ్రాహ్మణుల చంద్రగ్రహస్ఫుటపు పట్టికలకోసం ఫ్రాన్సురాజుచేత పంపించబడిన ఫ్రెంచి ఖగోళశాస్త్రజ్ఞుడు

లాబియర్ వీటిని యధాతథంగా కాపీచేసుకుని వెళ్ళాడని తెలిసి మన భారతీయ జ్యోతిష నిర్దుష్టతకు పులకరించిపోయాను. ఇదంతా యుగ పురుషుడు గ్రంథంలోని శ్రీకృష్ణజాతకం చలవే!

అతరువాత క్రమక్రమంగా గుజరాత్‌లోని అరేబియాసముద్రం అడుగున ఆర్కియాలజీ (Submarine Archeology) చేసిన త్రవ్వకాలలో సముద్రంలో మునిగిపోయిన ద్వారకానగరంయొక్క కోటగోడలు, స్థంభాలు, అవశేషాలు, ఓడలంగర్లు, కొన్ని నాణేలు లభించడం — ఈ నా చిన్నగ్రంథానికి మరింత విశిష్టతను సంపాదించిపెట్టింది.

ఇన్నిటినీ స్మరించి ఇంకొక మంచిమిత్రుడిని జ్ఞాపకం చేసుకోవడం తప్పుకాదేమో! అసలీ **"యుగపురుషుడు"** గ్రంథం ఒక సంస్థతరపున ప్రచురించేందుకు కారకులైన పద్మశ్రీ **చిత్తూరు నాగయ్యాగారు** (సినిమా నటులు, ప్రొడ్యూసరు) నామీద అభిమానంతో వ్రాసిన ముందుమాటయే ఒక సన్మానసభలో కలిసిన నాగయ్యగారు నా రచనకు పులకించిపోయి "అమృతం చిలికించే పలుకుబడిలో మధురమైన తెలుగులో అతి మధురమైన శ్రీకృష్ణప్రభువు గాథను అందించారు! ఇది అందరికీ సాధ్య పడే పనికాదు! — ఏవో నవలలు రాయవచ్చు — కానీ రామాయణం, భారతంలాగ కాలంలో నిలబడే శాశ్వతప్రతిష్ఠ కల్గిన గ్రంథం వ్రాశారు మీరు! మీరొక కారణజన్ములు!" అంటూ నన్ను అభిమానంతో మెచ్చుకున్న నాగయ్యగారికి నా ప్రేమపూర్వక స్మృతిగా ఈ **"యుగపురు షుడు"** ఐదవకూర్పును శ్రోతగా ప్రదానంచేస్తున్నాను; ఆయన స్మృతికి చిహ్నంగా!

శ్రీకృష్ణుడి బ్రహ్మచర్యం, ద్వారకలోని వ్రవ్వకాలు మాత్రమేకాక శ్రీకృష్ణప్రభువు వివాహంగూర్చిన కొన్ని కొత్తఅంశాలుకూడా త్వరలోనే అచ్చుకురానున్న — యుగపురుషుడు ఆరవసంపుటంలో చేర్చ కోరుతున్నాను.

ఈ గ్రంథంలో అనేకమంది సాధకులకు, పరిశోధకులకు, విద్యార్థులకు — శ్రీకృష్ణపరమాత్మని గౌరవించే ప్రతి భారతీయుడికీ ఒక కానుకగా భగవానుని పూజాపుష్పంగా సమర్పిస్తున్నాను.

ప్రేమపూర్వక మంగళాశాసనములతో

ఇట్లు
అనుగ్రహాశీస్సులతో
మీ
**వేదవ్యాస**

వృషనామ సంవత్సర
కార్తీకశుద్ధ పూర్ణిమ
హైదరాబాద్



1

# భారతాత్మ

భారతదేశం అనగానే ఏం గుర్తుకొస్తుంది!

భారతదేశం పేరు వినగానే హిమాలయ పర్వతాలు గుర్తుకొస్తాయి. శతాబ్దాల తరబడి హిందూజాతికి ఆదర్శాలుగా నిలబడిన సత్యాహింస లకు ప్రతిరూపాలు, ఈ వెండికొండలు.

ఎక్కడ ఋషులు తపస్సుచేశారో అవే హిమవత్పర్వతాలు! సత్యం, ధర్మంలాగ శుభ్రమై, మానవుడి ఆదర్శాలలాగ మహోన్నతముగా నిలిచి, మేఘాలలో ధ్యానిస్తున్నట్టుండే ఈ హిమాలయ పర్వతాలే భారత సంస్కృతికి పుట్టినిల్లు.

ఎక్కడ ఋషులు తపస్సుచేశారో అక్కడే గంగ పుట్టింది. 'గంగ' అంటే ప్రవహించే హిందూమతమే! ఈ గంగ - భారత జాతికి జీవన ప్రవంతి, హిందూ సంస్కృతికి రక్తనాడి. ఈ గంగకు పుట్టిల్లు - హిమాలయ పర్వతాలు.

మనజాతి ఆధ్యాత్మిక జీవనానికి రక్తప్రసారం లాంటిది గంగ! ఈ గంగ ప్రతి భారతీయుడి శరీరంలోనూ ప్రవహిస్తూవున్న జీవ నది.

ప్రతి హిందువుడి జీవితంలోనూ అణువణువునా జీర్ణించుకునివున్న పవిత్రతే గంగ! ఈ గంగవొడ్డున, నది పొడుగునా పుణ్యక్షేత్రాలూ, తీర్థాలు, నగరాలు సంగమస్థానాల రూపంలో భారతదేశ చరిత్రా, భారత దేశపు సంస్కృతీ తీర్చిదిద్దబడి వున్నాయి.

కాని గంగతోబాటు 'కాశీ' గుర్తుకువస్తుంది చప్పున. కాశీ అన గానే ప్రయాగ, 'మానస' సరస్సూ, యమున, ఇవన్నీ గుర్తుకువస్తాయి, హిందూదేశం అన్నప్పటికి.

ఎందుకని గుర్తుకువస్తాయంటే హిందూదేశానికి ప్రాణంలాంటి భారతీయ సంస్కృతికివి ప్రతిరూపాలు. మనజాతి ఆదర్శాలూ ఆశయాలూ వీటన్నిటితో శాశ్వతంగా ముడిపడివున్నాయి గనుక గుర్తుకు వస్తాయి.

శాశ్వతత్వం - సనాతనత్వం, కాలంతో మారనిదీ, చరిత్రలో మాయనిదీ, ప్రళయం వొచ్చినా తరగని, సృష్టితో పెరగనిదీ, అంటే నిత్యనూతనం సనాతనం, జీవనదిలాగ మనిషి గుండెల్లో నిత్యం ప్రవ హించేది - ఏ మహాసత్యం వున్నదో ఆ సత్యానికి రూపకల్పనే భారతీయ సంస్కృతి. ఆ సంస్కృతికి అంతరాత్మే సనాతన ధర్మం. వీటన్నిటికీ భౌతికంగా చిహ్నాలు గంగ, కాశీ, హిమాలయాలు. అలాగే భారతదేశం పేరు వినగానే గుర్తొచ్చేది 'భారతం'. ఈ మహాభారతానికి కథానాయకు డైనవాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడు హిందూమతానికి, హిందూధర్మానికి అంతరాత్మ లాంటివాడు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు గుర్తురాకుండా హిందూమతం గుర్తుకురాదనే చెప్పవచ్చు! అంతేగాదు. నవభారత నిర్మాణానికి మూలపురుషుడుగా శ్రీకృష్ణుడు భారతదేశ చరిత్రకే కథానాయకుడు.

మన దేశంలోనూ మన సంస్కృతిలోనూ కొట్టవచ్చినట్టు కనపడే కొత్తదనం, వైవిధ్యం, మనదేశంలో వున్నన్ని భాషలూ, అటు యూరపు లోనూ ఇటు ఆసియాలోనూ కూడా ఏఒక్క దేశంలోనూ లేవనే చెప్ప వచ్చు. మనదేశంలో వున్న మతాల, సంస్కృతుల మేళవింపు, రాగ మాలికలా ఒక వింతైన కలయిక. ఈ వైవిధ్యం వెనుక, దాగివున్న ఏకత్వం, సృష్టిలోని ప్రకృతి వైవిధ్యంలాగే భారత చరిత్ర అంతటా, మొదటి పేజీనుంచి ఈనాటి వరకూ, ప్రతి అధ్యాయంలోనూ తొంగి చూస్తూ వుంటుంది. ఈ వైవిధ్యాన్ని కలుపుతూ జీవనదిగా ప్రవహించే అంతర్వాహినే హిందూధర్మం. గంగానది ఎలా అయితే ఋషులు ధ్యానించే హిమాలయాలలో పుట్టి, నగరాలు, పల్లెలు, పుణ్యక్షేత్రాలు, కర్మాగారాల, యంత్రాల సమ్మర్ధం మధ్యనించి ప్రవహించివస్తూ ఆధుని కతకు ప్రతిరూపమైన కలకలత్తాని స్పృశిస్తూ, సాగరాన్ని చేరుకుంటూ పాత కొత్తలకు వంతెనగా - కనిపిస్తోందో అలాటి జీవనదే, మన భారతీయ సంస్కృతినీ, హిందూధర్మాన్ని కూడా యీనాటి వరకు సజీ వంగా నిలిపి వుంచుతున్నది. అది, నూనెశుద్ధి కర్మాగారాల నుంచి వెనక్కిచూస్తే పూర్వఋషులవరకూ భారత చరిత్రంతటా విస్తృతమై కనిపిస్తుంది.

అంటే వజ్రంలో అన్నిముఖాలూ ఎలా కాంతిని విరజిమ్ముతూ మెరు స్తుంటాయో అలాగే సర్వతోముఖమైన ఒక వైవిధ్యం, కొత్తదనం, యీ భారతజాతియొక్క అంతరాత్మలో ప్రతిబింబిస్తూ వుంటుంది. వెయ్యి రేకుల పద్మంలాంటిది భారతాత్మ!

అలాంటివే హిందూసంస్కృతీ, హిందూమతమూనూ. ఈ రెంటి

లోనూ వున్న సామాన్య లక్షణమే మనకి శ్రీకృష్ణుడిలోనూ కనబడుతుంది, మనిషిరూపం ధరించిన భారతదేశమే శ్రీకృష్ణుడు! ఆయనే భారతాత్మ!

నాలుగుదిక్కులా గోపురద్వారాలతో అందర్నీ ఆహ్వానించి పిలిచే దేవాలయంలాంటివాడు శ్రీకృష్ణుడు. ప్రతి మనిషికీ తగినట్టు వేరు వేరు మార్గాలు చూపెట్టాడు. పరమార్థం చేరటానికి! భారతాత్మ అనీ యిప్పుడు దేన్ని చెప్పుకుంటున్నామో అది, శ్రీకృష్ణుడి పేరు వినగానే మన అంతరాత్మకి తప్పక గోచరిస్తుంది. బహుముఖత్వంగల వ్యక్తిత్వంతో జీవంతో తొణికిసలాడే మానవతామూర్తిగా సంస్కృత భారతం చూస్తే మనకి కనిపించే ఆదర్శపురుషుడు శ్రీకృష్ణుడు! చరిత్రనే విస్మయ పరచే విచిత్రవ్యక్తి, మానవజాతి ఎప్పుడూ విస్మరించటానికి వీల్లేని మహోన్నత వేదాంతి; గొప్ప ప్రవక్త; మహాశూరుడు, యుద్ధనీతికోవిదుడు; రాజ్యతంత్రజ్ఞుడు, ధర్మస్థాపకుడు, సమాజానికి నిస్వార్థంగా సేవచేసి 'తన'కంటే సమాజమునే ముందుగాపెట్టిన ఆదర్శజీవి ఆయన! సర్వ మానవాళినీ తన అంతరాత్మతో అభేదంగా ఒకటిగా గమనించటమే ఆదర్శంగానూ, ఆధ్యాత్మిక ధ్యేయంగానూకూడా మానవాళికి ఉపదేశించిన మహోన్నతజీవి. ప్రేమే జీవితానికి ఆరాధన, సత్యమే ప్రాణానికి శ్వాస అని నమ్మిన ప్రవక్త! అందుకే ప్రతిమతంలోనూ వుండే సంకుచితత్వంలేని శాస్త్రీయగ్రంథంగా, భగవద్గీతను మానవజాతికి అందరికీ అనుష్ఠేయంగా అందించాడు.

అందరి మానవులకీ ప్రాణంవలె అవసరమయిన సత్యాలను గ్రంథస్థంచేసి మొదటిసారిగా శాస్త్రీయమైన చక్కని బాటని భగవద్గీత ద్వారా అందించిన ఆదర్శవ్యక్తి ఆయన. అందుకనే ఎన్ని రకాల మనుష్యులున్నారో అన్నిరకాల మార్గాలూ చూపిస్తుంది... భగవద్గీత.

ప్రపంచంలాంటిది భగవద్గీత. ప్రపంచానికి ప్రతిచిహ్నామే భారత దేశం. భారతదేశానికి అంతరాత్మే శ్రీకృష్ణుడు!

ఈరోజున మనకి ప్రపంచంలో ఎటుచూసినా నవసమాజ స్థాపనకు జరుగుతున్న ప్రయత్నాలు, ఊహలు, ఆలోచనలూ, ఆశలే కనిపిస్తు న్నాయి. ఎటుచూసినా మరోప్రపంచం నవసమాజం వీటికోసమే మానవాళి కలలుకంటూ వున్నది.

సమాజంలో ప్రతి ఒక్కరూ సుఖశాంతులతో వుండేటట్టు, నిత్య జీవితావసరాలు, భోగభాగ్యాలు, ఆర్థికసంపద యివన్నీ దేశంలో అందరికీ సమానంగా పంచబడాలని అనుకోవటం - ఇదంతా గూడా మనం ఈ రోజున క్రొత్తగా మొదలుపెట్టబడిన సిద్ధాంతంగా అనుకుంటున్నాము. దీన్నే 'సోషలిజం' అని పిలుస్తున్నాము. దీన్నే సామాజికవాదం అనీ - అంటే సమాజంలో వున్న ఐశ్వర్యం, ధనం, నిత్యజీవితావసర వస్తువులు, భోగభాగ్యాలు, దేశంలోని ఆర్థికసంపద యివన్నీ కూడా దేశంలో ఏ కొద్దిమందికో అందుబాటులో వుండి తక్కిన వాళ్ళందరూ దారిద్ర్యంతో కుమిలిపోవలసిన అగత్యం లేకుండా దేశంలోవున్న భోగభాగ్యాలన్నీ అందరికీ పంచడం, అవి అందరూ సమానంగా అనుభవించటం - ఇది ఈనాడు మనకి కొత్తగా వినబడుతున్న సిద్ధాంతం.

ఇది ప్రపంచంలో ఫ్రెంచి విప్లవంతో ప్రారంభమై కూలివాడూ, కష్టపడి పనిచేసేవాడూ, ఆహారపదార్థాలు పండించేవాడు వీళ్ళందరూ ఆకలితో అలమటించి కృశించే పరిస్థితి దేశంలో వుండకూడదని, కార్మి కులకీ, కర్షకులకీ దాస్యంనుండి విముక్తి లభించాలని ఒక గొప్ప నినాదం బయల్దేరటం మనం నేటి చరిత్రలో ఎరిగున్న విషయమే.

అది ఫ్రెంచి విప్లవంతో ప్రారంభమయి - సామాన్యుడికి రాజ్యం, అధికారం చేతుల్లో వుండాలని రష్యన్ విప్లవంలోనూ, తరువాత సామ్యవాద రూపంలో అంటే "కమ్యూనిజం" రూపంలోనూ బైటికి వచ్చింది. అది చైనాలో వికృతరూపం ధరించింది.

తరువాత అది వెర్రితలలు వేసి చిలవలుపలవలై శక్తి కోసం, అంటే రాజకీయంగా అధికారంకోసం, కొట్లాటలలోకి దిగింది. అసలు ముఖ్యవిషయం అడుగునపడింది. ఈ రాజకీయపు కొట్లాటలు, యుద్ధాలూ ఇదిమట్టుకు మిగిలింది. ఇది ఈనాడు కొత్తవిషయమని మనమంతా అనుకుంటున్నాం.

ఈ సామ్యవాదం అనే సామాజికవ్యవస్థ, పూర్వం...యాభై శతాబ్దాల కిందటనే - మొట్టమొదటగా ప్రపంచంలో ఆవిష్కరణ చేసినవాడే శ్రీకృష్ణుడు.

సామ్యవాదమంటే సామాన్యుడికీ సుఖశాంతులుండాలి - కార్మికులకీ, కర్షకులకీ, బుద్ధిజీవులకీ అంటే వైజ్ఞానిక, సాంఘిక, విద్యా రంగాలలో సమాజానికి ముందుదారి చూపించే మేధావుల వర్గానికి తెలివితేటలు, జ్ఞానం గలవారికీ దేశంలో ఉత్పత్తి చేసేవాళ్ళకీ, యీ ముగ్గురికీ సమాజంలో కిరీటంలాంటి స్థానంవుండాలి అని మొట్ట మొదటగా ఎలుగెత్తి చాటి చెప్పినవాడు - నవసమాజ స్థాపకుడని చెప్పుకోటానికి ఒప్పినవాడు ఒక్క శ్రీకృష్ణుడే!

ఈ నవసమాజస్థాపనకు ఒక కొత్త సామాజిక విధానమే ఆ రోజున శ్రీకృష్ణుడు బయలుదేరదీసినటువంటిది. ఇది ఒక సామాజిక సిద్ధాంతం.

కృష్ణుణ్ణి మనం "గోపాలుడు" అని అనటం చాలా పరిపాటి.

గోపాలుడు అంటే "గోవులు" అంటే ఆవులు, ఎద్దులు - పాడి యిచ్చే టటువంటివి. మనకి పెరుగు, పాలు, వెన్న మొదలయిన నిత్య జీవితావసర వస్తువులు యిచ్చేవి, వ్యవసాయంలో మనకి తోడ్పడే జంతువులని అర్థం. ఈ గోవులే దేశానికి సంపద. ఆహారం ఎంత ఉత్పత్తి చెయ్యబడుతోందీ దేశంలో అన్నదే దేశసంపదకి నిదర్శనం. ఇది యీనాడు ఆర్థికశాస్త్రవేత్తలు కొత్తగా కనుగొన్న సత్యం అని మనం అనుకునేదానిని ఆనాడు యాభైవందల సంవత్సరాల క్రితమే శ్రీకృష్ణుడు నొక్కి చెప్పాడంటే మనకి చాల ఆశ్చర్యంగా వుంటుంది.

దేశంలో సంపదకి నిదర్శనం నోట్లుగాదు. కాని అచ్చువేసిన ఈ కాగితపు డబ్బుమీద ఆధారపడి యీ కాగితపు నోట్లే చూసుకుని సంతోషపడే దౌర్భాగ్యపుకాలం మనది. ఇటువంటి సంకుచిత దృష్టితో కాగితపు డబ్బునే చూసుకుని నిజానికి సంపద ఏదో, దేశానికి నిజమైన భాగ్యం ఏదైతే వున్నదో దాన్ని విస్మరించే ప్రమాదం దేశంలో ఈనాడు మనకున్నది.

ఇటువంటి దుష్టకాలంలో "నిజమైన భాగ్యం అంటే ఏమిటి దేశానికి?" అనేవిషయం ఒక్కసారి గుర్తుచేసుకోడానికి, మన జీవితం, మనదేశ జీవితంలోని ఆర్థికవిధానాన్ని ఒక్కసారి సరిదిద్దుకోటానికి కావలసినటువంటి సిద్ధాంతం శ్రీకృష్ణుడిచ్చాడు. ఆవులే దేశానికి సంపద. గోవులు పాలించేవాళ్ళే గోపాలకులు. గోపాలకులు అంటే ఒక్క గొల్లవాళ్ళనే కాదు అర్థం. కృషిచేసేవాళ్ళు; పాలూ పెరుగు ఉత్పత్తి చేసేవాళ్ళు, పాడిపంటలని దేశంలో సంరక్షించేవాళ్ళు, మనకు కావలసిన ఆహారాన్నిచ్చే వాళ్ళు - వీళ్ళే దేశానికి సంపద.

ఇలా పంటలు, పాడి, వీటిని యిచ్చేవాళ్ళకందరికి చిహ్నమేమిటి? (గుర్తు) - నాగలి; దీన్నే హలం అంటారు. హలమంటే, నాగలి అన్న మాట. అలాంటి నాగలిని ధరించేవాడే హలధారి - బలరాముడే శ్రీకృష్ణుడికి తోడునీడ, అనుచరుడు. పంటలు పండించే కర్షకుడికి చిహ్నమే బలరాముడు. పాడి, పశుసంపదని రక్షించే వాళ్ళే గోపాలకులు. ఈ గోపాలకులకి చిహ్నమే శ్రీకృష్ణుడు అందుకే మనం కృష్ణుణ్ణి "గోపాలా" అని గోముగా పిల్చుకుంటాం.

ఈనాడు సోషలిజంకూ, సోషలిష్టు పార్టీలకి గూడా నాగలి, వరి కంకులు, జొడెద్దులు - ఇంతకన్న వేరే మేలైన చిహ్నం దొరకలేదంటే ఆశ్చర్యంకదూ? సామాజిక వాదానికి యివి గుర్తుగా పెట్టుకోవటం మనం ప్రపంచంలో అనేకచోట్ల చూస్తున్నాం. మొట్టమొదటిసారిగా నాగలిచిహ్నం భూచక్రమంతటా గూడా సామాన్యుడి పరిపాలనకి గుర్తుగా చక్రమూ - చిహ్నాలుగా పెట్టుకున్న శ్రీకృష్ణబలరాములిద్దర్నీ మొట్ట మొదటి నవసమాజ స్థాపకులుగా మనం అనుకోవటం ఎంతైనా ఒప్పు తుంది.

క్రీస్తుపూర్వం ముప్పైశతాబ్దాలకి పూర్వమే ముందుగా ప్రపంచా నికి సరైన సిద్ధాంతాన్ని చాటిచెప్పిన - రాజకీయంగా సాంఘికంగా కూడా గురువుగా మనం శ్రీకృష్ణుణ్ణి అనుసరించవచ్చు.

అయితే ఇక్కడ చాలా ముఖ్యమయిన విషయం ఒకటున్నది. ఈనాడు మనం సామాజిక విధానం అని ఏదైతే అంటున్నామో సోషలిజం అనే పేరుతో దాని వెనకాల కొన్ని పొరపాట్లు గూడా వున్నాయి. అవి యేమిటి?

ఆర్థిక విధానంలో ప్రజలందరికీ సమానత్వం వుండాలనటం చాలా ధర్మమయిన విషయం. పూర్వం వున్నటువంటి ఆర్థికవిధాన సిద్ధాంతం ఇప్పుడున్న దానికంటె చాలామంచిది. ఎందుకంటే దేవుడు లేడనే నాస్తిక వాదం సామ్యవాదంతో ముడిపెట్టారీరోజున, కాని శ్రీకృష్ణుడు మనకి తెలియజెప్పేదేమంటే ప్రపంచంలో అందరికీ సమానత్వం వుండాలంటే, అందరూ సుఖంగా ఉండాలంటే, సామాజిక విధానం ఉండాల్సిందే. సామాజికవాదం సరయిందే.

కాని సామాజికవాదంతోబాటు భగవంతుని ఉనికిని కూడా గుర్తించి నట్లయితే మనుష్యులయొక్క మనుగడ, జీవితం చాలా సుఖప్రదం అవుతుంది.

మనిషికి పంటలు ఎక్కడినుండి పండుతున్నాయో, జీవుడు పుట్టుక ఎక్కడినుండి పుట్టుతున్నాడో, ప్రపంచంలో అన్ని వస్తువులకీ పుట్టుకనిచ్చే మహాశక్తి ఏదైతేవుందో అది ఈశ్వరశక్తి. ఆ ఈశ్వర శక్తిని మరచిపోయి నప్పుడు మనిషికి యుద్ధాలూ, సంక్షోభాలూ, కరువులూ, కాటకాలూ ఇవన్నీ తప్పవు.

సమాజంలో అందరూ హాయిగా వుండాలనేటటువంటి సామాజిక విధానం సర్వాన్నీ మనకిచ్చిన ప్రకృతివెనక రహస్యంగా వున్న శక్తి ఏదైతే వుందో - భగవచ్ఛక్తి, ఆ భగవత్ శక్తిని మనమందరం గుర్తుంచు కుని ఆ భగవంతుడే అందరినీ పుట్టించాడు ‛కాబట్టి, లేదా అందరి పుట్టుకకీ కారణం కాబట్టి అందరు మానవులూ, సోదరులనేటువంటి భావం కలిగివుండి ప్రపంచంయొక్క మంచికి దారితీయాలి అనేటు వంటి ఒక కొత్త ధర్మనినాదాన్ని శ్రీకృష్ణుడు ప్రారంభించాడు. ధర్మమంటే ఏమిటి?

ధర్మ స్థాపనకోసం భగవంతుడు అవతారం ఎత్తుతాడని మనకి పురాణాల్లో వినబడుతూ వుంటుంది. ధర్మం ధర్మం అని ప్రతివాడూ ఆ మాటని ఉపయోగిస్తుంటాడు గాని "ఏమిటీ ధర్మం" అని ఎవరూ ఆలోచించరు. ధర్మమంటే ఏమిటంటే ప్రపంచంలో ఏ ఒక్కడికో లాభం, కూలీలకి ఒక్కళ్ళకే సుఖం, కర్షకులకే రాజ్యం, వీళ్ళకే రాజ్యం వాళ్ళకే సుఖం, తక్కినవాళ్ళు నశించాలనే నినాదాలు కాకుండా ప్రతి వొక్కరికీ, ప్రతి జీవుడికీ, ప్రతి మనుష్యుడికీ అందరికి సమానంగా సుఖమూ, శాంతీ ప్రసాదించాలనేటువంటిది అందరి శ్రేయస్సూ కోరేదే ధర్మం. విశ్వశ్రేయస్సు కోరేది ఏదైతేవుందో దాన్నే ధర్మం అంటారు.

విశ్వశ్రేయస్సును ఎందుకు కోరాలి? అందరూ భగవంతుడి యొక్క బిడ్డలే కాబట్టి. అందరినీ ఒకే ఈశ్వరశక్తి, లేక ప్రకృతి శక్తి సృష్టించింది కాబట్టి.

తెలివితేటల్లో తేడావున్నా, బలంలో తేడావున్నా, ఆర్థిక స్తోమతలో తేడావున్నా, చివరికి గుణంలో తేడావున్నాగానీ అందర్నీ సృష్టిలో సమానంగా ఒకేశక్తి సృష్టించింది కాబట్టి అందరూకూడా, సోదరులు అనేటువంటి వైజ్ఞానిక (Scientific) మూలము మాత్రమే, యీ సామాజిక విధా నానికి పట్టుకొమ్మ. ఈ విషయంలో ఈరోజున వున్న సోషలిజం కంటే ఈ రోజున వున్న కమ్యూనిజంకంటే శ్రీకృష్ణుడు భగవద్గీతలో ప్రతిపాదించిన కొత్త సోషలిజం "నవ సమాజవాదం" చాలాగొప్పదని చెప్పవచ్చు.

ఇదే యీనాడు మన భారతదేశం గనక అనుసరించ గలిగినట్టయితే కమ్యూనిస్టు దేశాలైన చైనా, రష్యాలకి కూడా మన భారత

దేశం మార్గదర్శి కాగలదు. నాయకత్వం వహించగలదు.

ఈనాటి సమాజవాదంతోపాటు భగవంతుని యొక్క అస్థిత్వం, అన్ని విషయాలూ గమనించినట్టయితే మనుష్యుడికి వచ్చే అనేక కష్టాలు తొలగిపోగలవు అని శ్రీకృష్ణుడు చాటిచెప్పాడు.

ఈ విధంగా ఒక ధర్మమనే భావం ప్రజలకు యిచ్చి, ప్రజలలో అందరూ కూడా సుఖపడాలని కార్మికుడికీ కర్షకుడికీ చాలా ప్రముఖ మైన స్థానమియ్యాలని చెప్పి తాను కిరీటం పెట్టుకోకుండా, రాజు లందరితో పోట్లాడి, రాజులందరినీ అందులోనూ నిరంకుశులైన, ద్రోహు లైన సాంఘిక, రాజకీయ నాయకులందరినీ పడగొట్టి సామాన్యుడికి సుఖంగావుండే "ధర్మరాజ్య" స్థాపన చేసినవాడే శ్రీకృష్ణుడు.

అలా ధర్మరాజ్యాన్ని స్థాపనజేసి, అటువంటి రాజ్యానికి నాయ కుడుగా ఎవర్ని నిలబెట్టాడు? తనకితానై వుండలేదు. ఈనాటి రాజకీయనాయకుల మాదిరిగా పదవి దొరకగానే దొరకపుచ్చుకోలేదు. స్వార్థంకోసం కాదుకదా యిదంతా చేసింది!

నిస్వార్థంగా ఈపనంతాచేసి, నిజంగా ధర్మరాజు అనిపించుకో దగ్గ మనిషి, స్వార్థం తక్కువ్గా వున్నటువంటివాడు, నిరంకుశుడు కానివాడు, మెత్తనైనవాడు, శాంతికాముకుడూ అయిన ధర్మరాజుని రాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు.

అలా రాజ్యాభిషిక్తుడిని చేయటం కూడా రాజులందరూ కలిసి ఈనాడు ఎలాగయితే ఎమ్మెల్యేలు (M.L.A's), పార్లమెంటు మెంబర్లూ కలిసి రాష్ట్రపతిని ఎన్నుకుంటున్నారో, అదేవిధంగా ఆ రోజున వివిధ రాష్ట్రాలకి పాలకులయిన రాజులు, సామంతరాజులూ అంతా కలిసి

ఒక సభచేసి రాజసూయ సభ, ఆ సభలో ఏకగ్రీవంగా ధర్మరాజుని ఎన్నుకున్నారు. అలా ఎన్నుకున్నటువంటి వాడు ప్రజావాక్యానికి, ప్రజానాయకుల అభిప్రాయానికి అనుకూలంగా, ప్రత్యక్షంగా నాయకుడై హస్తినాపురంలో చక్రవర్తిగా అభిషేకం చెయ్యబడినాడు.

కాబట్టి, భారతదేశ చరిత్రలో శ్రీకృష్ణుడు వహించిన పాత్ర శ్రీకృష్ణుడు భారతదేశానికిచ్చిన సందేశమూ మనకి అమూల్యమయిన రెండు కానుకలు. అందులోనూ శ్రీకృష్ణుడిచ్చిన రాజకీయసందేశం, ధర్మంతో కూడిన సామాజిక వ్యవస్థ ఇదే శ్రీకృష్ణుడు మనకిచ్చిన అమూల్య సందేశం. మనం గుర్తించితే యిదీనాడు దేశానికే కొంగు బంగారం. మనల్ని రక్షించే తాయెత్తు.



## 2

# భారతదేశచరిత్రలో శ్రీకృష్ణుని పాత్ర

శ్రీకృష్ణుడంటే తెలియనివారుండరు. ఆయన మనదేశ చరిత్రకే కథానాయకుడు. భారతజాతి అమరగాథలో ఆయనే కథానాయకుడు. నవభారత నిర్మాణానికి ఆయనే సూత్రధారుడు. చరిత్రంతా ఈ పక్క నించి ఆపక్కకి గాలించినా అలాంటి వ్యక్తి, అలాటి పాత్ర మరి కనపడదు. మన భరతదేశంలో జన్మించిన మహోన్నతవ్యక్తి శ్రీకృష్ణుడు.

భారతీయులమైన మనకి మనుషుల్ని పూజించటం తెలుసునే గాని, అర్థంచేసుకోవడం తెలియదు. శ్రీకృష్ణుని భగవంతుడి అవతారంగా, మానవరూపంలో జన్మించిన దేవుడిగా ఆరాధించాం. కాని మానవుడిగా ఆయన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటం కూడా చాలా అవసరం.

మనిషిగా శ్రీకృష్ణుడనే వ్యక్తి ఈనాడు మనఎదురుగా జీవించి వుంటే ఆయన మానవజాతికి చేసిన మహత్తరసేవ, వివిధ రంగాల్లో ఆయన చూపిన సర్వతోముఖ ప్రతిభ ఎలా విలువ కడతామో ఆ విధంగా, మన సోదరుడుగా, ఆయనను తెలుసుకోవటానికి ప్రయ త్నించుదాం!

దానివల్ల ఆయన ప్రతిరూపం మన మనస్సుల్లో సజీవంగా, రక్తమాంసాలతో ఉట్టిపడుతున్న చైతన్యమూర్తిగా మనకి గోచరిస్తుంది.

ఏ మానవసమాజమూ తన జాతిలో జన్మించిన మహావ్యక్తుల్ని సరిగ్గా అర్ధం చేసుకోవటంకన్న వాళ్ళకి చెయ్యగల మహత్తర గౌరవం యింకొటిలేదు. వాళ్ళ విగ్రహాల్ని పూజించి వాళ్ళు మనకి నేర్పిన సత్యాలను పూడ్చిపెట్టడం నిజమయిన ఆరాధన కానేకాదు! అందుకని శ్రీకృష్ణుని భగవంతుడిగా కాకుండా మనిషిగా, మానవమూర్తిగా ఆయన ఏమేమిపనులు చేశాడో, చరిత్రలో శ్రీకృష్ణుడికి గల స్థానం ఏమిటో, రాజకీయంగా దేశానికెటువంటి విజయం సాధించిపెట్టాడో; వేదాంతిగా, రాజకీయ, సాంఘిక నాయకుడిగా యోగిగా, మానవతావాదిగా ఎటు వంటి గొప్ప పనులు చేశాడో అవన్నీ కూడా సూక్ష్మంగా వివరిస్తాను.

సాంఘిక ప్రవక్తగా సంఘంలో శ్రీకృష్ణుడు చేసిన అత్యుత్తమ మైన పని ఏమిటి? ఆనాటి సాహిత్యంలో, విజ్ఞాన రంగంలో శ్రీకృష్ణుడి కున్న స్థానమేమిటి? అనేక రంగాల్లో ఆయన చేసిన పనుల ద్వారా మానవజాతికి ఆయన అందించిన అమూల్య సందేశం ఏమిటి? దేశంలో వున్న రాజకీయ వాతావరణాన్ని ఆనాడు ఆయన ఎలా మార్చాడు? దేశాన్ని ఏకత్వంవైపు, ధర్మంవైపుకి నడిపించటానికి ఎలా శ్రమపడ్డాడు.

ఈనాటికిమల్లేనే మానవజాతి అంతా ఆరోజుల్లో ఒక ధర్మ విప్లవంలో, తుఫానులోలాగ, ఈ పక్కనుంచి ఆ పక్కకి ముంచెత్త బడుతూవున్న సమయంలో జన్మించాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడు యిప్పటికి సుమారు 50 శతాబ్దాలకు పూర్వం సరిగ్గా చెప్పాలంటే ఫిబ్రవరి 20వ తేదీ క్రీస్తుపూర్వం 3102 నాడు అర్ధరాత్రి, ద్వారకా పట్టణ సమీపంలో నిర్యాణం చెందాడు. (20-2-3102 B.C.) అంటే ఆయన ఇప్పటికి సరిగ్గా ఐదువేల సంవత్సరాలనాడు జీవించాడన్న మాట! ఆశ్చర్యంగా లేదూ! మనకందరికీ నిన్నమొన్న జరిగినట్టు కొత్తగా వుంటుంది. కృష్ణుడికథ, ఆయన చేతలు, సాహస గాథలూ, ఆయన మనకిచ్చిపోయిన భగవద్గీత ఆయన నడిపిన మహాభారతగాథ ఇదంతా యాభైశతాబ్దాలు గడిచినా మనల్ని యింకా నోరూరిస్తున్నా యంటే కారణం ఏమిటి?

దీనికి కారణం వొక్కటే. ఆయనగాథ నిత్యనూతనం. ఆయన మనకి నిత్య యౌవనుడు. ఎవరూ ఆయన్ని ముసలివాడుగా, వృద్ధుడుగా కూడా ఊహించలేరు. ఆశ్చర్యంగా లేదూ? నిజానికాయన మరణించే నాటికి శతవృద్ధుడే. కౌరవులకి రాయబారం నడిపిననాటి కాయన వయస్సు 90 సంవత్సరాలు. అంటే ఈనాడు రాజాజీ వయస్సులో వుండగా, పండిన రాజకీయ విజ్ఞానంతో, కయ్యానికి కాలు దువ్వుతున్న రెండు పక్షాలకి శాంతిసందేశం తీసుకువెళ్ళాడన్నమాట. 90 ఏళ్ళ వృద్ధుడైన శ్రీకృష్ణుడు! అందుకే అన్నాను ఆయన మనందరి మనస్సులోను నిత్యయౌవనుడు అని! ఏనాటికీ మాయని పాతపడని అమరగాథ ఆయన జీవితగాథ.

ఈనాటికికూడా శ్రీకృష్ణుని గురించి యింకా కథలూ, కావ్యాలూ, పుస్తకాలూ, నవలలూ వెలువడుతున్నాయంటే శ్రీకృష్ణుడంటే మనకున్న ఆసక్తి, ప్రేమా ఏమాత్రం తగ్గలేదని యాభై శతాబ్దాలూ ఏమాత్రం చెరపజాలకపోయిన సత్యాన్ని ఋజువుపరుస్తున్నాయి. ఆనాటి వ్యాస మహర్షి వ్రాసిన మహాభారతం మొదలుకొని ఈనాటిదాకా వెలువడిన శ్రీకృష్ణుడి సాహిత్యము వెల్లువగా, వివిధంగా పారింది. ఇలాగ అనేక శతాబ్దాలుగా మానవజాతిని, భారత జాతినీ సమ్మోహపరచిన వ్యక్తి ఎటువంటివాడైవుంటాడు?

ఆనాడు 20 ఫిబ్రవరి అర్ధరాత్రి. ప్రభాసతీర్థంవద్ద ద్వారకా పట్టణ సమీపాన, ఆ యుగపురుషుడు కన్నుమూసిన ఘడియ భారత జాతికే చిరస్మరణీయమైనది. ఎందుకనంటే ఆరోజున సరిగ్గా ఏ సమయానికి ఆయన కన్ను మూశాడో అదే ముహూర్తంలో ప్రపంచమంతటా మనం "కలికాలం" అని చెప్పుకునే "కలియుగం" ప్రవేశించింది. అంటే శ్రీకృష్ణ నిర్యాణకాలమే మన ఆధునికయుగం (Modern Age) అని పిలిచే కలియుగం ప్రారంభించిన కాలమన్నమాట. అందుకనే శ్రీకృష్ణుడి పట్ల "యుగపురుషుడు" అన్నమాట నూటికి నూరుపాళ్ళూ సత్యమయింది.

శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడా? ఆయన యీ భారతదేశం గడ్డమీద తిరిగి, యీనేల మెట్టింది ఎన్ని శతాబ్దాల కింద? ఇవన్నీ మనలో తరచు ఉదయించే ప్రశ్నలు.

శ్రీకృష్ణుడు చారిత్రక వ్యక్తేనా అని అడగాల్సిన అగత్యం వున్నదా? అని ఆశ్చర్యం కలగవచ్చు. అంటే శ్రీకృష్ణుడనే ఒక వ్యక్తి నిజంగా

జీవించివుండేవాడనటానికి గల చారిత్రక ఆధారాలేమిటి? అన్న విష యము వేరే చర్చించవలసి *వున్నది. అసలీ విషయం వేరే చెప్పాల్సిన అవసరం వుందా? అనికూడా మనం ఆశ్చర్యపోవచ్చు. ఎందుకంటే,

---

* ఈ విషయం "శ్రీకృష్ణుని కాలం" అన్న అధ్యాయంలో పరిశీలించ బడింది.

శ్రీకృష్ణుడి చారిత్రకతకు సంబంధించిన అంశాలు - ఈనాడు ఆయన గురించి మనకి తెలిపే మూలగ్రంథాలైన మహాభారతం, విష్ణుపురాణసంహిత, భాగవతం పట్టిచూస్తే - ఏం తేలుతాయో, వాటిని యీ క్రింద పొందుపరుస్తాను. ఈ మూలగ్రంథాల్నుంచి మనకి అనేక ఆశ్చర్యకరమైన విషయాలు తెలుస్తాయి. అవి యేవంటే -

I. మహాభారత యుద్ధమనే ఒక 'ప్రపంచ యుద్ధం' జరిగింది.

II. అందులోనూ క్రిందటి ప్రపంచ యుద్ధంలో (World War II) లాగే భయంకరమైన జననష్టం కలిగింది.

III. ఆ మహా యుద్ధంలో శ్రీకృష్ణుడు శాంతిదూతగా తన రాయభారం విఫలంకాగా, తటస్థ విధానాన్ని అవలంభించి, ఆయుధాలు విసర్జించి నిస్సాక్షికంగా తన సేనలు ఒకపక్షాన - తానింకొకవంకా, (యుద్ధం చేయకుండా) వుండి పోయాడు.

IV. అనేక దేశాల సేనలు అందులో పాల్గొన్నాయి.

V. ఆ భయంకర సంగ్రామం జరిగిన కాలానికివున్న ఖగోళ విషయాలు, గ్రహగతులు, నక్షత్రపరిస్థితి వివరంగా మహాభారతంలో ఇవ్వబడినాయి.

VI. శ్రీకృష్ణుడు రాయబారం తీసుకు వెళ్ళిననాటి తిథి, వారనక్షత్రాలు ఆ కాలంలోవున్న గ్రహస్థితితో సరిపోతాయి.

VII. శ్రీకృష్ణుడి జన్మ, నిర్యాణం, పరీక్షిత్తు పట్టాభిషేకం ఇలాటి విషయాలు తెలిపే గ్రహ నక్షత్ర విషయికమైన ఖగోళ వైజ్ఞానిక సత్యాలు (Scientific Facts) పరిశోధిస్తే ఇంకా మనకి దొరుకుతాయి.

ఈనాడు ఏదైనా విపరీతపు వాదన లేవదీయటమే ఒక తెలివితేటల లక్షణం అనుకునే చాలామంది పండితులు శ్రీకృష్ణుడనే వ్యక్తి ఉన్నాడా? లేడా అన్న విషయము మీద పెద్దపెద్ద గ్రంథాలు వ్రాశారు.

వీళ్ళు 'శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడేనా? అన్నదొక సమస్యగా కల్పించటమేగాక ఇద్దరు కృష్ణులు వుండేవారనీ లేదు, ముగ్గురనీ ఇలాగ పెద్దపెద్ద "థీసెస్" (Thesis) లు వ్రాసిన వాళ్లున్నారంటే, మన దేశంలో ఉద్యోగం కోసం, ఓ డిగ్రీ సంపాదించటం కోసం చదువుకున్న వాళ్ళే దిగజారుతున్న స్థితికి జాలివేస్తుంది. ప్రస్తుతం మనకిక్కడ సంబంధించినది, శ్రీకృష్ణుడి కాలం నిర్ణయం చెయ్యటానికి మనకి ఉపయోగపడేవి, వైజ్ఞానిక (Scientific) ఆధారాలు మాత్రమే.

అయితే శ్రీకృష్ణుడికి సమకాలంలో వ్రాసిన మూలగ్రంథాలు సంస్కృతంలో వున్నవి. అందులోని సాంకేతిక విషయాలు తెలియని సామాన్య ప్రజలు, యీనాటి రాతలుచూచి మోసపోకుండా ఆనాడు వ్యాసమహర్షి పరాశర మహర్షి మనకోసం వర్ణించిన ఆధారాలూ; అంశాలూ తెలుసుకోవడం మాత్రం యిక్కడ మనకి అవసరం.

ఈ విపరీతపు ధోరణులు, రాతలూ మనకి చూడ్డానికి హాస్యంగా కనిపించవచ్చునుగాని నిజమైన చారిత్రక విషయాలు తెలియకపోతే ప్రజలు ఆ తప్పులనే నిజమని నమ్మి, శ్రీకృష్ణుడనే వాడు కావ్యాల్లో రాసిన పాత్రల్లాగే, ఒక ఊహించబడ్డ పాత్ర అనుకునే ప్రమాదం ఎంతైనా వుంది.

శ్రీకృష్ణుడు చారిత్రకమైన పురుషుడు. అతడు మన దేశంలో అపూర్వమైన విజయాలు సాధించిన ఒక మహావ్యక్తి. చరిత్రలో అందరి గొప్పతనానికీ ఒక వ్యత్యాసం వుంది.

అదేమిటంటే మనం సామాన్యంగా చరిత్రలో ఎప్పుడైనా గొప్ప వ్యక్తి పుట్టాడంటే అతడు ఒక గొప్ప సైనికుడో లేక ఒక మహారాజో లేక ఒక మహా మేధావంతుడైన శాస్త్రజ్ఞుడోగాని, ఒక గొప్ప సంగీత విద్వాంసుడుగాని, ఒక మహా నాయకుడుగాని, వేదాంతిగాని అవటమో, అలా కాకపోతే శ్రీరామకృష్ణ పరమహంస, రమణమహర్షి, సాయినాధుల వంటి యోగీశ్వరుడుగాని, వివేకానందుడిలాంటి మహాత్ముడుగాని, ఆధ్యాత్మిక పురుషుడుగాగాని ఇలాగ ఏదో ఒక్క విశేషతగలవాళ్ళు అనేకమంది పుట్టి వాళ్ళ అపూర్వ ప్రభావంతో ప్రపంచాన్ని ఆశ్చర్య పడేట్టుచేసి మానవజాతినే ప్రభావితం చెయ్యటం, చరిత్రపుటలలో స్వర్ణాక్షరాలతో వాళ్ళు నిలిచిపోవటం కూడా మనం చూస్తూ వుంటాం. కాని శ్రీకృష్ణుడి విషయం మాత్రం అలాకాదు.

శ్రీకృష్ణుడిలో వున్న గొప్ప విశేషం ఏమిటంటే యిలా ఏదో ఒక్క రంగంలో గొప్పవాడవటమే కాకుండా అన్ని రంగాల్లోను గూడా సర్వతో ముఖంగా విశిష్టమైన శక్తి కలిగిన మహాపురుషుడు. ఆయనది బహు ముఖ ప్రజ్ఞ. సర్వతోముఖమైన సమగ్రమూర్తి - ఆయన. వ్యక్తిగా, ఏ కళాకారుడూ ఊహించటానికిగూడా సాధ్యపడనట్టి అసాధారణ వ్యక్తి! ఇంతవరకూ మళ్ళీ ఏ సాహిత్యంలోనూ, ఏ భాషలోనూ ఎవరూ అలాంటి పాత్రను ఊహించలేకపోవటాన్నిబట్టి చూస్తే ఆయన ఎవరి ఊహాగానంవల్లనో కల్పించబడిన పాత్రకాదని స్పష్టంగా తెలుస్తుంది. ఒక విధంగా చూస్తే ఆయనని పూర్ణ పురుషుడని చెప్పవచ్చు.

శ్రీరామకృష్ణ పరమహంస, రమణమహర్షులలో వుండే - అంత కంటే ఎక్కువనిపించే ఆధ్యాత్మిక సంపద; శంకరాచార్యులలోనూ, వ్యాస

మహర్షిలోనూ కనిపించే బుద్ధిశక్తి, తర్కనిశితత్వం, వారితోటి సమానంగా తులతూగేటటువంటి జ్ఞానం; ఏసుక్రీస్తులో కనిపించే పసితనం, ప్రేమ, నిర్మలత్వం; త్యాగరాజు, మీరాబాయిలలోని అమరగాన మధురిమ, కళాత్మకమైన హృదయం; జయదేవుడు, గౌరాంగుడు: వీళ్ళనిమించే జగత్సమ్మోహనమైన భక్తి అన్నీ కలిపి ఒక్క శ్రీకృష్ణుడిలోనే కలబోసి ఉన్నాయి.

...ఈరోజు కుస్తీలుపట్టి పెద్దపెద్ద శాండోలనిపించుకునే మల్లులను మించే బలం, సాహసం, శౌర్యము, తర్వాత దేశానికి తన స్వార్థం అనేది లేకుండా కంకణము కట్టుకొన్న నిస్వార్థ దేశభక్తి, ప్రజా ద్రోహులనబడేటువంటి బలవంతులైన, భయంకరవ్యక్తులైన ఆనాటి రాజకీయ నాయకులను కూలద్రోయటానికి ఆయన తీసుకున్న ప్రమాద మైన సాహసము, ధర్మస్థాపన కోసము ఆయనపడ్డ శ్రమ, ఆయన దూరదృష్టి యీవన్నీ కలిసి శ్రీకృష్ణుని బహుముఖ వ్యక్తిత్వంలో కొన్ని అంశాలు మాత్రమే.

ఇటువంటివి అన్నీ కలిసి ఒక్క వ్యక్తిలో ఒక్కసారిగా విప్పారటం, సహస్రదళ పద్మంలాగ వెల్లివిరియటం, చరిత్రలో చాలా అరుదుగా గాని జరుగదు. యాభైకోట్ల భారతీయుల యాభైశతాబ్దాల కలల పంట శ్రీకృష్ణుడు. మానవజాతి ఆశతో అర్రులచాచే ఆదర్శమే, మనిషిగా భూమికి దిగివచ్చిన దివ్యమూర్తి ఆయన.

ఏదో ఒక అంశంలో గొప్పతనం వున్నవాళ్ళు జన్మించటమే అరుదు. అందులోనూ శ్రీకృష్ణుడులాంటి వ్యక్తి చరిత్రలో అడుగుపెట్టడం, మానవజాతి చరిత్రలోనే అపూర్వ సన్నివేశం. అలాంటప్పుడు అన్నింటా

ఆదర్శపురుషుడనిపించుకొన్న శ్రీకృష్ణుడు మానవజాతికే ఆదర్శపురుషుడవటంలో ఏమీ ఆశ్చర్యంలేదు.

మన రోజుల్లో దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆ రోజులలో దేశంలో మతకలహాలు చెలరేగి, మనిషిని మనిషి చంపుకొని దేశం విచ్ఛిన్నకర శక్తులతో చిన్నాభిన్నం అయింది. "ఈ దేశం ఒక దేశంగా నిలబడుతుందా?" అనిపించేటటువంటి భయంకర పరిస్థితి ఏర్పడింది, అలాంటి పరిస్థితులలో అన్ని రాష్ట్రాలనీ చక్కగా ఏకీభవింపచేసి ఒక్క దేశంగా రూపొందించిన గౌరవం సర్ధార్ పటేల్‌కే దక్కింది.

సరిగ్గా అలాంటి విషమపరిస్థితినే దేశం ఎదుర్కొన్నది శ్రీకృష్ణుడి కాలంలోగూడా. కలతలతో, కలహాలతో కీచులాడుకునే రాష్ట్రాలన్నీ కలిపి ఒక్క దేశంగా, ఒక్క జాతిగా చెయ్యటం ఎంత కష్టమో చూశాం గనుక యీనాడు మనకి తెలుసు. మనకాలంలో పటేల్ దేశానికెటువంటి మహత్తరమైన రాజకీయ సేవచేశాడో ఆనాడు దేశానికి సరిగ్గా అలాంటి సేవచేశాడు శ్రీకృష్ణుడు. కాని శ్రీకృష్ణుడు పూర్ణ పురుషుడై అనేక గొప్ప పనులు చేసినప్పటికీ ఆయన చేసిన పనులు అన్నింటిలోకి చాల గొప్పదని చెప్పుకోతగ్గపని ఏమిటంటే - ఈరోజున "భారతదేశం" అన్న ఒక దేశాన్ని సృష్టించటమే! ఇదే శ్రీకృష్ణుడు మన జాతికి పెట్టిన భిక్ష!

దేశాన్ని సృష్టించాడంటే నేలనీ, మట్టినీ సృష్టించాడని కాదు, "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అన్నట్టు మనుషుల్లో "మనమంతా భారతీయులం" అనేటటువంటి భావం వ్యాపించటానికి మొట్టమొదటగా ఆయనే కారకుడు. అందుకే శ్రీకృష్ణుడు 'నవభారత నిర్మాత'.

భారతజాతికి భారతమనే పేరున్నంతకాలం ఈ దేశంలో గంగా యమునలు పారుతున్నంతవరకూ, మనం శ్రీకృష్ణుడిని మరువలేము. మనకో జాతీయతనిచ్చిన దేశనాయకుడు శ్రీకృష్ణుడే! మహాభారత నిర్మాణపు అమరగాథే 'భారతము'.

పద్దెనిమిది రాష్ట్రాలు ఏ రాష్ట్రానికారాజు వేరై, వాళ్ళలోవాళ్లే కొట్టుకొని, అంతఃకలహాలతో యుద్ధం చేసుకుంటూవుండే ఆనాటి భారతదేశాన్ని నెమ్మదిగా ఒక్కొక్కరినే కూడగట్టుకునివచ్చి, దేశద్రోహు లైన వాళ్ళని కూలదోసి, దేశ అనైక్యతకి కారకులైన రాజుల్ని, మంచి వాళ్ళయినాసరే కూలద్రోసి - నయానా భయాన లేకపోతే మంచి తనాన ఏవిధంగానైనాసరే మంచివాళ్ళందర్నీ ఒక జట్టుగా తీసుకొచ్చి దేశఐక్యతకు తోడుపడి, దేశాన్ని ఒకటిగాచేసి భారతదేశం అనేపేరు, భారతదేశమనే దానికో ఉనికి కల్పించి, మనకో భారతీయమైన దేశాన్ని ప్రసాదించాడు శ్రీకృష్ణుడు.

అందుకనే శ్రీకృష్ణుడి జీవితం గురించి వ్రాసిన మహత్తర గ్రంథానికి కూడా వ్యాసమహర్షి 'మహాభారతమనే' పేరుపెట్టాడు. "భారత" మని ఎందుకు పెట్టాడంటే భారతదేశంయొక్క మహత్తరమైన గాథే శ్రీకృష్ణునియొక్క గాథగనక. శ్రీకృష్ణుడి గొప్పతనమంతా భారతం మనకి ఒక మహాభారతంగా అందివ్వటంలోనే వుంది. భారతదేశం యొక్క అమరగాథే భారతగాథ. అదే మహాభారతగాథ.

రాజకీయంగా యీనాడు మనం భారతీయులమని చెప్పుకో టానికి - ఒక సంస్కృతి, ఒక వేదాంతం, ఒక తాత్వికదృష్టి, ఒక ఆధ్యాత్మిక దృక్పథం, ఒక సంస్కృతికి చిహ్నమైన సంస్కృతభాష, ఒక

యోగశాస్త్రం యిటువంటివేవైనా ఇంకా దేశంలో వున్నాయంటే అది ఆయన మనకి పెట్టిన అమూల్యమైన భిక్షే.

దేశంలో ఈనాడు ఒక ప్రాంతంలో అరవం మాట్లాడనియ్యండి, మరో ప్రాంతంలో తెలుగు మాట్లాడనియ్యండి, హిందీ మాట్లాడనియ్యండి - ఏ భాష మాట్లాడినాసరే హిమాలయపర్వాతాల దగ్గర్నుంచి కన్యా కుమారి వరకూ ఒక సంస్కృతి, భారతీయ సంస్కృతి వున్నదంటే ఆ భారతీయ సంస్కృతికి మూలం భారతమే. ఆ భారతానికి మూల కారకుడైన పురుషుడు శ్రీకృష్ణుడు.

అందుకనే వ్యాసమహర్షి ఇది మహత్తరమైనటువంటి చారిత్రక మైనట్టి సేవ కాబట్టి దాన్ని ఆచంద్రార్కంగా భారతజాతి, మానవజాతి కూడా గుర్తుంచుకొనే విధంగా గ్రంథస్థం చేశాడు.

గ్రంథస్థం చెయ్యటమేకాకుండా భారతదేశం విజయంగదా - అంటే భారతదేశంలోని అంతఃకలహశక్తుల్ని, విచ్ఛిన్నకర శక్తుల్నీ నాశనం చేసి దేశ పటిష్ఠతకి, దేశం ఐక్యం కావడానికి చేసిన మహత్తరమైన యుద్ధంలా ధర్మానికి విజయం ప్రాప్తించటం అనేటటువంటిది. అందులో శ్రీకృష్ణుడు భారతదేశానికి చేసిన మహత్తరసేవా ఆశ్చర్యకరం, సంతోషకర విషయాలు కాబట్టి, భారతీయులందరికీ మరపురాకుండా ఆచంద్రార్కం గుర్తుండేటట్టు కావ్యంగా గానం చేశాడు తన అమర వాణితో.

అయితే ఇది కావ్యమయినంత మాత్రాన చారిత్రకం కాదని అనుకోకూడదు, చారిత్రకమైన విషయాలు ఏవైనా జరిగినప్పుడే ఆనాటి కవులకి హృదయం ఉప్పొంగుతుంది. ఈనాడు మనం గొప్పగా చదువు

కునే షేక్స్పియర్ సాహిత్యం - ఎలిజబెత్ రాణి 'స్వర్ణయుగం' లోని విజయాలకి ఆ జాతి కవి హృదయ పులకరింతల ఫలితమే.

ఎప్పుడూ కనీవినీ ఎరుగనంతటి మహత్తర వ్యక్తితో బ్రతికి, ఆయన కాలంలో జీవించి, ఆయన చేసిన మహత్తర రాజకీయ కృత్యాలే కాకుండా ఆధ్యాత్మిక కృత్యాలు, సాంఘిక విప్లవాలు, ధర్మవిప్లవాలు చూసి, వాటిద్వారా ఒక జాతి పులకిస్తూంటే, చూసి ముగ్ధుడై వ్యాస మహర్షి అవన్నీ మనమందరం గూడా చూడాలి, ఆనందించాలి అన్న ఆసక్తితో వాటినన్నింటినీ మానవజాతి తెలుసుకోవాలన్న ప్రేమతో, మానవజాతి మీద అచంచలమైన ప్రేమతో గ్రంథస్థం చేసిన జాతీయ గీతమే, మహాభారతం కాబట్టే యీనాటికీ మన రక్తంలో సజీవంగా అది శాశ్వతంగా నిలిచిపోయింది.

లేకపోయినట్టయితే ఈనాడు రాసే భావకవులు, ఉద్రేక కవులు, యింకా రకరకాల కవులు రాసిన రాతల్లాగే, ఈనాడు న్యూస్‌పేపర్లో దాన్ని చదివి మర్నాడు చిత్తుకాయితంలాగ ఏ పళ్ళపొడి వేసుకుందుకో, మరెందుకో పనికొచ్చే కాగితంగా క్షణికంగా నశించిపోయి వుండేది. మహాభారతం గనక కొందరు అనుకునేట్టు వట్టి ఊహాగానం గనక అయివుంటే, ఇవాల్టికి పనికొచ్చేది ఓ రోజుకు ఓ గంటకు పనికొచ్చేలాగ వుంటుంది అలాటి సాహిత్యం. అలాకాకుండా చారిత్రకమైన విషయాల మీద ఆధారపడ్డ గ్రంథము అని చెప్పటానికి పై చెప్పిన గ్రహగతులు, నక్షత్రస్థితులు, యితర శాస్త్రీయ విషయాలుకూడా ఆధారం. ఇలాటి శాస్త్రీయ విషయాలు, చారిత్రక విషయాలమీద మనం సమగ్రమైన పరిశోధన చేస్తేనే, శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడు అని తెలుస్తుంది. అంతేకాదు, ఆయన సందేశం చరిత్రాత్మకమైందని కూడా తెలుస్తుంది.

అది ఈనాటి అంతఃకలహాలతో కొట్టుకుంటున్న మనకి, మన రాజకీయపు విషమస్థితిలో దేశం ఒడ్డునపడే తారకమంత్రాన్ని అందిస్తుంది. అది 'భారతజాతి ఏకత'.

ఇదే కాకుండా ఇంకో విశేషం కూడా వున్నది. ఆనాడు జరిగిన మహాభారత సంగ్రామము ఒక ప్రపంచయుద్ధం. 'ప్రపంచ యుద్ధం' అంటే మనం ఆశ్చర్యపడనక్కర్లేదు. ఊహాగానాలమీద ఆధారపడకుండా, మహాభారత మూలగ్రంథాన్ని గనుక చదివితే, అందులో వివిధ దేశాల్నించి వచ్చిన - చైనానుంచి, ఆఫ్ఘనిస్థానమునుంచి, గాంధార దేశంనుంచి, యవన దేశాలయిన యునాన్‌నుంచి, యితర తెల్ల జాతుల నుంచి సైన్యాలు - క్రితం జరిగిన రెండో ప్రపంచ సంగ్రామంలో లాగే యుద్ధంలో పాల్గొన్నాయని తెలుస్తుంది.

ఇటువంటి ప్రపంచ మహాసంగ్రామంలో జరిగిన జననష్టం, రక్తపాతం, అందువల్ల కలిగిన వర్ణసంకరం, సంఘవిప్లవం, ధర్మవిప్లవం అన్నీ కలిసి దేశానికో విషమ పరిస్థితిని తీసుకొచ్చాయి. ఇలాంటి విపరీత విపత్కరకాలంలో దేశాన్ని భారతజాతిని ధర్మరథంలాగ గమ్యస్థానానికి నడిపించి రాజసభ ఆమోదంతో యుధిష్టిరుడ్ని పట్టాభిషిక్తుడ్ని చేసి, దేశంలో సుస్థిరత కల్పించి, నిస్వార్థ దేశసేవ చేసిన మహావ్యక్తి శ్రీకృష్ణుడు. అలాంటి మహావ్యక్తిని ఆయన చేసిన అపారమైన దేశసేవ, ఆయన చూపిన బహుముఖ ప్రజ్ఞ చూసి ఆశ్చర్యపడ్డ మానవజాతి, ఆయనను మానవోత్తముడుగా, మూర్తీభవించిన ధర్మస్వరూపుడుగా - భగవంతుడి అవతారంగా, ఆరాధించారంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు.



3

# శ్రీకృష్ణ బ్రహ్మచర్య రహస్యం

శ్రీకృష్ణ భగవానుని వ్యక్తిగత జీవితం గురించి ఈనాడు అనేకులు నానా విధాలుగా ఊహించుకుని తమ బుద్ధిని బట్టి సినిమాల్లో చూపే చెత్తనుబట్టీ ఎన్నో తప్పుడు అభిప్రాయాలు ఏర్పరుచుకున్నారు!

ఇలా ఏర్పరుచుకున్న అభిప్రాయాలు ఎంత తప్పో తెలియ డానికి కేవలం రెండు ఉదాహరణలే చాలు! మొదటిది పూర్వకాలం నుంచీ సాధనచేసే బ్రహ్మచారులకు ఎప్పుడైనా వారి శరీరంలోని దోషాలు సాధనతో పొంగి అణచుకోలేని పరిస్థితి కలిగినప్పుడు అవి "యోగ విఘ్నాలు"గా సాధనను చెడగొట్టే ప్రమాదం వున్నది! అలా బ్రహ్మచారు లను పీడించే కామం (సెక్స్) మితిమీరి కంట్రోలు చెయ్యడం కష్టమైన పరిస్థితి ఏర్పడితే అప్పుడు శ్రీమద్భాగవతంలోని "రాసక్రీడాభివర్ణన"

వర్ణించే అధ్యాయాన్ని పారాయణ చేయిస్తారు. దానివలన బ్రహ్మచారులకు కామశాంతి కలిగి మనో నిగ్రహం సిద్ధించడమే ఈ రాసక్రీడాఘట్టం, పారాయణ ఫలితం!

ఆశ్చర్యం! ఈనాడు ప్రతీ సినిమావెధవా శ్రీకృష్ణుని రాసక్రీడ ఒక కామక్రీడగా లేక స్త్రీలోలుడు అనేకమంది స్త్రీలతో కలిసి విచ్చలవిడిగా తిరిగినట్లు చూపిస్తూ ఇష్టంవచ్చిన సంభాషణలతో పిచ్చివాగుడు మాటలు పెట్టేస్తారు! అది ఎంత తప్పో ఉదాహరణతోగాని తెలియదు, అంటే దీనికి అర్థం ఒక్కటే! శ్రీకృష్ణదేవుడు బ్రహ్మణ్యుడు. అనగా బ్రహ్మచర్యాన్ని, యోగసాధకులు ఏ బ్రహ్మజ్ఞానసిద్ధికోసం సాధనచేస్తారో ఆ బ్రహ్మత్వనిష్ట సిద్ధించిన యోగపురుషుడు! కాబట్టి ఆయన చేసిన దైవలీలలు పారాయణ చేస్తే ఈనాటి యోగుల చరిత్రలు - "దత్త చరిత్ర", "శ్రీసాయినాథ చరిత్ర"ల పారాయణవలన ఎంత మహిమ కలుగు తుందో అంతే ప్రభావం కలిగిన పవిత్రగాథ అని అర్థం! ఈ విషయము నాకు 1976 ప్రాంతంలో ఒకసారి మధుర బృందావన యాత్రకు వెళ్ళి నపుడు అక్కడ బృందావనంలోని గుహలలో జడలు గడ్డాలు పెరిగిన సాధువులు నిరంతరం ధ్యానంలో ఉన్నవారు దర్శన మిచ్చారు! అక్కడ ఈ బృందావనంలో నివాసం మహిమ, రాసక్రీడా ఘట్టం పారాయణా మహిమ వారిలో ఒకరు ఆశ్చర్యంగా నాకు వివరించడం పైవిధంగా చిత్రీకరించడమూ జరిగింది! ఆశ్చర్యపోయాను!

అలానే రెండవ ఉదాహరణ శ్రీకృష్ణుని జీవితం. సామాన్యంగా కృష్ణ చరిత్ర చదివేవారు శ్రీకృష్ణునికి ఎనిమిదిమంది భార్యలనీ ఆయన 'అష్టభార్యల'తోనూ సుఖంగా అంటే మనలాగే, సంసారం చేసేవాడని

భావిస్తారు! చాలాకాలం నేనూ అలానే భావించేవాడిని! పైగా దీనికి ఉదాహరణగా ఒకటి తోచేది. ఏమనీ, అంటే!

"శ్రీకృష్ణునికి" కుమారులుకూడా కలిగారుకదా? రుక్మిణిదేవికి సాంబుడు, మొదలుగా అలాగే మిగతా భార్యలకు అనిరుద్ధుడు, ప్రద్యుమ్నుడు కుమారులు కలగడం ఆయన సంసారిక జీవితాన్ని నిరూపించడంలేదా?" అని లౌకికదృష్టితోనే శ్రీకృష్ణ చరిత్రను అర్థం చేసుకుంటారు. కాని, కాలాంతరంలో నేను యోగసాధనలో ప్రవేశ పెట్టబడినపుడు "హఠయోగ ప్రదీపిక" అన్నగ్రంథం చదివాను! అందులో బ్రహ్మచర్యత్వ సిద్ధిలో అంతస్థులు భేదాలు వర్ణిస్తూ వజ్రోళి, హజోళి అన్న రెండు యోగసాధనాక్రియలు వర్ణించారు.

దానిలోని యోగరహస్యాలను సాధనా విశేషాలను విడిచిపెట్టి మనకి ప్రస్తుతం అవసరమైన ఒకే అంశం సాధకుడు తన లింగముతో పాదరసాన్ని పీల్చి నిలబెట్టే సిద్ధిగురించి వ్రాయబడింది! పాదరసం చాలా బరువైన ఘనమైన ప్రమాదకరమైన వస్తువు! అందుకని ముందుగా పాలతో ఈ ప్రక్రియను సాధించి సిద్ధింపచేసుకోవాలి. ఇంకొకమెట్టు యోగసాధకురాలైన స్త్రీతో సాధకుడైన పురుషుడు సంసార ప్రక్రియలో వీర్యం లోపలికి పీల్చుకునే రహస్య యోగప్రక్రియ కూడా వర్ణించబడి ఉన్నది.

## "వజ్రయానం" - అనేక రూపసిద్ధి!

దానికి నిదర్శనంగా టిబెట్‌లోని దలైలామాల పరంపరలో వజ్ర యానంలో ఇంద్రియాన్ని లోపలికి పీల్చుకుని హరించుకునే యోగ ప్రక్రియ సిద్ధి కలిగినవాడు ఒకే శరీరంతో అనేకచోట్ల దర్శనమిచ్చిన

మహిమను వర్ణించారు. ఇలాంటి 'సిద్ధి' యోగులలోకల్లా మహోన్నతులైన పరమయోగులకేకాని మామూలు వారికి సాధ్యపడదు.

## "రాస-రహస్య" సిద్ధి

శ్రీకృష్ణుడు రాసకేళిలో ఒకేసారి అనేక శరీరాలు ధరించి చూపిన "యోగసిద్ధి" టిబెట్లోని వజ్రయానయోగం రహస్యం తెలిస్తేనే ఆ సిద్ధికి మూలరహస్యం బోధపడుతుంది. 'ఊర్ధ్వరేతస్కుడు' అంటే అర్థం చాలామందికి తెలియదు.

## "వజ్రధాతువు" యోగసిద్ధి

పురుషవీర్యం అధఃపతనం కాకుండా లోపలికి 'వజ్రౌళి' ప్రక్రియలో సిద్ధిపొంది ఆ వీర్యాన్ని యోగసాధనలోని వేడితోపుట్టే అగ్నిహోత్రంలో హుతం చేయగలిగితేనే అట్టి యోగికి 'వజ్రశరీరం' - అంటే బైటి స్థూల శరీరం మరణించినా శాశ్వతంగా భక్తులకు దర్శనమిచ్చే "నిత్య శరీరం" ఏర్పడుతుంది! దీనినే రష్యన్‌యోగి గుర్జెఫ్ (Gurjieff) ఎలక్ట్రానిక్ బాడీ (Electronic Body) అంటే జీవకణాలతో ఏర్పడిన స్థూల శరీరం కాకుండా అణువులచే పరమాణువులతోను ఏర్పడ్డ 'విద్యుత్ శరీరం' అంటే "ఎలక్ట్రానులతో ఏర్పడిన శరీరం" అని వర్ణించాడు. ఇలాంటి శరీరం నిర్మించాలంటే యోగి తన శరీరంలోని ప్రాణశక్తితో పాటు వీర్యాన్ని కూడా నీళ్లు ఆవిరై మేఘాలైనట్టు హుతం చేసినట్టయితే దానివల్ల 'వజ్రధాతువు' ఏర్పడుతుంది. ఈ వజ్రధాతువుతో తయారైనదే వజ్రశరీరం! ముఖ్యంగా దీని లక్షణం గమనింపతగ్గది! ఈ వజ్రశరీరం ఒకేసారి అనేకచోట్ల ప్రత్యక్షం అయ్యేలా ఏర్పడి దర్శనమిస్తుంది!

## కౌరవసభలో - ద్రౌపది మానరక్షణ - దైవలీల

పై సైన్సు పరిశోధనతో విశ్లేషణ చేస్తే తెలిసే రహస్యాలతో శ్రీకృష్ణుని జీవితాన్ని కనుక ఒక సైన్సు పరిశోధనాదృష్టితో విశ్లేషించి చూస్తే పై రహస్యం యధార్థమైందని అర్థం చేసుకోవచ్చు!

శ్రీకృష్ణుని నిజజీవితంలో అనేకసార్లు ఇలాంటి ఎలక్ట్రాన్ శరీరాల వంటి వజ్రశరీర వజ్రాయానం తన దివ్యలీలతో ప్రదర్శించాడు! తనెక్కడో ద్వారకలో ఉండి, కౌరవసభలో ద్రౌపదికి సాక్షాత్కరించి వస్త్రాలిచ్చిందీ, అనుగ్రహించిందీ కూడా ఇలానే! ఎందుకంటే ఈ ఎలక్ట్రానులతో ఏర్పడిన శరీరమేకాక ఆ సిద్ధి పొందిన యోగి తాను కోరిన ఏ వస్తువునైనా సరే, అనేకములుగా వృద్ధిచేయగలడు!

## దుర్వాస - శిష్యుల భోజనం

ఇదే 'సిద్ధిని' ద్రౌపది కడిగి బోర్లించానని చెప్పిన 'అక్షయ పాత్ర' నుండి ఒక్క మెతుకు ముక్కను వేయింతలుగా వృద్ధిచేసి దుర్వాస ముని శిష్యుల పొట్టలునిండేలా ఈ సిద్ధి ఆధారంగా వృద్ధిచేసాడు. ఆ సమయంలో కూడా ఆయన దూరాన ఎక్కడో ఉండి అకస్మాత్తుగా దర్శనమిచ్చి పై దివ్యలోకాలను చూపి మళ్ళీ అంతర్ధానమైపోయాడు అంటే! ఈ మహిమ శ్రీకృష్ణుడు స్థూల శరీరంలో ఉండి చేసినది కాదు అని తెలుస్తుంది.

## అనేక భార్యలతో - వేర్వేరు రూపాలు

ఇలానే ఇంకోసారి శ్రీకృష్ణపరమాత్మ తన భార్యలతో దివ్యంగా శారీరక సంబంధంతోనే సంసారయాత్ర చేస్తున్నాడా అన్న అనుమానంతో ప్రతీ ఒక్క భార్య ఇంటికీవెళ్ళి అక్కడ వేరువేరు శరీరా

లతో అనేకచోట్ల దర్శనమిచ్చిన సందర్భంలో చూపించాడు! అదే సమయంలో శ్రీకృష్ణుడు తనయొక్క నిజగృహంలోనే ఉండి నారదుడు వెళ్లి చూడగానే పద్మాసనంలో యోగధ్యానంలో ధ్యాననిష్ఠలో ఉన్నాడు. దీనినిబట్టి శ్రీకృష్ణుని భార్యలతో ఆయన చేసినది ఒక యోగలీలయే కాని, ఒక పామరునివంటి శారీరక కామక్రీడకాదు అని నారదునికి బోధపడిపోయింది! అందుకే శ్రీకృష్ణుడు పరమాత్ముడు అని సంస్కృతంలో "బ్రాహ్మణ్యుడు" లేదా "శ్రీకృష్ణ పరబ్రహ్మము" అని వేదవ్యాస మహర్షి ప్రయోగించిన మాటల అర్థం!

"బ్రహ్మణ్యో దేవకీపుత్రో
బ్రహ్మణ్యే మధుసూదన!"

అని ఒకచోట, భగవద్గీతలో సంజయుడు శ్రీకృష్ణుని విశ్వరూపం గురించి చెప్పే సన్నివేశంలో ఆయనను వర్ణిస్తూ

"ఏవముక్త్వా హృషీకెశో
మహాయోగేశ్వరో హరి!
ధర్మయామాస పార్థాయ
పరమం రైప మద్భుతం"

అంటూ వర్ణించాడు. అంటే అర్థము, "మహాయోగేశ్వరుడైన హృషీకేశుడు" అన్న పై వ్యాసవాక్యములు అక్షర సత్యములు! ఆయన యోగులలో యోగి! ప్రభువులకు ప్రభువు! అనగా మహోన్నత యోగశక్తిని అవలీలగ బాల్యచేష్టలాగా ఆడుకుంటూ ప్రదర్శించేవాడు తన చిన్నతనంనుంచీ! అంధుకే ఆయన "వజ్రాయానసిద్ధి"ని తెలిసిన బ్రహ్మర్షులకేతప్ప ఇతరుల కెంతమాత్రమూ అంతుబట్టని లీలలను

రాసకేళిలో అనేక శరీరాలను దర్శింపచేసినట్టి మహిమలను ప్రద ర్శించాడు.

## బుద్ధ-దేవుని "మహి"మ

ఇంకా వదలని సందేహం ఎవరికైనా పట్టుకొని పీడిస్తూఉంటే శ్రీ బుద్ధదేవుని జీవితంలో కూడా ఆయన ఇదే లీలను ప్రదర్శించాడన్న విషయం తెలిస్తే బోధపడుతుంది!

ఒకసారి అతి బీద భక్తుని ఇంట విందుకై బుద్ధదేవుడు తన శరీరంలోంచి వేయిమంది శరీరాలుగా మారి వేయి బుద్ధులుగా బయటకువచ్చి ఒకే అన్నపు ముద్దను వేయింతలుగాచేసి భిక్షచేసిన ఆ లీల, బుద్ధ చరిత్రనుంచి స్వీకరించి నేను **"మనదేశం - మన సంస్కృతి"** అన్న నా గ్రంథంలో వర్ణించాను!

## శివానుగ్రహంతో - సంతానం కనుట!

దీనికి మరొక బలమైన సాక్ష్యం కూడా చూపవచ్చు! శ్రీకృష్ణుని సంతానంకోరి రుక్మిణీదేవి ప్రార్థించగా, తాను యోగశక్తులు ఖర్చు పెట్టజాలనని, ఆమె కోరిన సంతానం కోసమని హిమాలయాలకు పోయి తపస్సుచేసి శివుని అనుగ్రహంపొంది ఆపైనే రుక్మిణీదేవికి సంతానాన్ని ప్రసాదించాడు! దీనిని శ్రీకృష్ణుని వ్యక్తిగత జీవితం గురించిన వివరాలను తెలిపే పురాణ గ్రంథమైన "హరివంశము"లో చూడవచ్చు.

అంటే శ్రీకృష్ణుడు సామాన్య మానవుల్లాగ, సంసారంచేసి రుక్మిణీ దేవికి సంతానాన్ని ఇవ్వలేడా? మరణించిన పరీక్షిత్తునే చేతి స్పర్శతో పరిరక్షణచేసి బ్రతికించిన యోగసిద్ధుడే! దీనినిబట్టి చూస్తే శ్రీకృష్ణుడు

మామూలు పద్ధతిలో గృహస్థధర్మంగా బిడ్డలను కనలేదని, యోగ రహస్యాలు తెలిసిన వారికే అర్ధమయ్యేలాగ వ్యాసమహర్షి వర్ణించారు!

## అస్ఖలిత - బ్రహ్మచారి

మనకి కావలసిన ఆఖరి నిరూపణ భీష్ములవారి నోటినుంచే లభిస్తుంది! పరీక్షిత్తుని బ్రహ్మాస్త్రంవల్ల మృతశిశువుగా ఉత్తర ప్రసవించింది కదా ఆ సమయంలో "అస్ఖలిత బ్రహ్మచారియైనవాడు తాకితేనే ఆ బ్రహ్మాస్త్రం బారినుండి ఆ పిల్లవాడు బతుకుతాడు" అన్న అశరీర వాణిని విని అందరూ భీష్ముడు బ్రహ్మచారి కనుక ఆయనను ఆ శిశువుని తాకాలని కోరారు. దానికి భీష్మపితామహుడు వారి అజ్ఞానానికి జాలిపడి చిరునవ్వుతో వీళ్లు శ్రీకృష్ణుడిని సామాన్య సంసారజీవితం గడుపుతున్నాడని భావిస్తున్నందున ఆయన యొక్క "వజ్రయాన యోగసిద్ధి" అఖండ బ్రహ్మచారులకేగాని సిద్ధించనిదన్న సంగతి గ్రహించలేదని అర్థంచేసుకొని వారితో "నిజమైన అస్ఖలిత బ్రహ్మచారి శ్రీకృష్ణ పరబ్రహ్మమే! నేను కాదు! మీరు వెళ్లి ఆయనను ప్రార్థించండి మీతప్పు తెలుసుకొని." అనగా వారు మరణించిన పరిక్షిత్తును చూపి ప్రార్థించగా శ్రీకృష్ణుడు తన హస్తంతో తాకి తన అస్ఖలిత బ్రహ్మచర్య సిద్ధిని ప్రత్యక్షంగా నిరూపించాడు. ఎన్నాళ్లుగానో రహస్యంగా ఉన్న తన రహస్య యోగసిద్ధిని బయటకు నిరూపించాడు. దాన్ని గ్రహించలేని బంధువులు అర్జునుని వంటివారు కూడా కృష్ణమాయలో ఉండి ఆయన యోగసిద్ధిని గ్రహించలేదు.

పై చూపిన మూడు నాలుగు నిదర్శనాలవల్లా తెలుస్తున్నదేమంటే శ్రీకృష్ణపరబ్రహ్మము వజ్రయాన యోగసిద్ధుడు! ఇంద్రియ నిగ్రహుడై ఊర్ధ్వరేతస్కుడై యోగాగ్నివల్ల రేతస్సు హుతం చేసిన మహాయోగి!

హుజోళి, వజ్రోలి వజ్రయానములవలన సిద్ధించే "వజ్రశరీరం" వలన ఒకే సమయంలో అనేకచోట్ల కనిపించే శరీరాన్ని సిద్ధింప చేసుకున్నాడు అని ఆయన చర్యలవల్ల చూపిన విషయం!

బృందావనంలో గోపికలతో చేసిన రాసక్రీడ కూడా ఇలాగ యోగ సిద్ధిలో ఒకే శరీరంనుండి ఏర్పడిన అనేక వజ్రశరీరాలతో చేసిన మహిమలే!! ఆయన భార్యలతో సంతానాన్ని కూడా "సంకల్ప యోగ శక్తి"తోనే, సామాన్యంగా పశుత్వక్రీడగా కామకేళితో కన్న పామరుడు కాడనీ అందుకే యోగసాధకుడు తనకు వశంకాని కామంతో యోగ విఘ్నం కలిగినప్పుడు బృందావనంలోని "రాసక్రీడా" ఘట్టాన్ని పారాయణ చేస్తే తగ్గిపోవడానికి గల కారణమనీ తెలుస్తుంది!! ఈ యోగ రహస్యాన్ని గనక గ్రహించుకుని శ్రీకృష్ణచరిత్ర పారాయణచేస్తే మరింత ఫలప్రదం కాగలదు!



4

# శ్రీకృష్ణుని కాలం

శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడేనా? అన్న ప్రశ్న ఆయన అద్భుత చరిత్ర చదివినవాళ్ళందరికి తరచు కలుగుతూ వుంటుంది. కృష్ణుడు కేవలం వ్యాసమహర్షి ఊహాకల్పనలోని పాత్ర కాదనటానికి ఆయన చారిత్రక పురుషుడనటానికి తగిన ఆధారాలున్నాయా? అయితే ఆయన కాలం చరిత్రలో ఇది, అని నిర్ణయించటానికి వీలుందా? అన్న విషయాల్ని ఇప్పుడు పరిశీలిద్దాము.

శ్రీకృష్ణుడు వ్యాసుడనే కవి ఊహించి, సృష్టించిన కల్పిత వ్యక్తి అని కొందరు అనుకోవచ్చు. కాని, ఈ విషయంలో మనం గమనించాల్సిన విషయం ఒకటున్నది. 'మహాభారతం' కేవలం ఒక కావ్యం మాత్రమే కాదు. ఇది ఒక చారిత్రక గ్రంథం కూడాను. అందుకే

దాన్ని ఇతిహాసం అని, తక్కిన పద్దెనిమిది గ్రంథాల్నీ "పురాణాలు" అనీ అన్నారు. "ఇతిహాసం" అంటే యదార్థంగా చరిత్రలో జరిగిన సంఘటనల్నాధారంగా చేసుకొని ఏర్పడిన ఇతివృత్తంగల గ్రంథమని అర్థం. అంటే కావ్యంలోవుండే కవిత, శిల్పం, ఛందోనైపుణి, శబ్ద వైచిత్రీ అన్నీ కూడా చారిత్రక సంఘటనల చుట్టూరా అల్లినవే. భారతయుద్ధం అనబడే ఒక మహా సంగ్రామం అన్న చారిత్రక సంఘటన ఆధారంగా దానిచుట్టూ ఏర్పడిన రాజకీయ పరిణామాలు - అందులో శ్రీకృష్ణుడనే ఒక మహావ్యక్తి యీ భారతజాతిని, భారతదేశాన్నీ ఒకటిగా సంఘటితపరచి, ఐక్యత సాధించటానికై చేసిన మహాయత్నమూ, ఇవన్నీ కూడా వర్ణితమై వున్నాయి మహాభారతంలో. ఇందులో మనకిప్పుడు కావలసిన విషయం శ్రీకృష్ణుని గురించిన చారిత్రక ఆధారాలూ కాల నిర్ణయం చేయడానికవసరమైన శాస్త్రీయాధారాలు మాత్రమే, ఈ శాస్త్రీ యాధారాలంటే ఏమిటో ఇక్కడ కొంచెం పరిశీలిద్దాము.

మనదేశ చరిత్రలో ఈనాడు వున్నదంతా చాలావరకూ పాశ్చాత్య దేశీయుల ఊహలు, ఉద్దేశ్యాలమీద ఆధారపడి వ్రాయబడినదే. మనకి రాజకీయంగా బానిసత్వం పోయి చాలాకాలమయినా ఇంకా అనేక మంది భారతీయులనబడే మన చరిత్రకారులు కూడా గుడ్డిగా యీ పాశ్చాత్య చారిత్రకుల అడుగుజాడల్లోనే నడుస్తూవున్నారు. వీళ్ళల్లో కొందరు మహాభారతము క్రీస్తుపూర్వం - 2000 సం॥నాడు వ్రాయ బడిందనీ, లేక 1000 B.C. లో వ్రాసినదని కొందరు, ఇలాగ ఊహా గానాలమీద ఆధారపడి వాళ్ళకెంత సబబనితోస్తే అంతకాలం నిర్ణ యించి, దాన్ని ఋజువుచేసేందుకు పెద్దపెద్ద పాశ్చాత్య చరిత్రకారుల

మాటలు (Quotations) ఉదహరిస్తూ తమ నిర్ధారణల్ని నిలబెట్టుకుంటు న్నారేగాని స్వతంత్రమైన శాస్త్రీయమైన (Scientific) ఆధారాలకోసం విడిగా ప్రయత్నం చెయ్యటం లేదనే చెప్పాలి.

ఇలా చెయ్యాలంటే, ఎవరి ఊహలమీదా ఆధారపడని పద్ధతి ఒకటి, వైజ్ఞానిక సూత్రాలమీద ఆధారపడి వున్నది కావాలి. శాస్త్రీయ మైన, కాలనిర్ణయానికి పనికివచ్చే నిర్దుష్టమైన ఆధారం (Standard) ఒకటి ముందు ఏర్పాటుచెయ్యాలి. అంతేకాని ఎవరికి తోచినట్టు వాళ్ళు వాళ్ళ అభిప్రాయాలమీద ఆధారపడి కాలనిర్ణయం చెయ్యటం అశాస్త్రీయం. అలాటి చరిత్ర ఊహాగానమే అవుతుంది.

ఇలాగ, 'సైంటిఫిక్' అనదగ్గ నిర్దుష్టమైన పద్ధతి ఒకటి వుండటం వల్ల ఇంకో సౌకర్యం, లాభంకూడా వున్నది. అదేమిటంటే కాల నిర్ణయం చెయ్యటంలో జాతివైషమ్యాలు తెల్లవారి వర్ణజాతులు లేక యూరోపియన్‌లు, ఆసియనులనే తేడాలు, యితర స్వజాత్యాభిమానాలు అనేకం అడ్డువచ్చి, ప్రాచీన సాహిత్యానికీ, సంస్కృతికీ ఈ సంకుచిత తత్వాలవల్ల అన్యాయం జరిగే అవకాశం లేకుండా నివారణ అయి పోతుంది.

మనం ఎలాచూసినా, శాస్త్రీయపద్ధతుల ద్వారా కాలనిర్ణయం చెయ్యబడటమే చాల శ్రేష్ఠమైన పద్ధతి. ఇక శాస్త్రీయమైన ఆధారాలు ఏమిటో చూద్దాం.

చరిత్రలో ఏదైనా విషయానికి, లేక గ్రంథానికి సరిగ్గా కాలం లెక్కకట్టాలంటే అనేక శాస్త్రీయ పద్ధతులున్నాయి. ఒకటి రేడియో ధార్మిక వస్తువుల అంచనాలద్వారా కట్టబడే లెక్కలు. ఇది పురావస్తు

పరిశోధనలలోని త్రవ్వకాలలో దొరికిన వస్తువులకే పనికివస్తుంది. అయితే మహాభారతం పురావస్తుశాస్త్రం (Archeology) తో ఎక్కువ సంబంధించిన విషయం కాదు. ఇకపోతే రెండోపద్ధతి.

గ్రహస్థితులనుబట్టి, ఖగోళశాస్త్రంలోని (Astronomy) వైజ్ఞానిక గణనము మీద ఆధారపడి కూడా మనం కాలనిర్ణయం చెయ్యవచ్చు నన్న విషయము, శ్రీ లోకమాన్య బాలగంగాధరతిలక్ నిరూపించారు. ఈ పద్ధతిని పాశ్చాత్య చారిత్రకులు, పండితులైన మాక్సు-ముల్లరు (Max-Muller), జాకోబీ (Jacobi), సర్ ఫ్లింటర్స్ పిట్రీ (Sri Flinders Petrie) లాంటి మహామహులు కూడా ఎంతో శ్లాఘించారు. శ్రీ తిలక్ మహా శయుడు యీ ఖగోళ, జ్యోతిషశాస్త్ర విషయాల ఆధారంతో చెయ్య బడిన గణితంతో - వేద కాలనిర్ణయం చెయ్యవచ్చునని నిరూపిస్తూ, "ఓరియన్" (Orion) అనీ, "ఆర్కిటిక్ హోమ్" (Arctic Home of the Vedas) అన్న తన రెండు గ్రంథాలద్వారా ఈ పద్ధతిని ప్రతిష్టించారు. ఇది రెండో పద్ధతి.

ఇది ఎందుకని శాస్త్రీయమైన పద్ధతి అంటే గ్రహాల నడకలు, దానికై చేసే గణితం అంతాగూడా యిప్పుడు టెలిస్కోపుల సహాయంతో చూసి, కొలిచి, ప్రత్యక్షంగా నిరూపించవచ్చు. ప్రత్యక్ష వైజ్ఞానిక సత్యంగా ఇది ఎవ్వరూ మార్చలేని ఖగోళ విషయాలమీద ఆధారపడి వున్న విధానము. పూర్వం ఎన్ని సంవత్సరాల క్రితం, ఎలాటి ఖగోళ పరిస్థితులున్నాయో ఆ ఖగోళ స్థితులనిబట్టి, సరిగ్గా ఆనాటికాలం గుణించటానికి వీలవుతుంది.

వేదమంత్రాలలో ఇవ్వబడిన గ్రహనక్షత్ర, 'ఆయన' (Equinox) వివరాలను ఆధారంగా తీసుకొని ఆ స్థితులు, ఖగోళ పరిస్థితులు

ఆనాడు వుండాలంటే, యీ గ్రహాల నడకల ఆధారంతో, ఎన్ని సంవత్స రాల క్రితం ఆ ఖగోళ విశేషాలు జరగటం సాధ్యమో, గణించారు శ్రీ బాలగంగాధర తిలక్.

అదేపద్ధతి మనం ఈనాడు మహాభారతానికి, విష్ణుపురాణానికీ భాగవతానికీ గూడా అన్వయించి, శ్రీకృష్ణుని కాలం నిర్ణయం చెయ్యటం వల్ల ఏమేమి విషయాలు తెలుస్తాయి? మహాభారత యుద్ధం ఎంత కాలం క్రితం జరిగివుంటుంది? అన్న ప్రశ్నలకు ఎటువంటి సమా ధానం దొరుకుతుందో చూద్దాము.

ఈ విషయంలో అతిప్రాచీనమైన ప్రమాణ గ్రంథాలు చరిత్రకి ఆధారంగా పనికివచ్చేవి. సంస్కృత మహాభారతము, విష్ణుపురాణం (సంహిత) భాగవతం, హరివంశము. వీటిలో మనకిదొరికే ఖగోళ సత్యాలు, జ్యోతిశ్శాస్త్రాధారాలు నిరూపించే విషయాలేమిటి?

ఇందులో సంస్కృత భాగవతం నుంచి మనకి తెలిసే విషయ మేమిటంటే :- ఏరోజునైతే శ్రీకృష్ణుడు తనువు త్యజించాడో, సరిగ్గా ఆరోజునే 'కలియుగం' ప్రారంభమైనది.

"యస్మిన్ కృష్ణోదివం యాతః తస్మిన్నేవ తదాఽహని

ప్రతిపన్నమ్, కలియుగం" - అన్న విషయం చాలా ముఖ్యమైన చారిత్రకాధారం. ఖగోళశాస్త్రదృష్ట్యా గనక చూసినట్టయితే, యే రోజున కలియుగం ప్రారంభమైందో సరిగ్గా ఆ దినమే శ్రీకృష్ణుడి నిర్యాణ దినం. ఈరోజు ఏదైె వుంటుంది. ఇది - ఆయన కాలం (నిర్యాణ సమయం) నిర్ణయించటానికి మనకి ఉపయోగిస్తుంది.

ఇకపోతే రెండో విషయం శ్రీకృష్ణుని జనన కాలనిర్ణయం భాగవతం దశమస్కంధం 3వ అధ్యాయంలో శ్రీకృష్ణుడు జన్మించినప్పుడు ఆరోజున

'ప్రజాపతి' నక్షత్రం వున్నదని తెలుపుతున్నది. ప్రజాపతి నక్షత్రమంటే రోహిణీ నక్షత్రం. విష్ణుపురాణంలో మొదటి అశ్వాసం - 5వ అంశం, (శ్లోకం-26) ఆధారంగా శ్రీకృష్ణుడు శ్రావణమాసంలో జన్మించాడనీ, అందులోనూ బహుళపక్షంలో అష్టమితిథి జరుగుతుండగా జన్మించడం జరిగిందని మనకి తెలుస్తున్నది. ఇంతవరకూ అందిన అంశాలతో, తిథి వార నక్షత్రాలూ, మాసం పక్షాలవరకే సమయం నిర్ణయం అవుతుంది. మరి ఏ సంవత్సరమన్నది మిగిలిన అంశం. ఇవన్నీ కలసిన రోజు ఎప్పుడు?

'హరివంశం, సంస్కృతమూలం తీసి చూచినట్టయితే, 52వ అశ్వాసంలో పైచెప్పిన తిథీ, వారం, నక్షత్రమూ అన్ని కూడా సరిపోతాయి. భాగవతంబట్టి చూస్తే అర్థరాత్రి కాలంలో శ్రీకృష్ణుడి జన్మ. అంతేగాక ఇంకో ఖగోళవిశేషమేమిటంటే సప్తమహర్షుల నక్షత్రాలు (Great Bear or "Ursa Major" Constellation), యుధిష్టిరుడి రాజ్యకాలంలో మఖానక్షత్రంలో వున్నట్టు, అవి అలాగ శతాబ్దం కాలము, అంటే యుధిష్టిరుడు రాజ్యపరిపాలన పూర్తిచేసే కాలందాకా గూడా, నిలిచివున్నట్టు ఈ క్రింది శ్లోకంవల్ల మనకి తెలుస్తుంది.

"సప్తర్షీణాంతు యౌ పూర్వే, దృశ్యే తేహ్యుదితేదివి,
తేతుపారిక్షితే కాలే మఘూస్వాసన్ మహర్షయః"

ఇదే విషయం విష్ణుపురాణంలోనూ ఋజువవుతోంది. కింది శ్లోకాలవల్ల :-

తేతుపారిక్షితే కాలే మఖాస్వాసన్ ద్విజోత్తమ, తదా
ప్రవృత్తశ్చ కలిః ద్వాదశాబ్ద శతాత్మకః"

ఇదే కాకుండా శ్రీకృష్ణుని నిర్యాణం జరిగిన సంవత్సరమే పరీక్షిత్తు పట్టాభిషేకం కూడా జరిగింది. అదే సంవత్సరం ధర్మరాజు రాజ్యపరిత్యాగం చెయ్యటం జరిగింది. ఈ విషయాన్ని విష్ణుపురాణం ఈవిధంగా తెలుపుతున్నది.

"గతే సనాతనస్యాంశో విష్ణుస్తత్ర భువో దివం ।
తత్త్యాజ, సానుకో రాజ్యం, ధర్మపుత్రో యుధిష్ఠిరః ॥
విపరీతాని దృష్ట్వాచ; నిమిత్తానిహ పాండవః ।
యాతే కృష్ణే; చకారాథ సోభిషేకం పరీక్షితః ॥"

ఇంకా మహాభారతంలోని మౌసలపర్వం ఆధారంగా తేలే విషయం ఏమిటంటే పరీక్షిత్తు పట్టాభిషేకం జరిగిన 36 సంవత్సరాలకి పూర్వమే, 'మహాభారత సంగ్రామం' జరిగింది. ఈ మహాభారత సంగ్రామం జరిగిన సంవత్సరంలో ఒక విశేషం జోతిశ్శాస్త్ర దృష్ట్యా జరిగింది! ఒకే రోజులో మూడు తిథులు నడచి, రోజు ప్రారంభంలో త్రయోదశి వుండి, అదేరోజు చివరికీ అమావాస్య!! ఇది, కొన్ని వందల సంవత్సరాలకి గాని సామాన్యంగా జరగదు. ఇది జరిగినపుడు భయంకర యుద్ధాలు గాని, జననష్టంగాని జరగవచ్చు. 36 సంవత్సరాల తరువాత అంటే, శ్రీకృష్ణుని నిర్యాణం జరిగిన సంవత్సరంలోనూ ఇదే విపరీతం చూచి శ్రీకృష్ణుడు యాదవుల వినాశనాన్నీ, రానున్న కలియుగాన్ని మహాభారతంలో తెలిపినట్టు ఈ శ్లోకాలు స్పష్టం చేస్తున్నవి.

"ఏవం పశ్యన్ హృషీకేశః సంప్రాప్తం కాలపర్య
యం, త్రయోదశ్యాం అమావాశ్యాం త్వాదృష్ట్వా ప్రాబ్రవీదిదమ్."
చతుర్దశీ పంచదశీ కృతేకం రాహుణా పునః

ప్రాప్తే వై భారతే యుద్ధే, ప్రాప్తాచాద్య
క్షయాయ నః - మ. భా. మౌసల.

ఈ జ్యోతిశ్శాస్త్రాధారాల్ని తీసుకుని కలియుగ ప్రారంభకాలం, కృష్ణ నిర్యాణకాలం కూడా సాధించవచ్చు. దీనికి 36 సంవత్సరాలకి పూర్వం మహాభారతయుద్ధం జరిగింది. కాబట్టి, మహాభారత యుద్ధ కాలం కూడా తెలుస్తుంది. ఈ విషయం ఖగోళ పరిశోధన ఆధారంగా "కలిశక విజ్ఞానం" అనే గ్రంథంలో కూడా చర్చించబడి నిర్ధారణ చేయ బడింది. అందులో కొన్ని వాక్యాలు మచ్చుకు :

"భీష్ముడు పడిపోయి అంపశయ్య చేరిన పదవరోజుకు వెనుక భీష్ముడు

| | | |
|---|---|---|
| యుద్ధం చేసిన రోజులు | - | 9 |
| నిర్యాణమైన రోజువరకూ | - | 58 |
| వెరశి అరువదియేడు రోజులు | - | 67 |

భీష్మనిర్యాణము శోభకృతునామ సం॥ శు॥ 7 శుక్రవారం రోహిణి నక్షత్ర తృతీయ పాదమందు పగలు రెండు జాములకు (అనగా మధ్యాహ్నం 12 గంటలకు) జరిగింది. ఆ క్రిందటిరోజు, మాఘ, శు॥ 8 (రథసప్తమి) రోజున రాత్రి రెండుజాములకు ఉత్తరాయణము అనగా మకర సంక్రాంతి వచ్చినది. అనగా సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన కాలము (ఉ-షా ౨ పాదం) ఇప్పటికిని మాఘ శు॥ రథసప్తమి అని మన పంచాంగములలో యుదహరింపబడుచున్నది. ఆ మరుసటి దినము మాఖ శు॥ "భీష్మాష్టమి" అని ప్రతి సం॥రము మన

పంచాంగములలో వ్రాయబడుచున్నది. ఆ దినమున 'భీష్మతర్పణము' గృహస్థులందరి చేతను విడువబడుతున్నది. మహాభారత యుద్ధము ప్రారంభమైన దినము లగాయితు 67వ రోజున భీష్మనిర్యాణము జరిగినది. అనగా కలి పూ॥ 36 సం॥రం (లేక క్రీ॥పూ॥ 3138 B.C.) ఆ సం॥రములోనే యుద్ధము 8 రోజులు ముగిసి, మృతుల శ్రాద్ధకర్మలు ముగిసిన వెంటనే "ధర్మరాజు" భారతవర్ష చక్రవర్తిగా యభిషేకింపబడెను. ధర్మరాజు రాజ్యకాలము కలి పూ॥ 36 సం॥లు కలి ప్రారంభమునకు 36 సం॥లు".

ఈపై ఆధారాలన్నిటినీ బట్టి చూస్తే యీ అంశాలన్నీ కూడా సరిపోయే సంవత్సరం, నెల, తేదీ ఖగోళశాస్త్రరీత్యా లెక్కకట్టవచ్చును.

ఇలాగనక గుణించి చూసినట్లయితే శ్రీకృష్ణుడు జన్మించిన తేదీ 19 జూలై క్రీస్తుపూర్వం 3228 అని తెలుస్తుంది. ఇదేవిధంగా, ఇలాంటి అనేక ఆధారాలతో బెంగుళూరు వెంకట్రామన్ అనే ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్రవేత్త, జ్యోతిష మాసపత్రిక సంపాదకుడు, తన వ్యాసంలో ఆధునిక శాస్త్రీయ గణితాధారంతో ఇదే నిర్ణయానికి వచ్చారు.* ఆయన పై వ్యాసంలో శ్రీకృష్ణుడి జాతకం సరిగ్గా పురాణాలలో చెప్పిన కాలానికి వున్న గ్రహస్థితుల ఆధారంగా తయారుచెయ్యటమే గాకుండా, ఆ జాతక ఫలితాలు జ్యోతిషశాస్త్రంబట్టి శ్రీకృష్ణుడి జీవితంలో జరిగిన అంశాలతో సరిపోల్చి కూడా చూసి; అతి నిశితంగా పరిశీలించారు.

---

* చూ "ఆస్ట్రలాజికల్ మాగజైన్ బి.వి. రామన్
"(Vide Editorial Horoscope of Lord Sri Krishna")
Astrological Magazine. — Nov. 1963 - No. II Vol. 52.

# శ్రీకృష్ణుని జాతకము

శ్రీకృష్ణుని జన్మకాలానికి అంటే జూలై 19వ తేదీకి సరియైన శ్రీముఖనామ సం॥ర శ్రావణ బహుళ అష్టమి, రోహిణి నక్షత్రం - చతుర్థ చరణం, క్రీస్తుపూర్వం 3228 సం॥నాటి గ్రహస్థితిని ఆధారంగా తీసుకుని వేసిన ఆయన జాతకం ఈక్రింద చూపబడింది.

| | | | |
|---|---|---|---|
| | | చ $17^{0}-42^{'}$<br>ల $28^{0}-0^{'}$ | |
| | జననం : 19-7-3228 B.C.<br>నక్షత్రం-రోహిణీ-4వ పాదం | | కు $1^{0}-5^{'}$<br>శు $12^{0}-54^{'}$<br>రా $16^{0}-24^{'}$ |
| కే $16^{0}-24^{'}$ | అయనాంశ : $+50^{0}-40^{'}$<br>జననకాలచంద్రమహాదశా<br>శేషం : 4-2-21 సం॥లు | | ర $19^{0}-48^{'}$<br>గు $28^{0}-54^{'}$ |
| | శ $14^{0}-48^{'}$ | | బు $2^{0}-48^{'}$ |

ఇలాగే మనం మహాభారతం భీష్మపర్వం చూస్తే భారత యుద్ధ కాలానికి ముందు ఏర్పడ్డ గ్రహస్థితులు యివ్వబడినాయి. ఉదాహరణకు శ్రీకృష్ణుడి జన్మతార అయిన రోహిణిలో శని ఆ సమయానికి (గోచార రీత్యా) ప్రవేశించినట్టు వర్ణించే యీక్రింది శ్లోకం గమనార్హం.

"ప్రాజాపత్యంహి, నక్షత్రం
గ్రహఃతీక్ష్ణో మహద్ద్యుతిః
శనైశ్చరో పీడయతి, పీడయన్ ప్రాణినోధికం"

ప్రజాపతి నక్షత్రమైన రోహిణీ నక్షత్రంలో శని ప్రవేశించి ప్రాణుల్ని; ప్రజల్ని పీడించే కాలాన్ని సూచిస్తున్నాడు అని, అలాగే 'మఖాస్వంగారకో వక్రః శ్రవణేచ బృహస్పతిః' - అని మకరరాశిలో గురువూ, సింహంలో వక్రించిన కుజుడూ కూడా పేర్కొనబడినవి.

ఇక్కడ ఇంకా పారిభాషికమైన, శాస్త్రీయమైన అనేక జటిలమైన గణిత, శాస్త్రీయ వివరాల్ని వదిలివేద్దాం. ఈ గణితంచేసి, యీ గ్రహ స్థితులు, నక్షత్ర పరిస్థితులు లెక్కకట్టిన మీదట తేలే అంశం ఏమిటి? ఇలా తేలే విషయాలన్నీ కూడా ఈ క్రింద ఒక పట్టికలాగ చూపించ వచ్చు.

1. శోభకృత్ నామ సంవత్సరంలో కార్తీకమాస కృష్ణపక్ష త్రయోదశి, (అమావాస్యతో కూడివచ్చిన తిథిత్రయం) మంగళవారం నాడు 'మహాభారత సంగ్రామం' మొదలయి ఘోరంగా 18 రోజులు రక్తపు వరదలతో జరిగింది.

2. అలాగే అదే సంవత్సరం, అంటే శోభకృత్ సంవత్సరం, పుష్యమాసంలో యుధిష్ఠిరుడి పట్టాభిషేకం జరిగింది.

3. ఈ భారతయుద్ధంలో పడిపోయిన తరువాత కురు వీరాగ్రణీ, భారతపితామహుడైన భీష్ముడు అంపశయ్య (బాణశయ్య) మీద 67 రోజులుండి ధర్మజుడికి 'శాంతిపర్వం'లో వివరించిన సర్వధర్మాలూ ఉపదే శించిన మీదట స్వచ్ఛంద మరణం అనే, యోగశక్తివల్ల ప్రాణం విడిచిన

రోజు మాఘమాస శుక్లపక్ష అష్టమీతిథి; రోహిణీ నక్షత్రం మధ్యాహ్నం సుమారు 12 గంటలకి. కాని మనం సామాన్యంగా 'భీష్మ ఏకాదశి' అని చేసేరోజు నిర్యాణదినం కాదు. ఇది తప్పని చాలామందికి తెలియదు. సంస్కృత భారతం మూలంలో ఈ విషయం రూఢిగా "శుక్లపక్షస్య చాష్టమ్యాంమాఘ మాసస్య పార్థివ, ప్రాజాపత్యేచ నక్షత్రే మధ్యం ప్రాప్తే, దివాకరే" అని స్పష్టంగా చెప్పబడివున్నది.

4. అలాగే పాండవులు అశ్వమేథయాగం చేసిన సమయం, క్రోధి సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి రోజున ప్రారంభం అయింది.

5. మాఘశుద్ధ పౌర్ణమినాటికి దిగ్విజయం కూడా పూర్తిచేసి యజ్ఞాశ్వంతో అర్జునుడు హస్తినాపురం తిరిగి చేరాడు.

6. విశ్వావసునామ సంవత్సర చైత్రశుద్ధ పౌర్ణమికి యజ్ఞదీక్ష ప్రారంభించబడినట్టుగా తెలుస్తుంది.

సంస్కృత మూలగ్రంథాల్ని గనుక పరిశోధించినట్లయితే అందులో ఇచ్చిన ఆధారాలమీద జ్యోతిశ్శాస్త్రరీత్యా గణితం చేసినమీద యీ విధంగా తేలుతాయి. ఈ విషయంలో శ్రీ కోట వెంకటాచలంగారనే మహామహులు చేసిన కృషి ప్రశంసనీయం. ఆయన ఈ మూలగ్రంథాల్ని అమూలాగ్రం పరిశోధించి వీటిలోవున్న జ్యోతిశ్శాస్త్ర విషయాల్ని ఆధారంగా తీసుకొని యీ పురాణాలన్నీ గూడా ఒకదానితో ఒకటి పోల్చి భారతీయ రాజులు, వారి కాలనిర్ణయాలన్నింటినీ చేర్చి "కలిశక విజ్ఞానం" అనే పుస్తకరూపంలో వెలువరించారు. ఈ కలిశక విజ్ఞానంలో చేసిన శ్రీకృష్ణుడి కాలనిర్ణయం, కలియుగ ప్రవేశకాలం, క్రీస్తు నిజంగా జన్మించిన కాలానికీ, క్రీస్తుశకంగా వాడే శకకాలానికీ వున్న తేడాలూ

అన్నీ శాస్త్రీయంగా నిరూపించి కలియుగ ప్రవేశకాలాన్ని శాస్త్రీయాధారాలతో, ఖగోళ విశేషాలూ, గణితమూ, ఆధారంగా తేల్చారు.

వారు చేసిన కాలనిర్ణయం కూడా పై చెప్పిన శ్రీకృష్ణుడి కాల నిర్ణయంతోటే (B.C. 3228) ఏకీభవిస్తున్నది. దీన్నిబట్టి చూస్తే శ్రీకృష్ణుడి జన్మకాలం ఆనాటి తేదీ - అప్పటి గ్రహస్థితులూ అన్నీ సరిగ్గా 19 జూలై-3228 B.C. తో సరిపోతాయి. అంతేకాక, అనేక సంస్కృత మూలగ్రంథాలలో వున్న శాస్త్రాధారాలన్నింటిలోనూ, వ్యాఘాతాలు లేకుండా ఈ కాలం సరిగ్గా సరిపోతుంది. ఇంతకంటే వేరే నిదర్శనం ఏం కావాలి? శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడనటానికి ఆయన ఎంతకాలం క్రితం జీవించాడో తెలుసుకోటానికి?

మనదేశచరిత్రంతా కూడా ఇదేవిధంగా విష్పాక్షిక శాస్త్ర విషయాల మీద, శాస్త్రీయాధారాలమీద ఆధారపడిన గణితంతో కాలనిర్ణయం జరగాలి. ఇప్పటి వ్యక్తుల అభిప్రాయాలు, ఊహలు, విదేశ చరిత్రకారుల మతవిషయిక సంకుచితత్వమూ ఆధారాలు కారాదు చరిత్రకి. మనకి స్వాతంత్ర్యం రాజకీయంగా వచ్చినా యీ పని యింకా ప్రారంభం కాకపోవటం శోచనీయం. మనకి భావదాస్యం, మానసిక పారతంత్ర్యం వదిలేదాకా మనం విదేశ మానసపుత్రులుగా బ్రతకటం తప్పదు. అందుకే మానవజాతికి మానసికంగా సాంస్కృతికంగానూ యీ పరభావాలనే సంకెళ్ళను బ్రద్దలు చెయ్యాలి. అప్పుడు గాని నిజమైన భారతచరిత్ర, భారతీయ సంస్కృతి అసలురూపము బైటికి రావటం జరగదు.

## శ్రీకృష్ణుడి నిర్యాణకాలం :

ఇక మిగిలింది శ్రీకృష్ణుని నిర్యాణకాలం. ఇది సరిగ్గా కలియుగం ప్రారంభించిన కాలానికేనని ఇంతకుముందే గమనించాము. అయితే ఈ కలియుగ ప్రవేశకాలం ఎప్పుడు?

కలియుగ ప్రవేశకాలానికి, లేదా శ్రీకృష్ణుడు ప్రభాసతీర్ధాన కన్ను మూసిన సమయానికి, అన్ని గ్రహాలు వాటి ఖగోళపరిస్థితులు చూస్తే (యిటీవలే కనుగొనబడ్డ గ్రహాలు మినహాగా) మేషరాశిలోని మొదటి బిందువుకి సమీపాన కూడినట్టు తెలుస్తున్నది. అనగా మొన్ననీ మధ్య అంటే 1962 ఫిబ్రవరిలో జరిగిన అష్టగ్రహకూటంలాగే వొక గ్రహకూడలి ఒకే రాశిలో గ్రహాలు చేరటం, ఆనాడూ జరిగిందని సంస్కృతంలోని ప్రామాణిక గ్రంథాల్నిబట్టి తెలుస్తోంది.

దీనికి పురాణేతిహాసాలే కాకుండా ప్రాచీన ఖగోళశాస్త్ర గ్రంధాలన్నీ కూడా ప్రబల సాక్ష్యమిస్తున్నాయి. అవేమిటో గ్రంధవిస్తరణ భీతివల్ల చూచాయగా తెలుపుతాను.

1. బ్రహ్మగుప్తుడు వ్రాసిన 'బ్రహ్మసిద్ధాంతము' అనే పేరుగల ఖగోళశాస్త్ర గ్రంధము.

2. భాస్కరాచార్యుడు వ్రాసిన "కర్ణసార" లేక "కుతూహల" మనే శాస్త్రగ్రంధము.

3. "సూర్యసిద్ధాంతం" అనే ఖగోళశాస్త్ర గ్రంధము 'మయుడు' అనే 'అట్లాంటిసు' (Atlantis నివాసి), ఇంజనీరు, కృతయుగం చివరి కాలంలో వ్రాసిన సంస్కృత గ్రంధం.

4. వరాహమిహిరాచార్యుడు వ్రాసిన 'పంచసిద్ధాంతిక' "బృహత్ సంహిత" అన్న సంస్కృత సిద్ధాంత (Astronomy) గ్రంధాలు.

5. 'ఆల్‌బెరూని' అరబ్బిభాషలో (ఫ్రెంచి, ఇంగ్లీషు, జర్మన్ లోకి అనువాదాలుకూడా లభిస్తాయి) వ్రాసినది. (Alberuni's Vol. 2, Ch. 49, Pages — 5-7).

6. కురబాబయ, లవణముష్టి అనే జ్యోతిస్సిద్ధాంత గ్రంధము.

7. 'సేతుమహాత్మ్యము' అనే జైన బౌద్ధగ్రంధాలు. కూర్మ, మత్స్య, వాయుపురాణాలలోని జ్యోతిష విశేషాలు.

8. నవీన చరిత్రకారులు మోనియర్ - విలియమ్స్ (Monier Williams) కోల్ బ్రోక్ (Cole Brooke) స్మిత్; హంబరు మొదలయిన వారి రచనలు.

9. చరిత్రని, జ్యోతిష గణతంతో శోధించిన బెయిలీ (Bailly), 'లాకైలీ' (Le-Caile) అనే ఫ్రెంచి జ్యోతిష్కులు, కౌంట్ స్జర్నా (Count Bjornstgein) వంటి జ్యోతిష ఖగోళశాస్త్రజ్ఞులు చేసిన కలియుగ ప్రారంభ కాలం గుణించిన గణితాలు, బ్లావెట్స్కీ (H.P. Blavetsky) వ్రాసిన 'Secret Doctrine", "Isis Unveiled" అన్న గ్రంధాలు.

అరవిందయోగి రచనలూ, ఇలాగ అనేక గ్రంధాలతో తేలే విషయా లన్నీ క్రోడీకరించి ఈక్రింద పొందుపరుస్తాను :

i) అల్బెరూని గ్రంధంలో యిచ్చిన 'కలిశకం' అనే కలియుగ ప్రవేశకాలం 3102 B.C.

(ii) కౌంట్‌స్జర్నా అనే పాశ్చాత్య ఖగోళ శాస్త్రవేత్త యీ పురాణాలు ఆధారంగా కలియుగ ప్రవేశకాలం గుణించి, సరిగా నిముషాలు, సెకండ్లతో సహా సరిపోవటం చూసి హిందువుల శాస్త్రీయ విజ్ఞానం చూసి ఆశ్చర్యపోయి ఇలా వ్రాశాడు :

"According to the astronomical calculations of Hindus the present period of the world, Kaliyug commenced 3102 years before the birth of Christ on 20th February at 2 hours 27 minutes and 30 Seconds, the time being calculated to minutes and seconds. They say that a conjunction of the planets then took place and their tables show this conjunction".

*"The Calculations of Brahmins is so exactly confirmed by our own astronomical Tables* that nothing but an actual observation could have given so correspondent a result."

ఐదువేల సంవత్సరాలనాటి బ్రాహ్మణుల జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానం చూసి ఆశ్చర్యంతో ప్రశంసిస్తూ వ్రాశాడు.

అయితే ఏనాడో పూర్వపు బ్రాహ్మణుల లెక్కలతో సరిపోతే యీ గ్రహస్థితి చాలా? ఇది ఈనాటి శాస్త్రీయమైన లెక్కలతో సరిగా సరి పోతుందా? అంటే దీనికి సమాధానం ఆధునిక ఖగోళశాస్త్రవేత్త, ఫ్రెంచి జ్యోతిష, గణితవేది బెయిలీ (Bailly) వాక్యాలే.

"The motion calculated by the Brahmins during the long space of 4383 years (the period elapsed between these Calculations and Bailly's) *varies not a single minute* from the tables of Cassini and Meyer and as the tables brought to Europe by Dauber in 1687 under Louis XIV, are older than those of Cassini and Meyer the accordance between them must be the result of mutual and exact astronimical observations."

ఖగోళశాస్త్రం ఆధారంతో నిర్ణయమైన ఈ అంశాలు ఎంతవరకు చరిత్రతో సరిపోతున్నాయి? అన్న విషయాన్ని పరిశీలిద్దాం. దీనికి చాలా ప్రమాణాలు ఆధారంగావున్నాయి. కాని ఒక్క విషయం మాత్రం ఇక్కడ ఉదహరించి చూపిస్తాను.

'ఇండియన్ ఆంటిక్వరి' 333-334 సూచికగల శాసనం యీ పై విషయాన్ని ఋజువు చేస్తున్నది.

(iii) అది పరీక్షిత్తు కొడుకు, ధర్మరాజు మునిమనవడూ అయిన జనమేజయుడు, కిష్కింధలో యిచ్చిన దానమును గూర్చి తెలిపే శాసనం.

(iv) ఇది, యుధిష్ఠిరశకం 89వ సంవత్సరంతో సరిపోయే "ప్లవంగ నామ" సంవత్సరంలో అమావాస్యనాడు శ్రీ సీతారాముల కైంకర్యం కోసం యివ్వబడిన దానం గురించి తెలుపుతోంది.

(v) యుధిష్ఠిరుడు భారత యుద్ధానంతరం - అంటే కలియుగ ప్రారంభానికి 36 సంవత్సరాలకి ముందు - రాజ్యాభిషిక్తుడైనాడు.

| | |
|---|---|
| - అంటే - కలియుగం | 3102 B.C. |
| యుధిష్ఠిరశకం - | 36 |
| | 3138 B.C. |

(vi) ప్రమాధి సంవత్సరంలో కలియుగం ప్రారంభమై మళ్ళీ ప్రమాధినాటికి 60 సంవత్సరాలు గడవగా 29వ సంవత్సరమైన ప్లవంగకు సరిపోతుంది. సోమవారం అమావాస్య, ప్లవంగ కూడా ఇలా అన్నీ కలిసిన తేదీని ఈ దానశాసనం ఋజువుపరుస్తూ వున్నది. పురాణాలలో యిచ్చిన కాలంతోను, ఖగోళ శాస్త్రజ్ఞులైన 'బైలీ', 'లాకైలీల' గణితంతో

తేలే కలియుగ ప్రవేశకాలంతోనూ సరిపోతూవుండే చారిత్రకాధారమైన ఈ దానశాసనం జనమేజయుడు వ్రాయించినది. జనమేజయుడు (సర్పయాగం కథలో భారతంలో చెప్పబడ్డవాడు) ఇచ్చిన దాన శాసన కాలంతో భారత, భాగవత గతమైన అంశాలన్నీ చారిత్రక సత్యాలని తేలుతున్నది.

ఇంకోవిషయం - భారతీయ పురాణాల్లోని విషయాలు శాస్త్రీయ మైన కాలనిర్ణయాలతో ఋజువయ్యే సత్యాలని చెబుతూ, భారతీయ ఖగోళం, గణితంయొక్క నిర్దుష్టతని ప్రశంసించిన పాశ్చాత్య పండితుల వాక్యాలతో (నవీనుల తృప్తికి) యీ ప్రస్తుతాంశం విరమిద్దాము.

సర్.డబ్ల్యు. హంటరు పండితుడిలాగ వ్రాస్తున్నాడు :

In some points the Brahmins made advances beyond Greek astronomy. Their fame spread through out the West, and found entrance into the Chronicle Paschale, commenced about 330 A.D. and revised under Heraclius" (Indian Gazetteer Vol. IV P. 218).

తా॥ కొన్ని అంశములలో బ్రాహ్మణులు యవనుల ఖగోళశాస్త్రము నతిక్రమించిరి. వారి ఖ్యాతి పాశ్చాత్య భూమియందంతటా ప్రాకి 'క్రానికల్ పాస్కల్' యను గ్రంధంలోనికి కూడా చొచ్చినది. ఈ గ్రంధము క్రీ॥శ॥ 340 సం॥రములో ప్రారంభించబడి 610-641 సంవత్సర మధ్య కాలంలో 'హెరాక్లియసు' అజ్ఞానుసారము సరిచూడ బడినది.

"The Hindu systems of Astronomy are by far the oldest, and that from them, the Egyptians, Greeks, Romans and even

the Jews derived their knowledge." (Prof. Bailley the famous French Astronomer.)

తా॥ భారతీయుల ఖగోళశాస్త్రం చాలా పురాతనమైంది. వారి వద్దనుంచే ఈజిప్షియనులు, యవనులు, రోమనులు, యూదులు కూడా నేర్చుకొన్నారు.

"The Kaliyug Era is the Principal astronomical reckoning of the Hindus. It is frequently, if not generally shown in the Almanacs.... Its initial point lay in 3102 B.C. and the year 5002 began in A.D. 1900." (Encyclopaedia Brittanica 14th edition 5th Vol. P. 658).

తా॥ కలియుగశకము, హిందువుల ఖగోళశాస్త్రముపై నాధార పరచ బడిన ముఖ్యమైన శకము. అది పంచాంగములలో ఉదహరింప బడుతూనే ఉంటుంది. ఆ శక ప్రారంభము క్రీ॥శ॥ 1900 సం॥రములో ప్రారంభమైంది. (ఎన్సైక్లోపిడియా బ్రిటానికా 14 ముద్రణం 5వ వాల్యూం 658 పేజీ).

"The Puranas are, usually fairly in agreement with the evidence of inscriptions and Coins so far as the names of the kings and the length of their reigns are concerned."

— (Ancient India, By E.J. Rapson M.A. Cambridge P. 117).

"రాజులు, వారి పరిపాలనా కాలముల విషయంలో పురాణ ములు, శాసనములు, నాణెములవలన తెలియవచ్చిన విషయము లకు సరిగా సరిపోవుచున్నది" అని ఇ.జె. రాప్సను మహాశయుడు వ్రాసియున్నాడు.



# 5

# శ్రీకృష్ణుడు - భగవద్గీత

నవభారత నిర్మాతగా శ్రీకృష్ణుడు మనకి చేసిన అమూల్య సేవ, నవసమాజం కోసం ఆయన మనకిచ్చిన ఒక కొత్త సాంఘిక ధర్మం. ఇంకా నవసమాజ నిర్మాతగా మానవజాతి చరిత్రలో ఆయనకి వున్న స్థానం, వీటి గురించి ఇంతవరకూ చెప్పుకొన్నాం. కాని మనకీనాడు చరిత్రలో కనపడేది ఆయన మనకిచ్చిపోయిన భగవద్గీత అనబడే గ్రంథం.

శ్రీకృష్ణుడు వేదాంతిగా, ఆధ్యాత్మిక ప్రవక్తగా మనదేశానికిచ్చే అమూల్య సందేశమేమిటి? మానవుడికి ఆయన చూపించిన ఆధ్యాత్మిక గమ్యం ఎటువంటిది? ఈ ప్రశ్నలన్నిటికి సమాధానం రెండే రెండు ముక్కల్లో చెప్పాలంటే, అవి ''శ్రీకృష్ణుడు - భగవద్గీత.'' దీన్ని గురించి యిప్పుడు సూక్ష్మంగా తెలుసుకుందాం.

శ్రీకృష్ణుడు అర్జునుడికి ఉపదేశించిన భగవద్గీత ద్వారా సర్వ మానవజాతికి తన ఆధ్యాత్మిక సందేశం వినిపించాడు. అందుకనే చరిత్రకి ఆయన గీతాచార్యుడుగా పరిచయమయ్యాడు. తన జీవిత కాలంలోనే 'భగవంతుడు' అని గౌరవించబడ్డ ఆ మహావ్యక్తి యీనాటి యిరవయ్యో శతాబ్దంలోని మానవుడికిచ్చే సందేశం ఏమిటి?

భగవద్గీత అనేక విషయాలను మనకి తెలుపుతుంది. కాని వాటిల్లో కల్లా ముఖ్యమైన అంశం మానవుడి ఆధ్యాత్మిక పరిణామం (Man's Inner Development). మనిషియొక్క శరీర పరిణామాన్ని మాత్రమే చెబుతుంది మనకు డార్విన్ సిద్ధాంతం. లోభం, దురాశ, పరపీడన పరాయణత్వం, యిలాటి స్వార్థపూరిత విష వాతావరణంలోనే మనిషి అంతరాత్మ అణగిపోతున్న ఈ 20వ శతాబ్దిలో యంత్రాన్నే పూజిస్తూ, ఆత్మలేని గుడ్డిబ్రతుకులతో యాంత్రికంగా బ్రతుకుతున్న మానవ సమాజానికి, ఆత్మ వికాసమంటే ఏమిటో చెబుతుంది "భగవద్గీత."

మనిషికి చల్లనిగాలీ, ఆరోగ్యకరమైన వాతావరణం ఎలా కావాలో, అలానే అతడి వ్యక్తిత్వ వికాసానికి స్వేచ్ఛ అవసరం అంటాడు శ్రీకృష్ణుడు గీతలో. ఇదే "స్వధర్మం" అన్న ఆయన సిద్ధాంతం. అందరి స్వేచ్ఛా అరికట్టకుండా అందరికీ ఆత్మవికాసం, ఆధ్యాత్మిక పరిణామం వుండేలాగ సామాజిక వ్యవస్థ ఉండాలి అన్నదే గీతచెప్పే సమాజవాదం. ఈనాడు కారల్ మార్క్సు, గాంధీ, డార్విన్‌ల మూలగ్రంథాలలాగే ఆనాడూ శ్రీకృష్ణుడు తన మూలగ్రంథం ద్వారా మానవజాతికి కొత్త సందేశం యిచ్చాడు.

"అందరికీ ఆత్మవికాసం - ఆధ్యాత్మిక పరిణామం" అంటే ఏమిటి? అన్న విషయం తెలిస్తేనేగాని మనకి గీతలో వున్న అతి

ముఖ్యరహస్యం తెలీదు. ఈ ఆధ్యాత్మిక పరిణామం అంటే ఏమిటో తెలుసుకుందాం.

"Civilization — Its Cause and Cure" * అనే విచిత్ర గ్రంథం ఒకటి ప్రకటించబడింది. అంటే మానవ సంస్కృతీ - దాని కారణం - దానికి నివారణ అని. నివారణ యేమిటి? మానవ సంస్కృతికి నివారణ ఎందుకని మనం ఆశ్చర్యపోవచ్చు. అదొక రోగంలాటిదా? రోగమైతే నివారణ చేసుకుంటాంగాని, సంస్కృతికి నివారణ యేమిటి?

ఈనాడు మానవుడిని రోదసిలోకి పంపి పూర్వకాలం చరిత్రలో కనీవినీ ఎరుగని విజయం సాధించాడు మనిషి. చంద్రగ్రహంమీద కాలుపెట్టి వైజ్ఞానికంగా, సాంకేతికంగా యీనాడు ఒక గొప్ప విజయం సాధించటంతో యిదివరకు మన పూర్వులకంటే ఎంతో ముందుకు వచ్చాంగదా? ఇదంతా సంస్కృతికాదా!

సూక్ష్మంగా చెప్పాలంటే ఎడ్వర్డ్ కార్పెంటరు రాసిన "Civilization its Cause and Cure" అన్న పుస్తకంలోని వాదం యిది. యీనాడు మనిషి బ్రతకడానికి ఎక్కువ శ్రమపడవలసి రావటమేకాక జీవించటానికి ఖర్చుపెట్టే శక్తికీ, శ్రమకి ప్రతిఫలం తగ్గిపోతున్నది. నిజంగా చూస్తే జీవితంయొక్క నికరపు విలువ, ప్రతిఫలం తగ్గిపోతున్నది, నిజానికి మనిషికి కావలసిన అవసరాలు చాలా కొద్ది. ఇవి సంపాదించుకోగా మనిషికి ఇంకా ఎంతో తీరికా, కాలం, ఓపిక మిగిలి వుండాలి. ఈ తీరిక, శాంతీ, వీట్లతో మిగిలే శక్తి, ఓపికలతో మనిషి మానసికంగా, ఆధ్యాత్మికంగా, నైతికంగా ఎంతో పురోగమించవచ్చును.

---

Note : * **"Civilization — Its Cause and Cure"**

— *Edward Carpenter*

కాని యీ నాగరికతవల్ల వచ్చిన "జీవిత ప్రమాణం"తో ఖర్చు, శ్రమా ఎంతో పెరిగిపోయాయి. దీనివల్ల జరిగే ప్రమాదమేమిటంటే మనిషి లేచిందిమొదలు పొట్టకూటికి పోరాటంతోటే సరిపోతున్నది. తెల్లవారింది మొదలు చివరికి రాత్రి ఫ్యాక్టరీనించో, ఉద్యోగంనించో ఇంటికివచ్చి నీరసంగా వాలిపోయి, బడలికతో నిద్రపోయేవరకూ కూడ ఇలా బ్రతకడం కోసం చేసే యుద్ధమేతప్ప యింకేమీలేదు జీవితంలో. అందుకే, నికరపు విలువల యీనాటి మానవుడి జీవితంలో నానాటికీ తీసికట్టు అయిపోతున్నది.

అందుకని జీవితంలో పరుగు, ఆఫీసుకి పరుగు, సిటీబస్సులో సీటుకి పరుగు, కాఫీ హోటల్లో ముందుగా సీట్లకోసం పరుగు, జీవితంలో కాలంకోసం పరుగు. ఎక్కడ చూసినా "క్యూ"లు, పెళ్ళికొడుకుల దగ్గిర్నించీ ఉద్యోగాలవరకూ. ఈ పరుగు ఫలితం యీనాడు మనం "పేరాగ్రాపు చదువరి"గా తయారయ్యాం. పొట్టికథలు తప్ప దేనికీ తీరుబడీ, ఓపికాలేని నీరసపు హీరో, యీనాటి మనిషి.

అంతేకాదు. ప్రపంచ జనాభాలో హెచ్చుమంది ప్రతిదాంట్లోనూ "దగ్గిర దోవలు" వెతికే అవకాశవాదులుగా తయారయ్యారు. ప్రతి దానికీ దగ్గిరదారి, దొడ్డిత్రోవ, కళ్ళు తిండికోసం తీర్చివున్న క్యూలోంచి కిందపడ్డవాటికోసం వెతుకుతూ వుంటాయి. కళ్ళకందనే నేలమీద దృష్టి, జీవితంలో పైకిచూసే టైములేదు మనకి. విస్తరాకుల కెగబడే కుక్కల్లాగ అవకాశాలకోసం చొక్కాలు చింపుకొని పీకలు కోసుకుంటు న్నాడు యీనాటి మనిషి. మానవత్వం మీద పద్యాలు కథలు రాస్తాడు పైగా.

ఇతరుల "ఐడియా"ని కొట్టేయాలనీ, పక్కవాడి జేబు కొట్టెయ్యా లని, తను సంపాదించనిది, తనదికానిది తను ఎలాగైనా రాబట్టాలి.

మనం విత్తకుండా ఎదుటివాడి శ్రమలోంచి దొంగిలించాలి, పక్కవాడి పొలంలో కంకులు కోయాలి, ఇదీ యీనాటి జీవిత వేదాంతం తరహా.

అందుకే యీనాడు మానవ సమాజం యితరుల శ్రమమీద బ్రతికే క్రిములతో నిండివున్నది. మనది పరపీడనం మీద విలసిల్లే విలాసం. ఇది మనకి మెర్క్యురీ లైట్లవెనకా, టెరిలీను గుడ్డల అడుగునా, సినిమాల మిరుమిట్ల స్వర్గధామాల అడుగునా, నేల సొరంగాలలో కనిపించేది; కుళ్ళిపోతున్న మానవాంతరాత్మ - స్నోలు, పౌడర్లకింద కప్పుకున్న కన్నీళ్ళు, జీవితాన్ని విక్రయించడంకోసం పెట్టిన బోర్డులాటి నవ్వు, వీటి వెనక చూస్తే "మనం సంస్కృతి - దానికి నివారణా" అన్న మాటలకి అర్థం, అవసరమూ తెలుస్తుంది. ఇవన్నీ చూస్తే ఈ శ్రమంతా పడటం అవసరమా అనిపిస్తుంది. రోజురోజుకి సమాజం వార్తలలోకి రాకుండా నిష్క్రమించే ఆత్మహత్యల సంఖ్య, ఆత్మహత్యల కంటె నొప్పిగా బ్రతికే జీవుల బరువులు అవే దీనికి సమాధానం. మనం దేనికి దగ్గిరగా వెడుతున్నాం? భగవంతుడికా, ప్రకృతికా, లేక ఆనందం వైపుకా? మనం జీవితంలో చెమటోడ్చి శ్రమించి బ్రతికి సాధించినదేమిటి? మన సంస్కృతిలో లోపమెక్కడ?

ఇటువంటి మనకి, ఆత్మవికాసం ఆధ్యాత్మిక పరిణామం అనే స్వేచ్ఛావాయువుల చల్లటి తావి అందించటం కోసమే భగవద్గీతా కారుడు పడిన శ్రమ. మనషి అనే యంత్రంలో 'ఆత్మ' అనే యిరుసు పూడిపోయింది. పూడిపోయిన యిరుసును బండి ఆగకుండా రిపేరు చెయ్యటం; ఇదే గీత ఉద్దేశ్యం. అందుకే జీవితంలో యోగాన్ని సంయోగం చేసింది గీత.

'యోగం' అనగానే అందరూ ఏదో అరణ్యాలలోకి పోయి అన్నీ వదిలేసి ముక్కుమూసుకొని కూచోటం అనుకుంటారు. వీళ్ళకందరికీ అసలు యోగం అంటే ఏమిటో తెలీదు.

జీవితంలో అందరూ ఆనందాన్నే కోరుకుంటారు. శాంతి కావాలనుకుంటారు. ఆరోగ్యం, సంఘంలో గౌరవం కోరుకుంటారు. ఇవన్నీ అందుకోటానికి ఒక క్రమబద్ధమైన సాధనం అంటే ప్రాక్టీసు (Practice) అవసరం. మనస్సు, శరీరం ఉపయోగించేందుకు శిక్షణ, మనస్సులో వచ్చే భావాలు, యివన్నీ సరిగ్గా పనిచేసేందుకు రోజూ యీ శరీరం అనే 'మిషన్ను' (Machine) సరిచేసేందుకు ఏమిచెయ్యాలో ఆ విధానమే 'యోగం'.

శరీరం ఓ బ్యాటరీలాంటిది. బ్యాటరీ కరెంటును పుట్టించినట్లే యీ శరీరమనబడే బ్యాటరీ కూడా "ప్రాణశక్తి"ని పుట్టిస్తుంది. ఈ శరీరం అనే బ్యాటరీని ఛార్జిచేసేందుకు, అది బాగా ఎక్కువ శక్తి నిచ్చేందుకు, దాంతో వచ్చే శక్తితో ముఖంలో వర్చస్సూ, తేజస్సూ, బుద్ధిబలం, శరీరారోగ్యం, ఆనందం సంపాదించే త్రోవచూపెట్టే విధానమే యోగం. అంతేగాని 'యోగం' అంటే జీవితంనుంచి పారిపోవటంగాదు. అడవుల్లో ముక్కుమూసుకోవటమూ కాదు. జీవితంలో ఎదుర్కొన్న సమస్యలని చూసి వెనుకంజవేస్తున్న అర్జునుడికి నేర్పిన యోగం యిదే.

నిత్యజీవితం నడుపుకోవటంలో 'నేర్పు' యోగం. జీవితంలో సమర్థతే 'యోగం' అని ఒక వినూత్నమైన నిర్వచనం ద్వారా శ్రీకృష్ణుడు, తీరికలేని యీ యిరవయ్యోశతాబ్ది మానవుడు కోరుకొనే 'జీవితంలో యోగసాధన' అన్నమార్గం యిచ్చాడు. శక్తి శరీరంలో ఎలా పుట్టుతుంది

అన్న కీలకం, దాన్ని ఛార్జిచేసే విధానం, యీ రెండూ కూడా యిచ్చాడు శ్రీకృష్ణుడు యోగంద్వారా.

మానవజాతినీ, ఈ జంతుకోటినీ, గ్రహమండలాన్నీ సృష్టించిన ఏదో అజ్ఞాతశక్తిని భగవంతుడు అంటున్నాం. ఈ భగవంతుడికి మనస్సు వుందా? అని ఆశ్చర్యపోనక్కర్లేదు. గుండెలు కొట్టుకునేటట్టు, రక్తం ప్రసరించేటట్టు, వానలు కురిసేట్టు, అన్నం, ఆకలీ వోదానికోటి దంపతులుగా ఉండేటట్టు సృష్టించిన శక్తి ప్రతిపనీ సృష్టిలో ఏదిచేసినా ఏదో ఒక క్రమబద్ధంగానే చేస్తూవున్నది.

మానవుడికి ఒక పరిణామం అంటూ ఏర్పాటుచేసింది కూడా యీ అజ్ఞాతహస్తమే. గింజ మొలకెత్తాలి, చెట్టు కాయాలి. అలానే మనిషికి నిర్దేశించిన పరిణామం ఏమిటి? ఇదే మానవుడికి భగవంతుడు చెప్పే సందేశం. ఇదే ప్రకృతి నిర్దేశం, ఆధ్యాత్మిక శాసనం.

శ్రీకృష్ణుడనే ఒక చారిత్రక వ్యక్తిద్వారా మానవజాతికి భగవంతుడు పంపించిన సందేశమే భగవద్గీత. ఈ చారిత్రక పురుషుడైన శ్రీకృష్ణుడి ద్వారా, భగవంతుడు - అంటే సర్వమానవ జాతినీ, సర్వ జంతువులనూ, ఇతర జీవసముదాయాన్ని కూడా సృష్టించి పదార్థంలోంచి "మనస్సు" ను పుట్టించిన దైవశక్తియే "భగవంతుడు" అని, ఎవర్ని గురించి అన్ని మతాలూ చెబుతున్నాయో - ఆ భగవంతుడు మానవజాతికిచ్చే సందేశమే భగవద్గీత ద్వారా వ్యక్తం చెయ్యబడింది.

భగవంతుడు మనకిచ్చిన ఈ అమూల్య సందేశాన్ని ఒక గీతం ద్వారా - గీతం అంటే చక్కగా గానం చేశాడు వ్యాసమహర్షి; ఆ గానం చెయ్యబడ్డ గీతమే భగవద్గీతము. భగవంతుడి యొక్క అమూల్య సందేశాన్ని ఒక చక్కని గీతం రూపంగా మనకిచ్చాడు. గీతం అనే ఒక

కావ్యవస్తువు ద్వారా లేక గీత అనబడే ఛందోశిల్పం ద్వారా వ్యాసమహర్షి వ్యక్తం చేశాడు. ఇలాగే యింకోటి "రుద్రగీతలు" అనే కావ్యశిల్పం మనకి భాగవతంలో కనిపిస్తుంది. 'ఋభుగీతలు' 'భ్రమర గీతలనే'వి కూడా ఇటువంటివే. ఇలా 'గీతలనే' అనేకములయిన కావ్యవస్తువుల గురించి చాలామంది వినేవుంటారు. భగవద్గీత అనేది వీటి అన్నింటి లోకీ విశేషమయినది. ఈ భగవద్గీత చెప్పే విశేషం ఏమిటి?

మానవజాతికి యుగయుగాలుగా భగవంతుడు యిస్తున్న అమూల్య సందేశమే భగవద్గీత. మానవజాతికి అంటే ఒక్క భారత దేశంలోనే కాదు బైబిల్ (Bible) గనక తీసి చూసినట్లయితే 'మోసెస్' అనే ఒక మతప్రవక్త ద్వారా ఇజ్రేల్‌లో యూదులు అనే జాతికి తన అమూల్య సందేశాన్నిచ్చాడు భగవంతుడు. అవి (Ten Commands) పది ఆదేశాలు అన్న రూపంలో గ్రంథస్థం చెయ్యబడ్డాయి. అలాగే మహమ్మదీయ మతస్తులందరికీ అంటే అరేబియా, ఇరాన్, పర్షియా, సిరియా మొదలయిన దేశాల్లో వుండే ముస్లిమ్ జాతులని ఈరోజున పిలువబడే జాతులందరికీ, మహమ్మద్ ప్రవక్త ద్వారా భగవంతుడు మళ్ళీ ఒకసారి తన సందేశాన్ని పంపించాడు. అలాగే యింకోసారి గౌతమ బుద్ధుడిద్వారా, ప్రపంచంలో పరిణతిపొందిన జాతులందరికీ తన అహింసా సందేశం పంపించాడు. ఈ దివ్యవాణే మళ్ళీ క్రీస్తు కంఠంలో ప్రతిధ్వనించింది. ఇలా తన విశ్వసందేశాన్ని భగవంతుడు తన దివ్యవాణిగా మానవుడనే యంత్రంద్వారా, ప్రపంచానికి విని పించాడు, వినిపిస్తూనే వున్నాడు. అయితే, మానవుడనే యంత్రం ఎలాగ "యీ భగవత్ వాణికి పనిముట్టుగా ఉపయోగపరచబడింది?" అన్న

విచిత్రం పరిశీలిద్దాం.

మనం రేడియో నిత్యం వింటూంటాం. ఆ రేడియోసెట్టు అంటే మన టేబిలుమీదనో ఎక్కడో పెట్టుకొని వినే సెట్టు ఎక్కడినుంచో ప్రసారమయ్యే శబ్దతరంగాలను మనికి వినపడేటట్లు చేసే యంత్రం మాత్రమే. అది, అందులో వచ్చే ప్రోగ్రాములను, కార్యక్రమాలను, తానై సృష్టించటం లేదు; "ప్రసారం" మట్టుకే (Transmit & Receive) చేస్తున్నది. అలాగే యీ శరీరం, కంఠం, మాటలూ, స్వరమూ ఇవన్నీ కూడా బహిర్గతం చేసి వినిపించే సాధనం మాత్రమే. ఆ ప్రసారం అయ్యే స్థానం మాత్రం ఎక్కడో పైనుంది. (దేవుడు, అల్లా, లేక పరబ్రహ్మస్థానం etc.) మామూలుగా మనిషి మనస్సుకి అందనిది, ఊహించటానికి వీల్లేనిది, ఏదైతే వున్నదో, ఆ కనబడే ప్రపంచా లన్నింటినీ నిర్మాణం చేసిన, చేస్తున్న కేంద్రం ఏదైతే వున్నదో, ఆ 'విశ్వమేధస్సు' (Universal Mind) నుంచి ప్రసారమయ్యే సందేశమే, బైటికి మనకి వినిపించటానికి యీ 'ప్రవక్త', లేక 'అవతారం' లాంటి వాళ్ళ శరీరం ద్వారా బహిర్గతం చెయ్యబడింది. ఇలాటివే ఈశ్వరవాణి అనబడే అన్ని దివ్యోపదేశాలున్నూ. అలాంటిదే భగవద్గీత కూడా.

దీన్ని ఈనాటి సైన్సు దృష్టిలో చెప్పాలంటే "అవతారం" అన్నా, ప్రవక్తలన్నా యిలాగ ఈశ్వరవాణిని ఆకాశవాణిలాగ బైటికి బహిర్గతం చేసే రేడియో సెట్టులాంటివాళ్ళే. అందుకే ఆ భౌతిక యంత్రాన్ని - శరీరాన్ని శిలువవేసినా, వెలివేసినా, యీశ్వరవాణి మాత్రం ఏమీ మారదు! అవతార ప్రయోజనం ఇందుకే. ఈ భూమ్మీద ఉంచబడ్డ మానవుడికీ, అంతకన్న పైన వున్నదానికీ మధ్యన, ఒక నిచ్చెనలాంటి

వాడు అవతారం. ఆ నిచ్చెన ఆధారం చేసుకుని అనేకులు పైకి పోగలరు.

ఈ భగవద్గీత, మూడు మహాసత్యాలను గురించి మనకి తెలుపుతుంది. అవేమిటంటే మొదటిది జగత్తు. అంటే యీ కనబడే దంతా! దేంట్లో అయితే 'మనిషి' అనే ఈ బొమ్మ నిలబెట్టబడిందో ఆ రంగస్థలం. ఇకపోతే, రెండోది 'జీవుడు' అంటే 'తాను'. మూడో సత్యం "ఈశ్వరుడు". అనగా సృష్టికర్త అయిన సర్వేశ్వరుడు. ఇది జగత్ వ్యాపకమైన ఒక వ్యక్తిత్వం. ఈ విశ్వం అనే పెద్ద శరీరంలో దాక్కొని వున్న 'తాను'.

జగత్తు అనేది లేకపోతే అసలు మొదలంటూ ఏమీలేదు. ఈ జగత్తులో జీవించే వ్యక్తులు అంటే మనమంతా కూడా జీవులమే; జీవించే ప్రతిజీవి యీ జీవుడే. ఈ జీవుడనేవాడు లేకపోతే అసలు కథలేదు.

మూడోది - యీ జగత్తునీ, యీ జీవుడినీ సృష్టించినది ఎవరు? ఎవరో ఒక అజ్ఞాతశక్తి. అతడిని భగవంతుడని అంటున్నాము. ఈ జగత్, జీవ, ఈశ్వరులనబడే మహాసత్యాల గురించి శాస్త్రీయదృష్టితో చెప్పే సత్యమే గీతలోని విషయం.

మామూలుగా, మనిషిలో రెండు విభాగాలు కనపడుతున్నాయి. ఒకటి, తను లోపల ఏమైవున్నది. 'తానై' వున్న నిజమైన వ్యక్తిత్వం. దీంట్లో తనలోపల రహస్యంగా తనకే ఒకప్పుడు తెలియకుండా అణిగి మణిగి అంతర్లీనమైవుండే అనేక కోరికలూ, కామక్రోధాలు, గొప్ప గొప్ప ఆశయాలు, ఆదర్శాలూ, సహజంగా మనిషికుండే చాపల్యాలూ యివన్నీ కూడా కలిసివుంటాయి. ఇది మనం ఏ వ్యక్తిత్వంతో

జన్మించామో, ఆ వ్యక్తిత్వం అంటే మన లోపలగావున్న అసలు రూపం, లేక నిజస్వరూపం. కాని మనం సమాజంలో బైట తిరిగేప్పుడు యీ వ్యక్తిత్వమే యధాతథంగా పైకి చూపించంగదా? అందుకని శరీరానికి మనం చొక్కా ఎలాగ తొడుక్కుంటున్నామో అలాగే యీలోపలవున్న అసలు వ్యక్తిత్వానికి 'మనస్సు', అన్న చొక్కా తొడుక్కుంటున్నాము.

ఈ 'మనసు' అనబడే చొక్కాతో ఏం చేస్తున్నాం మనం? దీని సహాయంతో ప్రపంచమనబడే ఒక మహాయంత్రాంగముతో మనం నిత్యం వ్యవహారం జరుపుతున్నాం. మన నిత్యజీవితానికవసరమైన కార్య కలాపాలన్నీ చేసుకోటానికి దానిద్వారా మన శరీరయాత్రకి అవసరమైన విషయాల్ని, వస్తువుల్ని, సంఘటనల్ని మనకి అందజేసే మహాయంత్రమే 'ప్రపంచం' అంటే ("పంచ" అంటే అయిదు. ప్రపంచం అన్నమాటకి ఐదుగా అనుభవింపబడేది" * అని అర్థం), బైట ఈ ప్రపంచమనబడే యంత్రానికి, లోపలి వ్యక్తిత్వానికీ మధ్య చొక్కాలాగ యీ మనస్సు వుంది. ఈ మనస్సనే యంత్రంద్వారా ఐదు ఇంద్రి యాలూ పని చేస్తున్నాయి. అంటే, యివి లోపలున్న వ్యక్తిత్వానికున్న 5 టెలిఫోన్లు, టెలివిజన్లు, 5-రేడియోల్లాగ అన్నమాట.

ఇందులో చెవి-టెలిఫోను; బైటివన్నీ ప్రపంచంలో స్పందించే వాటినన్నిటినీ వినటానికి. అలాగే బైట ప్రపంచంలో జరిగేవన్నీ చూడటానికి టెలివిజను యంత్రంలాగ కన్నూ, తనకి బైటవున్న యీ ప్రపంచంతో మాట్లాడటానికి రేడియోలాంటిది నోరు. ఈ అన్ని యంత్రాలూ, అంటే ఇంద్రియాల ద్వారా అందుతున్న భోగట్టానంతా

---

* "శ్రోత్రం చక్షు స్పర్శనంచ రసనం ఘ్రాణమేవచ"

అందుకుని అర్థంచేసుకోటానికో బుద్ధీ - ఇలాగ ఈ యంత్రాంగాన్ని ఇంద్రియాలంటారు. * మనస్సనే చొక్కా తొడుక్కొని ఇంద్రియాలనే యంత్రాల సాయంతో 'తను' యీ ప్రపంచమనే మహాయంత్రంతో వ్యవహారం చేస్తూంటుంది.

ఇలాచేసే వ్యవహారమంతా 'జీవితయాత్ర' అంటాము. అంటే జీవి తనకు కావలసిన అనుభవాన్ని సేకరించుకోటానికి, ఈ ప్రపంచం అనే యంత్రంలో చేసే యాత్ర అన్నమాట. ఇలాగ జరిగే జీవన యాత్రలో రెండు విభాగాలున్నాయి.

ఒకటి, ప్రపంచంలో యీ శరీరం నిలబడటానికి అంటే జీవించ టానికి కావలసిన నిత్యావసరాలు, పదార్థాలను వస్తువులను, సంబంధీకు లనూ, సేకరించుకోవటము. దీన్ని 'జీవనోపాధి' అందాము. రెండో అంశము ఇంకోటికూడా యీ జీవనయాత్రకి సంబంధించినది ఉన్నది. దీనిని 'జీవన పరమావధి' అనుకోవచ్చు.

అది యీ జీవించటం, జన్మించటం - ఇలా జన్మజన్మకీ అనుభవాన్ని సేకరించుకుంటూ పోతే చివరికి చేరుకోవలసిన గమ్యం మనల్ని యిలాగ పయనింపచేస్తున్న ప్రకృతియొక్క మహాప్రయోజనం, అంటే జీవించటం కోసం చేసే ప్రయత్నం వొకటి - దీన్ని మనం "పొట్టపోసుకోవటం" అంటాం. రెండోది జీవించేదెందుకోసం? ఏ ప్రయోజనంకోసం యీ యంత్రాంగం అంతా సృష్టికర్త సృష్టించాడో - అది. అంటే మనలోపలి వ్యక్తిత్వం అది వ్యవహరించటానికివ్వబడిన

---

* అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే" - గీత.

పంచేంద్రియాలు, మనస్సనే చొక్కా - ఇదంతా ఎందుకివ్వబడిందో వీటితోడి మనం ఏం చెయ్యాలని ఉద్దేశించబడింది? జీవితంతో మనం ఏం చేయవలసివున్నది? యిక్కడ యీ భూమ్మీదకి రావడంలో మనకి ప్రయోజనం (పరిణామ-ప్రయోజనం) ఏమిటి? ఏ గమ్యం మనకివన్నీ యివ్వటం ద్వారా ప్రకృతి మనకోసం నిర్దేశించింది? ఆ గమ్యాన్ని తెలుసుకోవటం రెండో అంశం. జీవితం, జీవిత పరమావధి. ఈ రెండూ వేరు విషయలు.

ఈ పరమావధి - గమ్యంను తెలుసుకోవటానికి, దాన్ని చేరు కోవటానికి మనం ఏం చెయ్యవలసివుందో, దాన్ని పొందాలంటే ఎలాటి పరిణామం (Evolution) మానవుడిలో రావలసి వుందో దాన్ని గురించి చెబుతుంది 'భగవద్గీత'.

మనిషి ఒక విత్తనంలాంటివాడు. గింజ మొలకెత్తి చెట్టయి ఎలాగ వృద్ధిచెందాలో అలాగే మానవుడు కూడా పెరిగి పరిణామం చెంది అన్నివిధాలా పరిపూర్ణుడై, ఒక గమ్యస్థితిని చేరుకోవాల్సిన అవసరం వుందో అది గమ్యస్థానం. ఎటువంటి గమ్యస్థితిని ప్రకృతి మన కోసం నిర్దేశించిందో, ఎటువంటి పరిణామాన్ని మనకి భగవంతుడు సహజంగా నియమించాడో, అది తెలుసుకొనేటువంటి విధానం, ఆ రెండో జ్ఞానం. ఇది నిత్యజీవితావసర పరిజ్ఞానంగా వేరైనది.

ఒకటి ఇహలోక ప్రపంచం గురించిన పరిజ్ఞానం. ఇంకోటి పరలోక ప్రపంచం గురించిన పరిజ్ఞానం. మతగ్రంథాలన్నీ కూడా యీ పరలోక ప్రపంచజ్ఞానంతో సంబంధించినవే. మనుష్యుడు ఎందుచేత యీ భూమి మీద ఉంచబడ్డాడో, మనమిక్కడ ఎందుకు ఉన్నామో మనం ఏం

చెయ్యవలసింది ఉందో, మన పరిణామం ఎలాగ - అనే దాన్ని గురించే చెబుతాయి. కాని "భగవద్గీత"లో వున్న విశేషం ఏమిటంటే ఇహలోక పరిజ్ఞానం, పరలోక పరిజ్ఞానం యీ రెండింటినీ వేరు చెయ్యకుండా రెండిటినీ కలిసి ఒకే జీవితంగా నిత్యం జీవిస్తూ నిత్యజీవితావసరాల్ని నిత్యం సేకరించుకుంటూనే పరలోక పరిజ్ఞానాన్ని మన పరిణామంలో మనం చేరుకోవాల్సిన గమ్యస్థితి గురించిన ఆలోచన, దృష్టిపోకుండా వుండేటటువంటి సమన్వయ విధానం చెప్పబడింది.

శ్రీరామకృష్ణపరమహంస ఏమన్నాడంటే నిజమైన యోగి ఎలా వుండాలి, నిత్య జీవితంలో? అంటే :- నెత్తిమీద ఓ కడవతో నీళ్ళు పట్టుకుని తీసుకుని పోతూవుండే స్త్రీ వున్నదనుకోండి, పక్కన వున్న స్నేహితులతో మాట్లాడుతూవుంటుంది. అన్ని విషయాలు చర్చిస్తూనే వుంటుంది. హాస్యంగా ఛలోక్తులు విసురుతూంటుంది. కాని నెత్తిమీద కడవ పడకుండా ఓ పక్కన మనస్సులో ధ్యాసవుంటుంది. అలాగ, నిత్యజీవితంలో మనం జీవిస్తూ నిత్యజీవితావసరాల్ని కనుక్కుంటూనే అంటే శరీరాన్ని పోషించుకుంటూనే, అది ఒక్కటేగాకుండా అంటే నిత్య జీవితావసరాలతోనే, పొట్ట పోసుకోవటంలోనే వెళ్ళిపోతూ వున్నది జీవితం. ఇప్పుడందరికీ నిత్యజీవితం, ఉద్యోగం, పొట్ట పోసుకోవటంతోనే వెళ్ళిపోతూవున్నది జీవితం. తెల్లవారింది మొదలు రాత్రి పడుకునే దాకా మనందరికీ కూడా ఇంతే. ఇలా కాకుండా మనం మన గమ్యస్థితిని కూడా ఓకంట గమనించుకుంటూ అలా గమ్యస్థానం అంటే మనం ఏ దిక్కుకు వెడుతున్నామో కూడా గమ నించుకుంటూ యీ రెండిటినీ

నడిపించుకునేటువంటి సమగ్రమైన జ్ఞానం మనకి 'భగవద్గీత'లో యివ్వబడింది.

ఇది, భగవద్గీతలో వున్న ప్రత్యేక విశిష్టత. ఇది ఒక మత గ్రంథం మాత్రమే కాదు. అసలిది మతగ్రంథం కానేకాదు. ఎందు కనంటే 'భగవద్గీత'లో ఏ ఒక్క మతమూ చెప్పబడలేదు. ఏ మతం గురించి చెప్పదు. 'హిందూమతం' అనే మాటలేదు. భగవద్గీతలో ఎక్కడ చూసినా బౌద్ధమతమూ లేదు, క్రిష్టియన్ మతంలేదు, మహమ్మదీయ మతం లేదు. ఏ ఒక్క మతమూ ఇందులో చెప్పబడలేదు. ఇదీ మనం గమనించాల్సిన విశేషం. 'భగవద్గీత'లో తక్కిన మత గ్రంథాలలాగ "మీరు మా మతంలో చేరితేనే భగవంతుని చేరుకో గలుగుతారు – లేకపోతే నాశనమయిపోతారు" అనేటువంటి సంకుచిత దృష్టిలేదు. భగవద్గీతలో వున్నవి మానవజాతి అందరికీ సరిపోయే మహాసత్యాలు.

ఒక సైన్సుపుస్తకం లాంటిది భగవద్గీత. ఈ సైన్సు (Science) ఏమిటి? యోగమనేటటువంటి సైన్సు – యోగశాస్త్రం (Science of Yoga or Self Evolution).

యోగం అంటే ఏమిటి? ముక్కు మూసుకుని కూచోవటం కాదు అన్నది చెబుతుంది గీత.

యోగమంటే మనస్సు అనే ముసుగుతో వుందని చెప్పాను కదా! మనలో వుండే 'తాను' అన్న వ్యక్తిత్వం యీ మనస్సనే చొక్కా తోటి, ఇంద్రియాలనే మిషన్లతోటి యీ ప్రపంచం వెనుకవున్న మహా సత్యాన్ని తెలుసుకోవటం, తెలుసుకుని మనిషి ఎటు వెళ్ళాలిసివుందో ఆ గమ్యస్థానాన్ని చేరుకోవటం. అలా మానవుడు తన గమ్యస్థానం

అయినస్థితిని చేరుకోవటానికి ఏమి చెయ్యాలి? అన్న కార్యక్రమము. ఇది ఒక సైన్సు. అంటే ఒక శాస్త్రపరిజ్ఞానం. అందుకే యోగశాస్త్రం అనబడింది.

మనం చదువు అనేది కష్టించి అభ్యసిస్తున్నాం. వ్యాయామం చేస్తున్నాం, క్రమంగా శరీరం వృద్ధిచెందడానికి. అలాగే ఏదైనా కళ అభ్యసించాలంటే క్రమంగా శిక్షణ తీసుకుని నేర్చుకొని దాంట్లో గమ్య స్థితిని, పరాకాష్టని పొందుతున్నాం. అలాగే యీ ప్రపంచంలో సరిగ్గా జీవించే పద్ధతి ఏదైతే వున్నదో దానికో క్రమశిక్షణ అవసరం. ఈ క్రమశిక్షణ నిచ్చేటువంటిదే యోగశాస్త్రం.

ఈ యోగశాస్త్రం ఏ విషయాన్ని గురించి చెబుతుందంటే యీ జగత్తు అనేటువంటి మహాసత్యం ఏదైతే వుందో, దేన్నైతే ప్రకృతి అంటున్నామో, దేన్నైతే భగవంతుడు అంటున్నామో, ఏదైతే మనందరికీ పుట్టుకనిచ్చిందో, ఏదైతే జీవరాసులన్నిటికీ ప్రాణమిచ్చి పోషిస్తోందో, ఏదైతే వృక్షాలకి, జంతువులకి, క్రిమికీటకాదులకి, మనుష్యులకి, గ్రహాలకి, సూర్యునికి, నక్షత్రాలకి, సముద్రాలకి ఇటువంటి సర్వ వస్తువుల పుట్టుకకి కూడా ఏదైతే కారణం వుందో ఆ కారణం గురించి చెబుతుంది. ఆ కారణాన్ని భగవంతుడనండి, బ్రహ్మ అని అనండి, అల్లా అనండి, ఏదైనా అనండి - పేర్లు వేరేతప్ప ఉన్న మహాసత్యం ఒకటే.

ఈ మహాసత్యమే, లేక మహాసత్యవస్తువే సర్వత్రా అన్నింటిలోనూ నిండి అంతటా వ్యాపించి వున్నది. అదే మనుష్యుడి రూపంలో కూడా వున్నది. తనే మనుష్యుడి ఆకారం ధరించి, మనిషికి శరీరమిచ్చినది.

ఈ మనుష్యుడికి శరీరమిచ్చిందదే, మనసిచ్చినదీ అదే, ఇంద్రియాల నిచ్చినదీ అదే. ఇవన్నీ యిచ్చిన తర్వాత తాను మళ్ళీ "తను" అనేటు వంటి అంతరాత్మగా మనలో నిల్చిన వస్తువు కూడా యీ మహాసత్యమే. ఈ మహాసత్యం 'నేను' అని అనిపించే ఆత్మ అంటారు. 'ఆత్మ' అంటే ఆమాటకి అర్థం "తాను" అని.

ఈ "తాను"తో ప్రారంభించి క్రమంగా ఇంద్రియాల యొక్క పరిమితిని దాటి, మనస్సు యొక్క పరిధిని దాటి శరీరం యొక్క ప్రహరీగోడని దాటి, జగత్తు అనేటటువంటి యీ కనపడే మహాసత్యం యొక్క లోరూపు తెలుసుకుని ఏ మహాసత్యమైతే భగవంతుడి రూపం లోను, ప్రపంచరూపంలోను 'తాను'గా అంతటా నిండివున్నదో, అదే తను అన్నటువంటి స్థితిని ఊరికే ఊహతో భావించటం మాత్రమే కాకుండా నిజంగా తెలుసుకుని, అనుభవించి జగత్తుగా కనిపించే యీ విశ్వశరీరంలో తానొక అంగంగా, విశ్వప్రాణం తానే అయిన విశ్వప్రాణిగా, జీవించగల స్థితే, పరిపూర్ణ గమ్యస్థానం, ఈ సిద్ధిని పొందిన పూర్ణ పురుషులు, తమకి ప్రకృతి నియమించిన పరిణామం పరిణతీ పూర్తి చేసి తమ యాత్రయొక్క గమ్యం చేరిన బాటసారులు. ఈ స్థితిని పొందినవాళ్ళు ఈ ప్రపంచం అంతనీ ఒక విశ్వశరీరంగా భావిస్తే, అందులో అంగాలన్నీ కూడా ఒక్కే 'తాను' వల్ల కదిలించబడుతూ వున్నవిధంగా జీవించగలిగే స్థితిని పొంది, తమ ప్రత్యేక 'నేను' నుంచి సంకుచితమైన 'తాను' నుండి విముక్తిని పొందిన ముక్తజీవులు. ఇదే మానవుడియొక్క పరిపూర్ణస్థితి, గమ్యస్థితి. ఈ స్థితిని చేరుకొనే పద్ధతిన్ని "యోగం" అనీ, యీ శాస్త్రాన్ని (Science) యోగశాస్త్రమనీ అంటారు.

దీన్ని తెలుసుకునేందుకు ఒక శాస్త్రీయమైన రాచబాటని "భగవద్గీత" మనకి ఏర్పాటుచేసింది. కాబట్టే భగవద్గీత "యోగశాస్త్ర" మని చెప్పబడింది.

దీనికోసం సమాజంలో ఎటువంటి వ్యవస్థ వుండాలో మనిషికి మనిషికీ మధ్య సంబంధాలెలావుండాలో, జాతికి-జాతికి మధ్య సంబంధాలెలా వుండాలో నిత్యజీవితావసరాలు ఏవిధంగా నడుపుకోవాలో, అవి ఎంతవరకు రానివ్వాలో, యీ క్రోధం, కామం యిటువంటి పశుభావాలు ఏవైతే వున్నాయో మనిషిలోపల, మళ్ళీ వాటినెలా నిగ్రహించుకోవాలో, మనస్సు పరిపరివిధాల పరిగెత్తుతూ దాన్ని నిలబెట్టుకోవడం ఎలాగో, ఏకాగ్రతను ఎలా సాధించాలో ఇవన్నీ కూడా మనకి చెబుతుంది భగవద్గీత.

కాబట్టి 'భగవద్గీత' కేవలం ఒక మతగ్రంథం మాత్రమే అనుకోవటం తప్పు. భగవద్గీత ఒక మతగ్రంథం మాత్రమే కాదు. శాస్త్రీయ గ్రంథం కూడాను. అందుచేత అన్ని మతాలవారూ దాన్ని అనుష్ఠించవచ్చు.

'యోగం' అనేటువంటి శాస్త్రాన్ని మనకి చెబుతుంది. కాబట్టి యిది మహత్తరమైన శాస్త్రీయ గ్రంథం. మతగ్రంథాల్లో యీనాడు మనకి దొరికే ఒకే ఒక శాస్త్రగ్రంథం, మతసంబంధమైన సంకుచితత్వం లేకుండా ఒక శాస్త్రంలాగ, మనిషి పరిణామం పొందేటువంటి విధానం, సిద్ధాంతాన్నీ చెప్పేది భగవద్గీత.



6

# శ్రీకృష్ణుని విశ్వరూపం

ఆనాడు కార్తీక బహుళ త్రయోదశి, ఇరుసేనలూ యుద్ధానికి ఆయత్తమవుతున్నాయి.* కురుక్షేత్రమనే పవిత్ర స్థలమే ఆ సంగ్రామ భూమి. భారతదేశ చరిత్రలో అనేకసార్లు భారతదేశం యొక్క అదృష్టం నిర్ణయింపబడిన పుణ్యభూమి ఆ క్షేత్రం.

ఒకవైపున కౌరవుల సేనావాహిని బారులుతీర్చి వున్నది. పదకొండు అక్షౌహిణుల సేన. దానిముందుగా నిలువబడిన వాడు భీష్ముడు. సర్వసైన్యాధ్యక్షుడు శ్వేతఛత్రము, శ్వేతధ్వజమూ ధరించి, తెల్లగుర్రాలు పూన్చిన రథంమీద తెల్లటి ఊడుపులతో తెల్ల తలపాగా, తెల్ల యీకల

* మూడుసార్లు మనదేశం భవితవ్యం నిర్ణయించిన యుద్ధాలు జరిగిన పానిపట్టు యీ కురుజాంగల సమీపభూమే.

కుచ్చుల తురాయి ధరించి తెల్లగా మంచుకొండవలె ప్రకాశిస్తున్న భీష్ముడు మూడువందల అశ్వమేధయాగాలు చేసిన మేటి. అతని అధీనంకింద సముద్రంవలె ఘూర్ణిల్లుతున్న కౌరవసేనావాహిని బారులు తీర్చి నిలిచివున్నది.

దానికెదురుగా ఏడు అక్షౌహిణుల బలంతో భయంకరమైన భీమసేనుడి రక్షణకింద నిలువబడిన పాండవసేనావాహిని సేనా సమూహపు కోలాహలం, సముద్రపు హోరులాగ ఘోషిస్తున్నది.

ఉభయసేనలు యుద్ధానికి ఉద్యుక్తులవుతున్న సమయం. రెండు పక్కలనించి భేరీనినాదాలు, హయహేషలు, ఏనుగుల ఘీంకారాలు, ధ్వజములు, గాలికి రెపరెపలాడుతున్న రంగురంగుల పతాకాలు. ఎటు చూసినా అనేక ఆయుధాల తళతళలు, యీ సేనా సమ్మర్ధంతో పైకి లేచిన ధూళి, సూర్యరశ్మి కప్పి సంధ్యారాగంలాగ అలుముకుంటున్నది. సమరోత్సాహం పెనుతుఫానులాగ చెలరేగుతున్నది.

ఇరుదేశాల మధ్య నిలబడి వున్నది పాండవ మధ్యముడి రథం. దూరాన్నించి చూస్తే ఏదో విచారవదనముతో మ్లానముఖుడై వున్నాడు పాండవమధ్యముడు. అతనికి దగ్గరగా జరిగి, వీపుమీద చెయ్యివేసి ఆత్మీయతతో రహస్యంగా ఏదో చెప్పుతున్నాడు మాధవుడు.

బహుశః ఏవేవో చిక్కుప్రశ్నలకి గూఢములైన సమాధానములు యిస్తూవున్నట్టుగా కనపడుతుంది. చూస్తూవుండగానే అర్జునుడి ముఖంలో ఒక్కసారిగా ఏదో వింత తేజస్సు వెలిగింది. మొహంలో ఆసక్తీ, కుతూహలం యినుమడించినాయి. ముందుకి వొంగి శ్రీకృష్ణుడు చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు.

"సరేకాని మాధవా! అంతా అవగాహన అయింది. నీవు చెప్పినది అరటిపండు వలిచినట్టు వివరంగా తెలుస్తూవున్నది. అంతా సబబుగా చక్కగా వున్నది. అంతా భగవన్మయమని చెబుతున్నావు బాగానే వుంది. శాస్త్రాలు కూడా అలానే చెబుతున్నాయి. వేదాలు కూడా అదే చెబుతున్నాయి. ఈ ప్రపంచం అంతా బ్రహ్మాండం అంతటా నిండివున్న విరాట్పురుషుడియొక్క శరీరం; అందులోని అణువులే, పరమాణువులే యీ కనిపించే ప్రపంచాలుగా విరాజిల్లుతూ వున్నాయి, తెలిసింది. కాని యీ భువన మోహనమైన విశ్వరూపుడియొక్క సౌందర్యం కన్నులార తిలకించాలని మనస్సు వుప్పొంగుతున్నది."

"ఒక్కసారి నీ భగవన్మయమైన దివ్యస్వరూపం, భగవంతుడిగా నీ స్వరూపం ఎలా వుంటుందో ఒక్కసారి చూడాలనివున్నది." అర్జునుడడిగిన ఈ మాటలకి సహృదయతతో నిండిన చూడ్కులతో, విప్పారిన నిండు హృదయముతో అర్జునుడివంక చూస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు.

"నువ్వు నా భగవన్మయమైన దివ్యస్వరూపాన్ని చూడటానికి యీ చర్మచక్షువులు చాలవు. చర్మచక్షువులకి యీ పదార్థమయమైన ప్రపంచమే, దాని భౌతికరూపమే గోచరిస్తుంది. ఆ దివ్యస్వరూపాన్ని చూడడానికి నీకు దివ్య చక్షువునిస్తున్నాను చూడు. ఈ దివ్యదృష్టితో నా శరీరంలోనే నీకు భగవన్మయమైన విరాట్ విగ్రహమంతా కూడా కనపడుతుంది. ఇందులో నువ్వు చూడదల్చుకున్నవి, మనసుపడుతున్నవే గాక, నువ్వు వూహించరాని అనేక దివ్యదృశ్యాలు, అద్భుత దర్శనాలు చూడు. అత్యద్భుతములైనటువంటివి, ఎప్పుడూ కనివిని ఎరుగని, దివ్యానుభూతుల్ని పొందగలుగుతావు. చూడు, ఇదిగో!"

అంటూ శ్రీకృష్ణుడు ఒక్కసారిగా అర్జునుడి భ్రూమధ్యం రెండు కనుబొమ్మలమధ్యన నుదురు స్పృశించి దివ్యదృష్టిని ప్రసాదించాడు.

వెనువెంటనే వేయి సూర్యులు వెలిగినట్టు మెరిసిన ఆ దివ్య దర్శనంతో అర్జునుడి శరీరం గగుర్పొడిచింది. రోమాలు నిక్కపొడుచుకోగా శరీరం స్థంభీభూతమై చూశాడు. చూచేదృశ్యం తానై చూశాడు, హర్షాశ్చర్య కుతూహలాలు ముప్పిరిగొని ఉక్కిరిబిక్కిరి చెయ్యగా.

అతనికి కనిపించిన ఆ దివ్యదర్శనం, ఆ మహాద్భుత రూపాన్ని వర్ణించటానికి వ్యాసమహర్షికి మాటలు చాలలేదు. ఆధ్యాత్మికానుభవాన్ని భాషలో పెట్టడం ఎలా వీలవుతుంది? ఏం చూశాడు ఆ దర్శనంలో... ఆ దివ్యమూర్తి వర్ణనాతీతం.

...అనేక వేల శిరస్సులతో, అనేక వేల బాహువులతో, వేలకి వేల నేత్రాలు, అనేకవేల ముఖాలు, పాదాలు, నానావిధరూపాలతో నానా వర్ణాలతో వెలుగుతున్నది. ఎటుచూసినా తానే అయి, ఆదీ అంతమూ లేకుండా అన్నిపక్కలా నిండి విశ్వతోముఖమై వెలుగుతున్న ఒక బ్రహ్మాండమైన రూపం కనపడింది.

ధరించిన అనేకాయుధాల తళతళలతో, లెక్కకు మీరిన ఆభరణాలు వేయి ఇంద్రధనుస్సుల రంగులీనుతూ అనేక రంగుల కిరణాలు చిమ్మగా, దివ్య సుగంధ పరిమళాలు, దివ్యవాసనలు ఒక్కుమ్మడి మనస్సుని మత్తుగొలిపి ఏదో లోకంలోకి తీసుకుపోగా...

...ఎక్కడో ఆకాశంలోకి చొచ్చుకొని, పైకి పెరిగిన కిరీటం, ఒక మహాపర్వతంలాగ; అక్కడ నీలాకాశంలోని వజ్రపు మిలమిలల నక్షత్ర కాంతితో ఆ దివ్యకిరీటంలోని రత్నరాశి వెలిగిపోతున్నది. అనేకకోట్ల సూర్యగోళాలు, అనేక నక్షత్రమండలాలు, ఆ అనంత విశాలమూర్తి

శరీరంలో రోమకూపాలలాగ దూరంగా వెలుగుతూ కనిపిస్తున్నాయి.

ఆ మహామూర్తి ముఖం అగ్నిగోళంలాగ విరాజిల్లుతూంది. సహస్ర సూర్యప్రతిభాసమానమై వెయ్యిసూర్యులు ఒక్కసారిగా ఆకాశంలో వెలిగితే ఎంత వెలుగు కనిపిస్తుందో అంత తేజస్సుతో, మిరుమిట్లుకొలిపి అర్జునుడ్ని భయపడేట్టు చేసింది.

దిక్కులన్నీ తన తేజస్సుతో ముంచివేస్తున్న, ఆ మహావిగ్రహం శరీరంలో అనేక దేవతలు; మునులు, అప్సరసలు, నాగులు, భూత దానవ పిశాచ మానవగణాలు సర్వజీవమయమైన యీ సృష్టియావత్తూ, ఏకస్థమై భాసిస్తోంది. అతని శరీరంలో రుద్రులు, యముడు, అగ్ని, వరుణదేవుడు, దిక్పాలకులు, వసువులు, ఆదిత్యులు, గంధర్వులు, విశ్వదేవతలు, అశ్వినులు, మరుత్తులు, ఇంకా సిద్ధచారణ మునిగణాలు, గ్రహాలు, సౌరమండలాలు ఒకటేమిటి - సర్వప్రపంచమూ ఏకస్థమై ఒక్కసారిగా మూర్తిమంతమై సాక్షాత్కరించింది.

ఆ దివ్యమూర్తులందరూ ఒక్కసారి దర్శనమిచ్చేసరికి అప్రతిభుడయ్యాడు అర్జునుడు.

ఆ విశ్వమూర్తియొక్క రూపం, యిక్కడ ప్రారంభిస్తున్నదని, ఇది మధ్య అని, ఇది తుది అని ఏమీ కనిపించక - అంచులులేని ఒక మహాసృష్టి సముద్రంలాగ, అనంతాకాశంలాగ - అలా చూసినకొద్దీ పెరిగిపోతూ, చూపుమేరకి అతీతమై, ఊహకు వెక్కసమై సర్వమూ నిండియున్నది. ఎటుచూచినా ఆ మూర్తి దివ్యస్వరూపమే, ఎటు తిరిగినా ఆయన కిరీట కోట్లవెలుగులే దిక్కులు నిండివున్నాయి.

అర్జునుడికి తను ఎటుతిరిగితే అటు, తూర్పున, పడమరన,

ఉత్తరం, దక్షిణం, ఏదిక్కుచూసినా ఆయన దివ్యమూర్తే కనిపించ సాగింది. చివరికి కళ్ళు తెరిచినా మూసుకున్నా అదే స్వామి లోపలా బయటాకూడా వేంచేసిన వేలుపై వెలిగాడు. విశ్వమంతా ఆయన ఆలయం, శరీరమంతటా ఆయన నిలయం. కాదు, సర్వశరీరాలు, లోకమూ, అన్నీ ఆయనలోనే వున్న అద్భుతమూర్తిని చూసి పార వశ్యంతో అప్రయత్నంగా అణచుకోలేని ఆవేదన ప్రార్ధనగా పార్ధుడిలో పొంగివచ్చింది. అప్రయత్నంగా చేతులు వాటంతటవే ప్రణతు లొనర్చి నాయి. శిరస్సు గౌరవభక్తి నమ్రతలకి బరువుతో వ్రాలింది, కన్నులు అరమూతలుగా లోపలా, బయటా కూడా ఆ మూర్తినేచూస్తూ ద్రవించి నవి. ఆ సర్వాశ్చర్యమయమూర్తి, విశ్వతోముఖుడై జాజ్వల్యమానంగా వెలిగి తాను సుదుద్దర్శనమైనాడు. అర్జునుడికీ అనుభూతి అవధులు దాటి కట్టలు తెంచుకుని స్తోత్రప్రవాహమై పారినది.

ప్రళయకాలంలో ప్రపంచాన్ని దహించటానికి ప్రజ్వలించే అగ్ని హోత్రంలాగ జ్వాలామాలాభీలంగా వెలిగిపోతున్న పెద్దనోరు. అందు లోకి మిడతలలాగ వేలసంఖ్యలలో పోయి పడుతున్న సేనావాహిని ఆశ్చర్యంగా కనిపించింది. భీష్ముడు, ద్రోణుడు, యితర కురు ప్రవీరులు, వాళ్ళ సేనాసమూహంతోబాటు కోలాహలంగా పరుగులు పెట్టుకుంటూ పోయి దానిలో పడుతున్నారు. వరదలతో పొంగి పొర్లుతూ పరిగెత్తే నదులు సముద్రగర్భంలో కలిసిపోతున్నట్టు, ఈ మిడతలదండ్లలాంటి కురుసేనావాహిని ఆ కాలమూర్తి వదన గహ్వర కందరంలోకి ప్రవేశించి అంతరించిపోతున్నాయి రూపులేకుండా. ఒక్క కురువీరులేగాదు, సృష్టించబడిన సర్వమానవులు, సైన్యాలు, పాండవ పక్ష సేనలూ, కురుపాండవవీరులు వీళ్ళందరూ కూడా అలాగ

ఒక్కుమ్మడిగా పోయి పడుతున్నారు. కాలప్రవాహం ముందుకి తోసుకు పోగా దిక్కు తెలియక పరుగిడి సరిగ్గాపోయి ఆ భయంకర జ్వాలా భీల కరాళవదనంలోకి అగాధంలోలాగ పడిపోతున్నారు. అది సర్వ జీవులూ చివరికి చేరే గమ్యం. నిలిచివున్న ఆ మృత్యువులోకి ప్రవేశిస్తూ వున్నారు అందరూ.

మళ్ళీ అందులోంచే సృష్టి! అంతలోనే ఆయన హృదయంలో ఒక మహాపద్మం, ఆ పద్మంమీద ముద్దులు మూటకట్టే చిన్నారి బ్రహ్మ! తన నాలుగు ముఖాలతో నాలుగు దిక్కుల్ని సృష్టించి నాలుగు వేదాలు ధ్వనిస్తూంటే - ఆయన హృదయంలో పద్మాసనస్థుడయి వున్నాడు! అంతటా వ్యాపించివున్న అంగాంగాలలో దేవతలు, దివ్యసర్పాలు, మహర్షులు, యింకా యేవేవో దివ్యరూపాలు, తేజో మయ మూర్తులు ఎన్నడూ చూచిఎరుగనివి, ఊహించరానివి అనేకం చూశాడు కిరీటి. ఈ విస్మయంతో ఆశ్చర్యంలో తన్నుతానే మర్చి పోయి ప్రార్థించాడు.

నమస్కరిద్దామంటే ఎటుచూసినా ఆయన మూర్తి, ఆ మూర్తి లోపలే తానున్నాడు. సర్వకాల స్వరూపుడు అయివున్న ఆ సమగ్ర దేవతామూర్తి శరీరంలో సృష్టిస్థితి లయాలు కాలం, ఆకాశం, దిక్కులు అంతాకూడా నిండివున్నది. భూతభవిష్యద్వర్తమానాలయిన మూడు కాలాలూ ఆయన శరీరంలో ఒక్కసారిగా దర్శించాడు. నాటకంలో, రానున్న దృశ్యములోని రంగస్థలం, గడిచిందీ, తెరమీద ఆడుతున్నదీ కూడా ఒక్కసారే రచయిత మనస్సులో ఒక్క కాలంలో వున్నట్లుగానే ఆ విశ్వరచనాదక్షుడి అద్భుత శక్తికి విస్తుపోతూ చూచాడు అర్జునుడు. ఒక గడ్డి కొసన నిల్చిన చిరుమంచు బిందువులో యావత్ప్రపంచమూ

ప్రతిబింబిస్తున్నట్టుగా, మానవ శరీరంలో, శ్రీకృష్ణుడిలాగ కనిపించే రూపం లో నిహితమైవున్న విరాట్ రూపాన్ని, సర్వవివరాలతో సూక్ష్మమయిన అంశాలతోసహా, మొత్తం సృష్టిని చూచాడు. శ్రీకృష్ణుడు గీతలో "తనలో సర్వప్రపంచాన్నీ, ప్రతి జీవిలో తననీ యోగి దర్శిస్తాడ"ని, చెప్పిన యోగ పరిపూర్తి అంటే ఏమిటో అప్పుడర్ధమైంది.

ఇది 'భగవద్గీత' పదకొండో అధ్యాయంలో వ్యాసమహర్షి చక్కగా వివరించాడు కళ్ళకు కట్టినట్టు. ప్రపంచంలో ఏ భాషలోనూ, ఏ సాహిత్యంలోనూ, చివరికి బైబిలు, ఖురాను, షేక్సిపియర్ రచనల్లో కూడా ఎక్కడా ఇలాంటి భగవత్ దృశ్యం మనకి కనపడదు. భగవంతుడి సాక్షాత్కారం, వర్ణితమై చాలాచోట్ల వుందిగాని ఇలాంటి విశ్వ విస్తృతమైన భగవత్ రూపభావన, ఎక్కడా కనిపించదు.

☆ ☆ ☆

ఇలాగ కురుపాండవయుద్ధంలోనేగాక శ్రీకృష్ణుడు తన విశ్వ స్వరూపాన్ని యితర సన్నివేశాలలో కూడా దర్శింపచేశాడు. అనేక ఘట్టా లలో చిన్నప్పుడు పసిపాపగా పాలుతాగుతూ తల్లి వడిలో శయనించిన కృష్ణయ్య తన వదనం లోపల యశోదకి బ్రహ్మాండగోళాన్ని చూపించాడు. మన్నుతిన్నావంటూ తల్లి దండించినప్పుడోసారి యిలాగే నోట్లో నదులు, సముద్రాలు, పర్వతాలు, నక్షత్రాలు, సూర్యచంద్రులు, దిక్కులు, ఆకాశం, పంచభూతాలు, బ్రహ్మాండగోళం యావత్తూ కనిపించింది.

ఇలాగే యింకొకసారి ఉదంకుడనే ఒక మహర్షికి - భారత యుద్ధం అయింతర్వాత ద్వారకకుపోతూ చూపించాడు అర్జునుడికి చూపినలాటి దివ్యరూపాన్నే. అతడు చిరకాలం చేసిన తపస్సుకి

ఫలితంగా తన విరాట్ విగ్రహాన్ని చూపించాడు. చివరికి ధృతరాష్ట్రుడికి కూడా, తన రాయబారం వెళ్ళినప్పుడు సభాభవనం అంతా ఆక్రమించి తన దివ్య విజృంభణము దర్శింపచేశాడు. ఈ విశ్వరూపం చూపించటమూ, 'భగవద్గీత' యొక్క ఆవిష్కారమూ, యివి యింక ఏ అవతారంలో గూడ కనపడని అపూర్వ దివ్యవిశేషాలు. అందుకే సంపూర్ణమైన అవతార సాక్షాత్కారం శ్రీకృష్ణుడిలో జరిగిందని అంటారు.

"కృష్ణస్తు భగవాన్ స్వయం" అని పురాణాలు, భాగవతం కూడా ఎలుగెత్తి చెప్పినాయి.

అయితే మానవ స్వరూపంలోవున్న యీ శ్రీకృష్ణుడనే చారిత్రక వ్యక్తికి, ఈ భగవద్విగ్రహ మనబడే యీ విరాట్ స్వరూపం, ఎలాగ అతని శరీరంలోపల నిబిడీకృతమై వున్నది? అన్న ప్రశ్న ఉత్పన్నమవుతున్నది. ఇది మనకి ఆశ్చర్యంగా అనిపించవచ్చు.

ఆశ్చర్యం కలిగించవచ్చు గాని, యిది ప్రకృతి మూలసూత్రానికి విరుద్ధం మాత్రం కాదు. ఇది నిత్యం మనం ప్రకృతిలో చూస్తున్న సత్యమే. జీవశాస్త్రం ద్వారా తెలుసుకున్న వైజ్ఞానిక సత్యమే. అయితే, మనం దాన్ని సరిగా అవగాహన చేసుకోటంలోనే వుంది.

మఱ్ఱిచెట్టుని చూస్తున్నాం, పెద్దపెద్ద చెట్లు, కొన్ని ఫర్లాంగులు పొడుగున్న కొమ్మలతో, పెద్ద వైశాల్యంతో, లావుగా స్థంభాలలాగ దిగిన అనేక ఊడలతో వెయ్యి స్తంభాల మండపంలాగున్న పెద్ద చెట్లు యీ దేశంలో ఎన్నో ఉన్నాయి. ఇంత పెద్ద మఱ్ఱిచెట్టూ కూడా - మఱ్ఱికాయని పగలకొట్టి చూసినట్టయితే - అవగింజకన్న చిన్నదిగా వున్న ఆ చిన్నగింజలో లీనమైలేదూ? వున్నది. ఎలా వున్నది? ఇది భ్రమా? అసత్యమా? ఇంకేదయినా భ్రాంతి అనగలమా?

ఇవేవీకాదు. అంత విశాలమైన మఱ్ఱిచెట్టూ, బీజప్రాయమై ఆ గింజలో లీనమైవుండటం అనేది ప్రకృతిలో వున్న ఒక మహాసత్యం Law of Nature.

ఈ మహాసత్యమే మనకి అణువులో కనపడే బ్రహ్మాండం అంటే, మనకి సూర్యుడు, అతడిచుట్టూ వలయాలుగా పరిభ్రమించే గ్రహ కక్ష్యలుగా ఏర్పడిన, ఒక బ్రహ్మాండంలాగ నిర్మితమై వున్నాయి. ఈనాటి వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు ఏమి కనుగొన్నారు? అన్నిటికంటే చాలా చిన్నదని చెప్పబడే పరమాణువు (Atom) యొక్క నిర్మాణంకూడా సరిగ్గా యీ బ్రహ్మాండంలాగే నిర్మితమై వున్నది అనే మహావిచిత్రం కనుగొన్నారు. అంటే గ్రహమండలాంతర్గతమైన కేంద్రంగా సూర్యుడు వున్నట్టే పరమాణువులోనూ ఒక తేజోకేంద్రం (Nucleus), హృదయంగా వున్నది. దాని చుట్టూ వలయాలలో, గ్రహాలలోలాగే "ఎలక్ట్రానులు" (Electrons) అనబడే నలుసులు నిత్యం తిరుగుతున్నాయని! అంటే అణువూ ఓ చిన్న బ్రహ్మాండమన్నమాట! బ్రహ్మాండమూ, బ్రహ్మాండగోళానికి బీజప్రాయమైనటువంటి అణువూ, యీ రెండూ - మఱ్ఱిచెట్టూ, దాని విత్తనంకంటె కూడా విస్పష్టంగా, యీ ప్రకృతి సత్యాన్ని నిరూపిస్తున్నాయి.

అంటే, అణువుకీ, బ్రహ్మాండానికీ, మఱ్ఱి విత్తనానికీ, మఱ్ఱి చెట్టుకీ వెనక ఉన్న మూలసూత్రమే - మానవ స్వరూపంలో అంతర్లీనమై వుండే భగవంతుడి విగ్రహం విరాట్ స్వరూపాల రహస్యము.

ఈ 'విరాడ్విగ్రహాన్ని' * తన అంతరాత్మలో యోగసాధన ద్వారా తెలుసుకోవటమే 'మోక్షం'. ఇదే మోక్షం అన్న పదానికి సైన్సు పరిభాషలో అర్థం. ఇది తెలుసుకున్ననాడే - మనకి బైట కనిపించే సైజులలోవున్న

* 'విరాడ్విగ్రహం' — Model of the Universe.

తేడా నిజానికి వొట్టి భ్రమే (Illusion) నని గ్రహించ గలుగుతాడు. భూతద్దం లేక 'లెన్సు' (Lens) తో చూస్తే చిన్న వస్తువు పెద్దదిగా కనిపిస్తుంది. మళ్ళీ టెలిస్కోపు (Telescope) లేక దూరదర్శినితో చూస్తే దూరంగా వున్నవి దగ్గిరగాను; సూక్ష్మదర్శినివల్ల చిన్నవి పెద్దవిగానూ కనిపిస్తున్నాయి. అంటే యీ సైజుల్లో వున్న తేడా భ్రమ లేక 'మాయ' అనేది యీ లెన్సు (Lens) వల్ల ఏర్పడుతోంది. ఇలాగే ఆకాశంలో వున్న ఒక ప్రకృతి ధర్మంవల్ల యీ సైజులలో తేడా అన్న మాయ (Optical illusion) ఏర్పడుతున్నది. దీనివల్ల వస్తువులలో చిన్నది, పెద్దది అనే భేదం ఏర్పడుతున్నదిగాని నిజాని కసలు వస్తుతః సహజంగా వాటిలో భేదం లేదనేటువంటి మహాసత్యాన్ని గుర్తించగలుగుతాడు యోగి.

ఈ మాయ అనే (Illusion) తనని ఏమీ చెయ్యనిస్థితి కలిగినప్పుడే యోగికి దూరదర్శిత్వం, సూక్ష్మవిషయ గ్రహణం, దూరశ్రవణం లాంటి శక్తులు వచ్చాయంటాము. వీటినే 'సిద్ధులు' అంటారు యోగ శాస్త్ర పరిభాషలో.

ఇది గుర్తించినటువంటి యోగి, తనకు తానెట్లా కనపడతాడు? ఒక మహాసముద్రంలాగ కనపడతాడు. సర్వజీవుల్లోనూ తానే వున్నట్టు కనపడతాడు. కాదు, సర్వజీవులూ తనలోనే ఉన్నట్టు కనపడతాడు. తనే సర్వమూ అయి కనపడతాడు. భగవంతుడు వాడికి వేరే కనిపించడు. భగవంతుడు లేక విరాట్‌రూపం అనబడే విశ్వమూర్తి - మనకి కనిపించేలాగకాక - తనకి తాను ఎలాగ కనిపిస్తున్నదో ఆ విధంగా చూస్తాడు. తనకు తానై భగవంతుడై వుండటాన్ని, చూడగలగటం కాకుండా అనుభవించగలుగుతాడు యోగి.

మఱ్ఱిచెట్టు తనకు తానై కనిపించేలాగ - తనే కొమ్మలు, తనే ఊడలు, తనే ఆకులు, తనే వేళ్ళు, చిగుళ్ళూ తనే కాయలు, గింజలు అన్నీ తనేఅయి విస్తరించి, ఒకటిగా అయిన "అంతా"గా ఎలా కని పిస్తుందో, (కంటికికాదు అనుభవంలో) అలాగే, యీ విశ్వం అనబడే మహావటవృక్షం కూడా అన్నింటినీ తనే రసం యిచ్చి పోషిస్తూవున్నట్టు, తనే, తననే వృద్ధిపొందింప చేసుకుంటున్నట్టు, తనే తనను భక్షించు కుంటూన్నట్టు, తననే తను, పుట్టించుకున్నట్టు గింజలుగా; సృష్టికీ, స్థితికీ, ప్రళయానికి తనే కారకుడుగా, తనకి తాను ద్యోతక మవుతాడు. పరిణామంలో (Evolution Completed Stage) పరిపూర్ణత పొందిన దశలో.

ఇటువంటి స్థితే, విశ్వరూపం చూపించినప్పుడు శ్రీకృష్ణుడు వున్న స్థితి.

ఇటువంటి స్థితిని ప్రతివాడూ కూడా పొందవచ్చునని గీత, 15-వ అధ్యాయంలో పురుషోత్తమ ప్రాప్తియోగంలో శ్రీకృష్ణుడు వివరించాడు.

అంతేగాకుండా, పూర్వం అనేకులు యిలాంటి పరిపూర్ణావస్థను పొంది, భగవద్భావాన్ని పొందినవాళ్ళు శ్రీకృష్ణుడి స్థితికి "సాధర్మ్యాన్ని" పొందినట్లు తెలిపాడు. 'ధర్మం' అంటే గుణం రసాయనిక ధర్మాలలాగ సమానధర్మాన్ని కలిగివుండిన స్థితిని చేరుకుని అభేదస్థితిని - పూర్ణ పరిణామాన్ని పొందారు అని "మద్భావమాగతాః॥" అంటూ యింకోచోట "మమసాధర్మ్య మాగతాః" అని నొక్కి చెప్పాడు శ్రీకృష్ణుడు.

ఇది చాల విశేషమనీ, తనొక్కడికీ తప్ప ఇంకొకరికెవరికీ లేదని గొప్ప చెప్పుకోకుండా, తనలాంటి మహాత్ములైన వ్యక్తులు భగవత్ స్థితిని పొందిన వాళ్ళందరికీ యీ పరిస్థితి సమానమే అని చెప్పాడు.

అయితే మరి తరువాత కాలంలో ఎవరైనా ఇటీవలి చరిత్రలో, ఇలాంటి స్థితిని చేరుకుని అనుభవించి పరిణతిని పొందినవాళ్ళు ఉన్నారా? గీతలో, శ్రీకృష్ణుడి జీవితంలోనూ ఆశ్చర్యకరంగా చెప్ప బడిన, మహామహిమలూ, జగత్వ్యాపకత్వం, చూపెట్టినవారున్నారా అంటే ఇటీవలే అంటే 1918లో జీవించిన మహానుభావుడి కథ, కథకాదు బాలగంగాధరతిలక్ దగ్గర్నుంచి సామాన్యుడిదాకా చూపిన సాక్ష్యాధారా లున్న మహాపురుషుడి విషయం - మనకీ సత్యాన్ని ఋజువు చేస్తుంది.

ఉన్నాడా అటువంటి - "మద్భావమాగతాః" "మమసాధర్మ్య మాగతాః" అని శ్రీకృష్ణుడు చెప్పిన వచనం అక్షరాల నిజంగా నిరూ పించే వ్యక్తి? ఇలా భగవత్ తత్వాన్ని చేరుకొని మానవ పరిణామపు పరాకాష్ఠని అందుకున్న వ్యక్తిని గురించి, గీతకి సజీవ వాఖ్య ఆయన విచిత్ర చర్యలు గురించి తెలుసుకోవచ్చు. కుతూహలం వుంటే, ఆయన అద్భుతజీవితం యోగశాస్త్రం అనే సైన్సుకి, రక్తమాంసాలతో తిరుగాడే నిదర్శనం. పురాణాల్లోంచి నడిచివొచ్చి యిరవైయో శతాబ్ది మొదట్లో, మానవజాతి మధ్యన వచ్చినుంచున్న యీ అజానుబాహువైన దివ్య పాత్రధారి ఎవరు?

తెలుసుకోవాలనుకుంటే 1918 దాకా మన మధ్యనుండి, తన దివ్యలీలలు చూపిన శ్రీసాయినాధుని దివ్యచరిత్ర చూడవలసిందే. * "సాయినాథ చరిత్ర".



* గ్రంథకర్త : శ్రీ వేమూరి వెంకటేశ్వరరావుగారు.

7

# యుగపురుషుడుగా - శ్రీ కృష్ణుడు

"నేను యీ ప్రపంచంలో పురుషాకారంతో - కేవలం మానవ యత్నంతో - ఎంతవరకూ సాధించేందుకు వీలున్నదో అంతా సాధిస్తాను. మానవుడిగా ఈ పరమార్థం సాధించటంలో దైవశక్తుల్ని ఉపయోగించటం మాత్రం నాకు వీలుకాదు."*

- ఈ మాటలు అన్నది ఎవరనుకున్నారు? జీవితంలో అనేక మహిమలుచూపి, అతిమానుష శక్తులతో విచిత్రాలు చేశాడని మనం నమ్ముతున్నామే - ఆ శ్రీకృష్ణుడు!

---

* "అహం హి త త్కరిష్యామి
పరం పురుషకారతః
దైవంతు న మయాశక్యం
కర్మకర్తుం కథంచన" - ఉద్యోగ

...చాలా ఆశ్చర్యం వేస్తుందికదా? నిజమే! దైవిక శక్తిగాని అలాంటి ఏ యితర అతిమానుష శక్తులుగాని లేని సామాన్యుడైతే, యీ మాటలు వేరే చెప్పే అవసరమేలేదు. ఎందువల్లనంటే, "నేను పురుషాకారం తోటే" అంటానికి వేరే యింకో "దైవశక్తి" ఏదన్నా వుంటేగదా! అదీ శ్రీకృష్ణుడు; అందులోనూ అనేక మహిమల ద్వారా తన లీలలు ప్రదర్శించిన అసాధారణవ్యక్తి గనకే చెప్పవలసి వచ్చింది.

ఎందుకంటే, చాలమంది అనుకుంటారు శ్రీకృష్ణుడు దైవాంశగల అవతారంగదా, తన మహిమతో అన్నీ చెయ్యలేడా యీ కౌరవులతో రాయబారం యీ వృథాశ్రమ దేనికి? దేవుడుగా వాళ్ళ మనసులని బాగచేయలేడా, పరిస్థితుల్ని మార్చలేడా? రాయబారంలో ఏం జరుగు తుందో ముందుగా ఆయనకి తెలయదా?' అని. అవతారం వొచ్చేది, శ్రమలేకుండా స్వంతపనులు మహిమలతో చేసుకుపోటానికి కాదు. అవతారం యీ భూమ్మీదికి వొచ్చే ప్రయోజనాలలో వొకటి, మానవోత్త ముడుగా ఆదర్శపురుషుడిగా - మనిషిగా జీవించి, తన జీవితంద్వారా మానవాళికి తను ఇచ్చే దివ్యసందేశం ఆచరణద్వారా నిరూపించడం కోసం.

ఏ విశేష సామర్థ్యాలూ దివ్యశక్తులూ లేని, ఒక గొప్పవాడు, లోకోత్తరవ్యక్తి, యుగధర్మ ప్రవర్తకుడుగా రానున్న యుగంలోని మానవాళికి ఆదర్శభూతుడయినవాడు ఎలాగ జీవించాలో, చూపి చెప్ప టానికే, తన జీవితం. ఈ ప్రయోజనంతో సంబంధించినవే, శ్రీకృష్ణుడు నెరవేర్చిన రాజకీయ విజయాలన్నీ ఇతర సామాజిక విజయాలు, ఇంకా మనదేశాన్ని 'భారత' దేశంగా, నిర్మించటమూ, ఇలాటి వన్నీ కూడా

అందులో పనులే. వాటిని కేవలం పురుషకారంతోటే, మనిషిచేసే యత్నంతోటే, కష్టసుఖాలకి లోనవుతూ, సాధిస్తానని పై మాటలలోని భావం.

పురుషకారంతోనే అన్నీ సాధిస్తానని చెప్పటం ఎందుకంటే, తనకి దైవశక్తి కూడా వున్నది కనక. పురుషకారంతోటే అన్ని పనులూ సాధించటం ఎందుకంటే, మానవుడికన్న అతీతశక్తులులేని, ఒక ఆదర్శవ్యక్తి యీ ప్రపంచంలో ఎంతవరకూ సాధించవచ్చో చూపించే పరమార్థం తోనే అవతారం భూమికి వస్తుందిగనుక. శ్రీకృష్ణుడు, తాను సామాన్య మానవుడికంటె, అతీతమైన శక్తులు కలిగివున్నప్పటికిన్నీ సామాన్య మానవుడిగా చేసే ప్రయత్నం (పురుషకారం) తోటే, సామాన్య మానవుడికి ఆదర్శమైన వ్యక్తిగా, యీ ప్రపంచంలో ఎంత వరకూ సాధించడానికి వీలవుతుందో అంతవరకూ గూడా పరమార్థాన్ని సాధించి చూపిస్తాను అని యీ పై మాటలకర్థం.

ఈ మాటల్లో, యింకో అర్థం కూడా వున్నది. అది తాను అవతారంగా వొచ్చిన ప్రయోజనం గురించి, అవతార ప్రయోజనము, ఏవో కొన్ని మహిమల్ని చూపించటంకాదు, కొంతమంది రాక్షసుల్ని చంపటానికి మాత్రమేకాదు, ఏవో కొన్ని అద్భుత శక్తుల్ని ప్రకటించి అందరినీ ఆకర్షించి అంతటితో జీవితం పరిసమాప్తి చెందడానికి కాదు. నిజమైన ప్రయోజనమేమిటంటే, ఆదర్శంగా మనుష్యుడు ఏవేవైతే సాధించగలుగుతాడో, అవన్నీ కూడా మానవజాతికి నిదర్శన పూర్వకంగా చేసి చూపించటానికి, ఇంకా మానవజాతిపొందే ఆధ్యాత్మిక పరిణామంలో మధ్యమధ్య మనుష్యుడికి కలిగే నిరాశ, నిరుత్సాహమూ,

చరిత్రలో కనిపించే చెడును, అన్యాయాలనూ, చూచి వెనుకంజవేసి, అధర్మం, అక్రమం వీటివల్ల అథఃపతనమైన మనిషికి ఒక ఆశ, ఉత్సాహం చూపించి, ఆదర్శమైన మనిషికి వొచ్చే సమస్యలు యెలాంటివో, యీ ప్రపంచంలో మనిషి ఎంతవరకూ సాధించటానికి వీలవుతుందో అవన్నీ కూడా నిదర్శన పూర్వకంగా నిరూపించటానికే అవతారం యిచ్చే సందేశం. అది అవతారం యొక్క దైవశక్తులలో లేదు - ఆయన మానవతలోనే వున్నది. అవతారంలోని మనుష్యత్వమే, మనుష్యులమైన మనకు వెలుగుబాట, ఆదర్శమూను.

అందుకనే శ్రీకృష్ణుడు సాధించిన రాజకీయ విజయాలన్నీ కూడా, భారతదేశానికి ఒక మహానాయకుడిగా ఆయన చేసిన సేవ అంతా కూడా ఒక మహత్తరమైన మానవ ప్రయత్నంమీదనే ఆధారపడి వున్నది అన్న ఒక్క విషయాన్ని నిదర్శనంగా నిరూపిస్తాయి శ్రీకృష్ణుని ఈ మాటలు. ఎందువల్లనంటే భారతయుద్ధంలోగాని, కౌరవులతో సంధి ప్రయత్నాలలోగాని లేక తను రాజకీయ పరిణామాల కోసం, సాంఘిక మార్పులకోసం చేసిన పనులలోనేమి, ఆయన తన బుద్ధిబలాన్ని ఉపయోగించాడు. తన రాజనీతి చతురతని చూపించాడు. ధైర్య సాహసాన్ని ఉపయోగించాడు. ఇంకా యోధుడుగా, మహారథుడుగా ఒక మహావ్యక్తిగా తనకున్న యావచ్ఛక్తినీ వినియోగించాడు - అంతే గాని తనయొక్క దైవశక్తి నెప్పుడూ వినియోగించి ఈ విజయాన్ని సాధించలేదు. ఇది మనకి భారతం మొదటినుంచీ చివరివరకూ కనపడుతుంది.

ఆదర్శమైన మనిషిగా తన జీవితమెలా జీవించాడో చూసినందు వల్ల, తక్కిన మానవులందరూ దాన్ని అనుసరించి అనుష్టించటానికి వీలవుతుంది. ఇదే భగవద్గీతలో :

"మమ వర్త్మానువర్తంతే

మనుష్యాః పార్థ, సర్వశః"

- అని చెప్పినదెందుకంటే తన అవతారం, సర్వమానవులకీ కూడా సక్రమపథాన్ని చూపించటానికే నని. ఈ దృష్టితో మనం శ్రీకృష్ణుడి యొక్క మానవత్వాన్నిక్కడ పరిశీ లిద్దాము. ఆయన ఎటువంటివాడు? ఆయన నిత్యజీవితం ఎటు వంటిది? ఆయన దైనందిన కార్యక్రమం ఎలావుండేది? ఆయన జీవితంలో సమస్యలని ఎదుర్కొని ఎలాగ పరిష్కరించేవాడు? అనే వన్నీ - ఈ పై చెప్పిన మాటలు దృష్టిలో పెట్టుకొని గనక చూసినట్లయితే - ఈ అవతారం ప్రయోజనాన్ని సూచి స్తాయి. ఇందులో ఈనాటి ప్రతి భారతీయుడికి కూడా తన జీవితంలో ఎలా నడుచుకోవాలో దారి చూపించేటటువంటి తారకమంత్రం వుంది.

ఈనాడు భారతదేశానికి కావలసిన ఆదర్శం - సాంఘికాదర్శం, రాజకీయ, ఆధ్యాత్మిక, ఆదర్శం, దేశానికోగమ్యం, ఇందులో భాసిస్తుంది. ఆయన దైవత్వాన్నించి వేరుచేసి ఆయనయొక్క మానవత్వాన్నే పరిశీ లించటంలోని నా ఉద్దేశ్యం ఇదే. ఇందుకై మనం కాలంలో వెనక్కి - మహాభారతపు రోజుల్లోకి - అడుగుపెట్టాలి. శ్రీకృష్ణుడి భారత దేశంలోకి, ఆయన కాలంలోకి, వెనక్కి ప్రయాణం చెయ్యాలి. అంతే గాదు, ఆనాడు ఆయన జీవితంలోకి మనం అడుగుపెట్టాలి.

ఒకసారి ఆయన యింటి ప్రాంగణంలోకే అడుగుపెట్టి ఆ మధుర ఆదర్శ మానవమూర్తిని కలుసుకుని ఆయన జీవితంలో అక్కడక్కడ ఆయనతో కలిసి ప్రయాణింతాము.

☆ ☆ ☆

అది ద్వారకానగర ప్రాంతము. రాత్రి వేకువజాము. చిక్కటి చీకటి రాత్రి పల్చబడి, నీలినీడలు తూర్పున బ్రహ్మముహూర్తం ఆసన్న మైందని సూచిస్తూవున్నవి. రాత్రి ఆఖరియామం మాత్రం మిగిలివున్న సమయం. తూర్పున వేగుచుక్కగా నీలమణుల కాంతులతో, రానున్న నూతన యుగ మహోదయాన్ని సూచిస్తూ ఆకాశంలో పొదిగిన రవ్వలాగ మెరుస్తున్నాడు శుక్రుడు.

దూరదూరాన్నించి శ్రీకృష్ణదేవుని భవనం అస్పష్టంగా కనిపించే ప్రాకారాలతో, శిఖరాలతో, వాటిపైన గాలికి రెపరెపలాడే జెండాలతో అప్పుడప్పుడే నిద్రనుంచి మేల్కొంటున్నట్టుంది. దూరదూరంనించి శ్రీకృష్ణుని భవనప్రాంగణంలో నుంచి సన్నగా, మృదుమధురంగా భూపాలరాగం అలాపించబడుతోంది, సన్నాయి వాద్యంమీద.

విశాలమైన భవంతిలో పైన వసారా. ఆ వసారా తూర్పువైపున పెద్ద పానుపుమీద భగవానుడు నిద్రమేల్కొని వినీలాకాశంలోకి, దృష్టి నిగిడ్చి చూస్తున్నారు. తలకింద రెండు చేతులుంచుకుని నీలాల నింగిలోని నక్షత్రాల లోకాలలోకి చూస్తున్నారు. కాలుపైన కాలు వేసుకుని ఎడమపాదం ఆకాశం దిక్కుగా మోకాలుమీద ఆడిస్తూ, అలా అలవోకగా ఒక ముహూర్తం ధ్యానంచేసారు, యోగి దుర్లభమైన తురీయస్థితిలో

అలా యోగులకి అందరాని తురీయధ్యానం అవలంబించి త్రికాల పరిధుల్ని దాటి పురుషోత్తమస్థితిలో, నిర్వికల్పుడై సర్వ చరాచర ప్రపంచాన్ని తనలో దర్శించినాడు.

నెమ్మదినెమ్మదిగా శంఖదుందుభులు, మంగళతూర్యాలు శ్రీకృష్ణుని కార్యక్రమానికి నాందిగా స్పందించుతున్నవి. సౌఖశాయనికులుచేసే సుప్రభాతగీతిక లాలకిస్తూ స్వామి తన తెల్లకలువల్లాంటి కన్నులువిచ్చి శాంతగంభీరమైన మందహాసం చిందిస్తూ మేల్కొన్నట్టుగా చుట్టూ చూశారు. సుశిక్షితులైన పరిచారికలు, పుష్పలావికలు, అలదిన కస్తూరి గంధసార అనులేపనములతో అభ్యంగనము ఆచరించారు. మంగళ స్నానములైన వెంటనే తేజోమూర్తియై శుచిగా పూజాగృహము ప్రవేశించారు.

ప్రజ్వలించే అగ్నికి అభిముఖుడై కూర్చుని ప్రాంజలియై పుణ్య వస్తువులను ఆహుతిగా హుతాశనుడికి అర్పించారు. తదనంతరం గృహ దేవతల్ని వృష్ణివంశానుగతమైన దేవతలకు పూజలొనర్చి విశ్వదేవతలకి ఆహుతులొనర్చాడు స్వామి. బ్రహ్మరూపమైన ప్రణవస్వరూపాన్ని పూరించి ఆత్మానుసంధానంచేసి సౌధోపరిభాగంలో కూర్చున్నాడు. ఉదయిస్తూ వున్న ఆదిత్యుడికి స్వాగతం చెబుతూ, ఉద్యంత మూర్తియైన రశ్మి మాలిని తదేకదృష్టితో ఉపాసించి సర్వాలంకార భూషితుడై సౌధం ప్రాంగణం లోనికి విచ్చేసి నిలువుటద్దంలో మంగళాలంకృతుడై తన ఆత్మావలోకనం చేసుకుని బైటికివచ్చాడు. దారకుడు సిద్ధంచేసిన రథం ఎక్కబోతూ.

అనంతరం స్వామి దర్శనానికై విచ్చేసిన జనం వందలాదిగా

నిలబడి వున్నారు - పామరులూ, పౌరులూ, వేదవేత్తలైన ఋత్విక్కులూ, బ్రాహ్మణజనమూ, మహర్షులూ. వారిని యథోచితమైన గోదాన, హిరణ్య దానాలతో గౌరవించి వారి స్వస్తివాచకములు శుభాశీస్సులను తీసుకుని మునులకు పాదాలంటి ప్రణమిల్లి, అగ్నికి, గోవులకి ప్రద క్షిణంచేసి, కదలి వెళ్ళారు స్వామి. దారకుడు రథాన్ని కళ్ళు జిగేలు మనేట్టు మెరుగులుదిద్ది అలంకరించి చిరుగజ్జెల రవళితో, గాలికి ఊహలాగ ఊగే గరుడధ్వజంతో నిలబెట్టాడు, స్వామికి సవినయంగా నమస్కరించి. చూస్తూ మెరుపు తీగలాగ ఛెంగున రథంమీదకి ఎగసి కూర్చున్నారు స్వామి, బంగారుపర్వతం మీద ఉదయించే బాలభానుడి కాంతితో. అలాగ తన నిత్యదైనందిన కార్యక్రమంలో కదలివెళ్ళారు స్వామి. ఒక్కసారి బ్రాహ్మణుల వేదఘోష స్వస్తిపుణ్యాహవచనములు మిన్ను ముట్టినాయి.

ఇదే స్వామి నిత్యకార్యక్రమము. ఆయన రాయబారిగా వెళ్ళి హస్తినలో బసచేసినా, కురుక్షేత్రయుద్ధం తర్వాత అంపశయ్యమీద నున్న శాంతనవుడిని దర్శించేందుకు వెళ్ళినా, ఇదే స్వామి నిత్య కార్య క్రమము. అయుష్కాముడు బ్రహ్మవర్చస్కాముడైన వానికి ఆయుర్వేదం ధర్మశాస్త్ర మనుస్మృతులలో, ఎలాంటి స్వస్థవృత్తం నిర్దేశింపబడిందో అలాగ ఆదర్శ జీవనం గడుపుతూ సామాన్యులకు ఆదర్శభూతుడై జీవించాడు స్వామి.

ఇలా, లోకోత్తర పురుషుడిగా శ్రీకృష్ణునిలో అనేక గొప్ప గుణా లున్నప్పటికీ, అన్నింటిలోనూ మనకి ప్రత్యేకంగా కొట్టవచ్చినట్టుగా

కనిపించేది, ఆయన వినయం. * సంస్కృత మహాభారతం చూస్తే, యీ విషయం మనకి స్పష్టంగా కనిపిస్తుంది.

శ్రీకృష్ణుడు చాల వినయశీలుడు - అంటే మనలో చాలామందికి ఎంతో ఆశ్చర్యంగా వుండొచ్చు. ఎందుకంటే సినిమాలోనూ, బైట చెప్పు కునేటువంటి కథలలోను, శ్రీకృష్ణుడియందీ వినయగుణం వున్నట్టుగా ఎక్కువమందికి తెలియదు. శ్రీకృష్ణుడంటే - రాక్షసులని సంహరించటం, తనే అవతారమూర్తిగా అందరిచేతా పూజలు చేయించుకోవటం అన్న యీ ఒక్క విషయమే మనం ఊహిస్తున్నాం కాని ఆయనలో వినయ గుణం ఊహించం. భారతయుద్ధంలో ఒకనాడేం జరిగిందంటే - యుద్ధం భయంకరంగా సాగుతోంది. ఆనాడు కర్ణుడు తీవ్రంగా విజృంభించి పాండవులలో ప్రతిఒక్కరినీ పరాజితుల్నిచేసి, తీవ్రంగా గాయపరిచి, నిందావాక్యాలతో సూటిపోటు అవహేళనలతో అవమాన పరచి, ప్రాణాలతో వదిలి పంపేస్తాడు. ఆనాడు అర్జునుడు యుద్ధంలో యింకెక్కడో మరోచోట రణనిమగ్నుడై వుంటాడు. పాండవ సేనలు కర్ణుడి ధాటికి తట్టుకోలేక పరుగెత్తిపోయాయి.

ధర్మజుడు దెబ్బలుతిని, అవమానంతో వెనక్కితిరిగి శిబిరం చేరు కొని, దుఃఖాభిమానాలతో దగ్ధుడై, క్రోధంతో మండి, ఆ కోపంలో అర్జునుడు రాగానే అర్జునుడినీ, అతడి గాండీవాన్ని కూడా అనేక విధాలుగా నిందిస్తాడు. ఇవన్నీ వుండి కర్ణుడ్ని ఏంచెయ్యగలిగాయి, కర్ణుణ్ణి చంపలేనివెందుకంటూ విమర్శించాడు ఆ వేడిలో. దాంతోటి

---

* శాంతిపర్వం - 48 (40) అధ్యాయాలు - అభీషేచనిక పర్వం.
రాజ ధర్మాను - (53) ఉద్యోగ పర్వం - 81, 92 అధ్యాయాలు

అర్జునుడికి కూడా కోపంవచ్చి ధర్మరాజుని వధిస్తానని, ప్రతిజ్ఞచేసి కత్తి తీసుకుని బయలుదేరుతాడు. అప్పుడు ధర్మరాజుని శాంతింపచెయ్యటానికి శ్రీకృష్ణుడు, ఆయన పాదాలమీదపడి ప్రార్థిస్తూ సాష్టాంగంగా నమస్కరించి బ్రతిమాలుతాడు. అలా వినయంతోనూ, ప్రేమతోనూ, అనునయవాక్యాలతోనూ శాంతింపజేసిన సన్నివేశం, ఆయనలోని సహజ నమ్రశీలత్వం, వినయం చూపించేందుకిది చాలు.

పాదాలమీద పడ్డ శ్రీకృష్ణుడిని కంగారుగా లేవదీసి కన్నీళ్ళతో కౌగిలించుకుని ధర్మరాజు, 'ఈరోజున నీ మూలాన మేమందరం అన్యోన్యం చంపుకోకుండా మహావిపత్తులోంచి బైటపడగలిగామంటూ' కరిగిపోయాడు. ఎందుకంటే తర్వాత మళ్ళీ ఆత్మహత్య చేసుకోటానికి సిద్ధంగావున్న అర్జునుడి ఆవేశం తగ్గించటానికి, అతడికి అసత్య వాదిత్వం రాకుండా, ప్రతిజ్ఞ చెల్లించే ఆపద్ధర్మం చూపి గట్టున పడెయ్యటం కూడా శ్రీకృష్ణుడివంతే అయింది. ఈ శ్రమంతా ఎందుకు? తనకోసం కాదు. పాండవులమీద ప్రేమే ఆయనని యిన్ని శ్రమలు తీసుకునేట్టు చేసింది. అనునయంగా మాట్లాడిన శ్రీకృష్ణుడి మాటలు ఎంతో అందంగానూ, హితకరంగానూ వుంటాయి ఈ ఘట్టంలో.

ఇలాటిదే యింకో సన్నివేశం ధర్మజుడి రాజసూయం. ఈ రాజసూయంలో శ్రీకృష్ణుడు ఎలాటి పనులు తనవంతుగా స్వీకరించాడో చూడటమేగాక యీ సమయంలో ఆయన సూటిగా, నిర్మొహమాటంగా, సమయం వచ్చినపుడు ఎలాగ మాట్లాడగలడో మనకి తెలియటమేగాక రాజకీయంగా, నవభారత నిర్మాతగా దేశం ఒక్క నీడని ఏకీకరించటం కోసం ఆయన చూపిన రాజనీతి, ప్రతిభా అందులోనూ

ఇంత శ్రమాయుద్ధమూ, ప్రయత్నంతో చేసిన కర్మకి ఫలితమైన భారత సామ్రాట్ పదవిని, త్యాగంతో యధిష్టిరుడిపరంగా ఎలా సమర్పించాడో తెలుస్తుంది. ఇందులో ఆయన గీతాకారుడుగా ఉపదేశించిన సాధనా రహస్యం, యోగసారమూ అయిన కర్మఫలితాన్ని త్యాగంచేసి కర్మని పరిపూర్ణంగా శక్తివంచన లేకుండా నిర్వహించడం - అన్న అంశం, ఆచరణలో చూపెట్టాడు మనకి. అందువల్ల మనమీ ఘట్టాన్ని విశదంగా పరిశీలిద్దాం.

ధర్మరాజు రాజసూయయాగం చేయాలని తన స్నేహితులతోనూ, తమ్ములతోనూ ఆ విషయం ప్రస్తావించాడు. వారు దానికి ఎంతో ప్రోత్సాహమిచ్చారు. "అన్నివిధాలా రాజసూయం చేయటానికి తగిన వాడివి" అంటూ ప్రియవచనాలు పలికారు. తర్వాత ఆయన తన ఋత్విక్కులతోనూ, అమాత్యులతో కూడా యీ విషయం సంప్ర దించాడు. వాళ్ళూ అదేవిధంగా మాట్లాడి "మేము మీకు వశులము. అన్నివిధాలా మీకు అనుచరులము. ఈ కార్యము నీవు చేయటానికి అన్నివిధాలా తగివున్నావు" అని చెప్పారు. ధౌమ్య, వ్యాసాది మహర్షులు కూడా అనుకూలురై ప్రోత్సాహాన్నిస్తూ పలికారు.

ఇలాగ అందరూ అన్నివిధాల తనని ప్రోత్సాహపరచినను రాజ సూయయాగం చేయటానికన్నివిధాలా తగినవాడుగా వర్ణించినా, యుధి ష్ఠిరుడు కృష్ణుడితో ఈ విషయం సంప్రతించి ఆయన ఆజ్ఞ తీసు కోవాలని నిశ్చయించి, తన సేవకుల్ని పంపి శ్రీకృష్ణుడిని రప్పించాడు. రప్పించేముందు తనలో తనే ఆయన అనుకున్నాడట. ఏమని? యజ్ఞ సంబారం ఊరికే మనోరథంతోటే, కోరికలుండటం వల్లనే నెఱవేరేటంత

తేలిక పనికాదు. సామర్థ్యం, దేశ కాలపరిస్థితి, యివన్నీ తెలిసి నిశ్చయించవలసిన పని యిది. లోకులందరిలోకి శ్రీకృష్ణుడు ఉత్తముడు, మహాబలవంతుడు. అంతేకాక యిటువంటి దైవసహాయం కావలసిన పనుల్లో, ఆయన అండదండలు ఎంతో అవసరం. ఆయన బుద్ధికి తోచినది, ఆయన ప్రయత్నిస్తే సాధించలేనిది లేదు. గురువువలే అన్ని విషయాలూ విపులంగా చెపుతాడు. అందులోనూ యధాతధంగా అన్ని విషయాలు నిర్మొహమాటంగా చెబుతాడని తలచి, శ్రీకృష్ణుడిని పిలి పించాడు. అందులోనూ తనకి ఆంతర్యులు, బంధువులైన తమ్ములే గాకుండా వ్యాస ధౌమ్యాది మునిశ్రేష్ఠుల మాటను కూడా విన్నాక శ్రీకృష్ణుడిని గురించి కబురుపెట్టాడంటే యుధిష్ఠిరుడులాంటి ధర్మమూర్తే, ఏపనైనా నిదానంతో యోచించేవాడు. శ్రీకృష్ణుడి వ్యక్తిత్వానికీ, యదార్థ వాదిత్వానికీ ఎలాటి విలువకట్టాడో తెలిపేందుకిది ముఖ్యమైన గీటు రాయి.

ధర్మరాజు శ్రీకృష్ణునితో యిలాగ అన్నాడు. "రాజసూయం చేయాలని నేను కేవలం కోరికమూలాననే కోరటంలేదు. దేనివల్ల ఇది సాధ్య పడుతుందో ఎలాగ సాధించాలో అన్నివిధాలా ఆలోచించి నీనుంచి తెలుసుకోగోరుతున్నాను."

ఈ పరిస్థితిలో ఇంకొకడెవడైనా అయితే, ధర్మరాజు మనోరథం కనిపెట్టి, దానికి అనుకూలమైన విధంగానే, ఆయనకి సంతోషం కలిగించేట్టు, ప్రియవచనాలు పలికేవాళ్ళు అందుకే అంటున్నాడు ధర్మరాజు, "కృష్ణా! ఈ లోకంలో చాలామంది మనయందువుండే స్నేహం వలన, సౌహార్ద్రతవలన మన దోషాల్ని చూడలేరు. ఇంకా కొందరు

వారి స్వార్థం కారణంగా, మనకి అప్రియమైన విషయాలు దాచి, ఎప్పుడూ ప్రియాలే పలుకుతారు. కొంతమంది వారికేది లాభంగా వుంటుందో అదే మనకి చెయ్యమని సలహాయిస్తారు. అందువల్ల యీ జనం చెప్పేవన్నీ ప్రయోజనవాదాలు (అవకాశవాదాలు) మాత్రమే. అందుకని కృష్ణా! నీ మాటలే నాకు నిశ్చయమైనవి. ఎందుకంటే నువ్వు స్వార్థాన్ని జయించినవాడివి. క్రోధలోభానికి అతీతమై హితవుని యోచించి యీ లోకానికి పరమ క్షేమం ఏదో, అదే దృష్టిలో పెట్టు కుని చెబుతావు. ఏది చెప్పినా యధాతథంగా, సూటిగా మాట్లాడ టానికి శక్తిగలిగిన వాడివి" అని. శ్రీకృష్ణుడి యదార్థవాదిత్వం మన కిక్కడే స్పష్టంగా కనపడు తుంది. ఇలాగ, ధర్మరాజు రాజసూయం చేయటానికి నేను తగుదునా? అని అడిగినప్పుడు శ్రీకృష్ణుడు :

"నువ్వు రాజసూయ యాగం చెయ్యటానికి అర్హుడివి కావు. ఎందుకంటే రాజసూయ యాగం చెయ్యాలంటే దేశానికి సార్వభౌము డైనవాడే చెయ్యాలి" అని. ధర్మజుడు సార్వభౌముడు కాదుగదా ఆనాటికి. పైగా అనేకమంది బలిష్ఠులైన రాజులు భారతదేశాన్ని పరిపాలిస్తున్నారు. వారిని వశం చేసుకుని, కనీసం జరాసంధుడి వధనైనా నిర్వహిస్తేనేతప్ప, రాజులు వశంకారు అన్న యదార్థం సూటిగా చెప్పటమే కాక శ్రీకృష్ణుడు యీ సన్నివేశంలో ఆనాడు మనదేశాన్ని పాలిస్తున్న రాజుల చరిత్ర, బలాబలాలు, పరస్పర శతృత్వ మిత్రత్వాలు అన్నీ వివరంగా విమర్శిస్తూ, యీ సభాపర్వం 14వ అధ్యాయంలో ధర్మరాజు కోసం చక్కటి రాజకీయ సమీక్ష మనకి ప్రసాదించాడు. నరకాసురుడు, శిశుపాలుడు, జరా సంధుడు, దంతవక్త్రుడు, పౌండ్రకవాసుదేవుడు, కౌరవులు, మొదలుగాగల

రాజవంశాలన్నీ దేశపటంలో కళ్ళకి కట్టి నట్టుగా ఆయన వర్ణించాడు. ఇది ఆయన రాజకీయ ధురంధరత్వానికి శ్రీకృష్ణుని ఆయన ఆశించిన మహాప్రయోజనానికి, భారతదేశం యావత్తూ ఒక్కటిగా సంఘటితపరచి ధర్మరాజ్యం స్థాపించటానికి చక్కటి మచ్చుతునక.

ఇలాంటి రాజులెందరో వుండగా, ధర్మరాజు సామ్రాట్టుగా అంగీక రించబడటం దుష్కరమైనపని. వీరినందరినీ చంపలేకపోయినా, కనీసం జరాసంధుడినైనా వధించటం గనక జరిగితే, తక్కిన రాజులు కనీసం పైకైనా మాట్లాడకుండా వుంటారు. ఇది జరగకుండా రాజసూయ యాగం చెయ్యటం అసంభవం అని ఉన్నదున్నట్లుగా చెప్పాడు. అలాగని ధర్మరాజులో గుణలోపం ఏమీలేదని - వివరించి చూస్తే నువ్వు "సర్వలక్షణాలతో చక్కగా తగివున్నావు" అనికూడా వ్యక్తం చేశాడు. ఈ మాట మామూలుగా అందరిలాగ పొగడ్తగా అనటం కాకుండా, భారత యుద్ధానంతరం శ్రీకృష్ణుడు యావద్భారతదేశానికీ సామ్రాట్టుగా యుధిష్ఠి రుని స్వహస్తాలతో అభిషేకించటంలో, తనమాట నిజమని నిరూ పించాడు. పై రెండు విషయాల్లోనూ శ్రీకృష్ణుని సత్యనిష్ఠ ఆశ్చర్యకరం. ఆయన చెప్పిన మాటలు అక్షరాల జరిగాయి. రక్తపాతంతో, రాజ సూయం దుష్కరంగానే, ప్రయత్నంతో కూడుకున్న విధంగానే, సాధింప బడ్డది.

ఈ రాజసూయారంభ పర్వంలోని శ్రీకృష్ణుడి మాటలు మనం జాగ్రత్తగాగనక చూచినట్లయితే శ్రీకృష్ణుడి స్వభావం మనకి కళ్ళకి కట్టి నట్టుగా అవుతోంది. ఆయనయొక్క సత్యవాదిత్వం, నిర్మొహమాటం రెండూను ఇలాగ నిజం చెప్పటంలో ధర్మరాజు మనస్సు నొప్పించాలని

కాదు ఆయన ఉద్దేశ్యం. ఈ నిజం తెలుసుకుని కష్టసుఖాలు విచారించి మరీ కార్యరంగంలో దిగమని ఆయన తాత్పర్యం. అందుకే యిలా సలహా యిచ్చింతర్వాత కూడా ధర్మరాజుకి అన్ని విధాలా అండగా నిలచి, ధర్మజుడు తనమీద ఆధారపడ్డందుకు తమ బాధ్యతంతా తల పైన వేసుకుని యజ్ఞరక్షకుడిగా తన కర్తవ్యం నిర్వహించటంలో, ప్రాణా నికి తెగించిఐనాసరే అగ్రతాంబూలం తీసుకునే సమయంలో, పరిస్థితులు విషమించినప్పుడు శిశుపాలుడితో యుద్ధంచేసి వధించాడు.

అంతేగాక భీమార్జునిల్ని వెంటబెట్టుకుని వెళ్ళి తన బుద్ధిశాలిత్వంతో జరాసంధ వధ నిర్వహించి రాజసూయానికి దారి నిష్కంటకంగా చేసాడు. అందుకే ఆయన సలహా బాధ్యతతో కూడుకున్నది. దుష్కరమైన పనులు వచ్చినప్పుడు అందులోని కష్టసుఖాలు దాచకుండా ముందుగా చెప్పటం, తర్వాత కష్టాలూ, సమస్యలు ఉత్పన్నం అయినప్పుడు బాధ్యత వహించి నడుంకట్టి కార్యరంగంలో నిల్చి, సాయం చెయ్యటం - ఉత్తమ మానవుడియొక్క స్వభావం ఆయనలో మనకి కొట్టవచ్చినట్టు కన పడుతుంది.

జరాసంధుని వధతో ధర్మరాజు కార్యం, భారతదేశ నిర్మాణం ప్రారంభం అయింది. శిశుపాల వధతో మార్గం నిష్కంటకం అయి, యజ్ఞదీక్షకి సమయం వచ్చింది. ఇటువంటి సమయంలో ఎటువంటి వ్యక్తికయినా విజయగర్వం కించిత్తు కనిపించటం సహజం. కాని శ్రీకృష్ణుడిలోని మహత్వం ఇక్కడ ఆయనలో మనకి గోచరించే వినయ సౌశీల్యాలలోనే కనిపిస్తుంది. తనకి యజ్ఞదీక్ష నిప్పించవలసిందిగా ధర్మజుడు శ్రీకృష్ణుని అనుజ్ఞ కోరినప్పుడీవిధంగా సంభాషణ జరిగింది :

ధర్మజుడు : "మహాత్మా! నువ్వు సాధించిన మహావిజయంవల్లనే దేశం యీనాడు నావశమైంది. అశేష ధనసంపదలు కూడా నీ దయ వల్ల నాకు మిక్కిలిగా లభించినవి. ఈ సంపద బ్రాహ్మణులయందు, యజ్ఞహోమ క్రియాది పుణ్యకార్యాలలోనూ ఖర్చుచేయవలెనని నా మనస్సు ఉవ్విళ్ళూరుతున్నది. అందుకని ఓ మహాభుజా! నువ్వే నాకు యజ్ఞదీక్ష నిప్పించవలసింది. నా తమ్ములు, బంధువులు, మేమంతా నీకు విధేయులం. నీవు ఆజ్ఞాపించవలసింది. నువ్వు చెప్పి నట్లుగా నడుచుకుంటాము."

"నేను, బంధువులు, తమ్ములు అందరం నీతోకలిసి ఆనందంగా యీ పుణ్యకార్యంలో పాలు పంచుకుంటాము." ఈ మాటలకి మాన వోత్తముడైన శ్రీకృష్ణుడు సవినయంగా ఇలా అంటున్నాడు.

"ఓ రాజశార్దూల! యిప్పుడు నువ్వే మాకందరికీ కూడా రాజువి, సామ్రాట్టువి కూడా అవటంచేత రాజసూయార్హుడివైనావు. నీకు రాజ్యం ప్రాప్తించటం అంటే, మేమంతా కూడా కృతకృత్యుల మయినాము. యధేచ్ఛగా, నీ హృదయం కోరిన విధంగా, దానాలు, యజ్ఞాలు చెయ్యి.

ఈ పుణ్యకార్యాలలో నాకు కూడా తగిన పనులు యిచ్చి యజ్ఞ కర్మలలో నియోగించవలసింది. నాకు కూడా సర్వశ్రేష్ఠమైన యీ మహాక్రతువులో ఏదన్నా ప్రత్యేకంగా పని యిప్పించవలసింది. దాని నంతటినీ సంతోషంతో నిర్వహిస్తాను."

ఆ మహాధ్వర్యంలో అందరికీ అన్నిపనులూ యిచ్చి, యుధిష్ఠిరుడు వేరు వేరు కార్యాలలో నియోగించాడు. అందులో శ్రీకృష్ణుడికి – యజ్ఞా

నికి విచ్చేసే బ్రాహ్మణులకి కాళ్ళు కడగటం పని యివ్వబడింది."*

ఈ యజ్ఞంలో అనేక పనులు అనేకమంది చూడాల్సివుంటుంది. ఆ పనులన్నీ కూడా, ధర్మరాజు ఒక్కొక్క పని ఒక్కొక్కరికి ఒప్పగించాడు. యుయుత్సుడికి వంటల పర్యవేక్షణ, వ్యాసుడికి బ్రహ్మత్వం, అలాగే సహదేవుడికి బంధువుల్ని పిలిచిరావడం, కృపాచార్యుడికి దానాలు దక్షిణలు, రాజుల్ని పూజించటానికి సంజయుడు, వ్యయం పర్యవేక్షణకు విదురుడు, అధ్వర్యుడుగా యాజ్ఞవల్క్యుడు, అర్జునుడికి అన్ని సంబ రాలున్నూ యజ్ఞానికి ధౌమ్యుడు అడిగినవన్నీ సమకూర్చటం - ఇలా అందరికీ అన్నిపనులు యిచ్చాడు ధర్మజుడు. అందులో శ్రీకృష్ణుడికి మాత్రం యివ్వబడిన పనియేమిటి! వచ్చిన బ్రాహ్మణోత్తములకి కాళ్ళు కడగటము. ఇది ఎంతో వినయవంతుడైనవాడు, ఆత్మాభిమానం లేనివాడు చెయ్యగలపని. అందులోనూ శ్రీకృష్ణుడు సామాన్యమైన ప్రాకృతుడులాటి మనిషి కాదు. ఆనాటి రాజులలో మేటి. దేశ పరిపాలకు లతో తులతూగే రాజగౌరవం కలవాడు. ఇటువంటి వ్యక్తి యజ్ఞానికి వచ్చే అనేక వేలమంది అందులో సామాన్య బ్రహ్మణులూ వుంటారు, మహానుభావులూ వుంటారు. యింతమందికి ఆ యజ్ఞంలో శ్రీకృష్ణుడు నిర్వహించిన పాత్ర ఏమి టంటే ఆ వచ్చిన వాళ్ళందరికి కాళ్ళు కడగడమే ఆయన డ్యూటి.

---

* "చరణక్షాళనే కృష్ణో బ్రాహ్మణానాం స్వయంహ్యభూత్." బ్రాహ్మణుల కాళ్ళు కడుగుటకు కృష్ణుడు తన్నుతానే నియోగించుకొన్నాడు.

సభాపర్వ - రాజసూయ-45

యజ్ఞశాలదగ్గిర ఒక పెద్ద గంగాళం, ప్రక్కన పెట్టుకొని వస్తూ పోతూవుండే బ్రాహ్మణోత్తములందరికి పాదప్రక్షాళనం చెయ్యటం. అలా ఆయన తన వినయగుణాన్ని అందరికంటె తను చిన్నవాడినని, తక్కువ వాడిని అని చెప్పి భావించటం వ్యక్తంచేస్తూ ఆయనలోని మేలిమిలాంటి నిరహంకారత్వాన్ని అందులోనూ రాజులలో అరుదైన గుణాన్ని చూపిస్తున్నదీ చిన్న సన్నివేశం.

అంతేకాదు, శ్రీకృష్ణుడిలోవున్న యీ మహత్తరమైన వినయ గుణం, మనకి మహాభారతంలో ఇంకా అనేక విషయాల్లో స్పష్టంగా కనబడుతుంది. మనం గనక పాత్రపోషణని దృష్టిలో పెట్టుకుని చిన్న విషయాలన్నీ కూడా గమనిస్తూ సంస్కృత భారతం గనక పఠించితే ఆయన రాయబారం నుంచి తిరిగివచ్చి జరిగిన వృత్తాంతం నివేదించే సన్నివేశంలో కూడా, ధర్మరాజుని "ప్రభో!" - అంటే ఓ "ప్రభూ!" అని సంబోధిస్తాడు పాదములంటి నమస్కరించి శ్రీకృష్ణుడు.

ఇవన్నీ మనం శ్రీకృష్ణుడంటే సినిమాలో చూసి, ఊహించుకునే కృష్ణుడిలో లేని విషయాలు. ఈ సినిమాలు తీసేవారు కూడా చారిత్రక విషయాలు గమనించకుండా యీ మహావ్యక్తిని చౌకబారు ఊహలతో చిత్రించటం భారతీయ సంస్కృతికే ద్రోహం. పొట్ట కూటి కని వ్యాపార దృష్టిలో యిలాగ జాతీయ సంపదలైన భారత రామాయణాలకి అపకారం చెయ్యటం దేశద్రోహమే అవుతుంది. ఎందుకంటే, ప్రజల మనస్సులో చిత్రించబడే కృష్ణుడి ప్రతిమ యీ ముప్పావలా టిక్కెట్టులో చూపించే అబద్ధాలమీదే ఆధారపడి వుంటుంది. ప్రజలకి యిలాగ, చులకనభావం ఏర్పడేలాగ, మనదేశ సంస్కృతికే పట్టుకొమ్మ అయిన - నైతిక, ధార్మిక,

ఆధ్యాత్మిక విలువలకే హానికరంగా శ్రీకృష్ణునిలాంటి జాతీయవ్యక్తులు, దేశనాయకులవంటి మహాపురుషుల్ని చూపించటం, ఘోరమైన దుష్పరిణామాలకి దారితీసే అసత్యం, ఆత్మ ద్రోహమూను.

ఇలాగే యింకో సన్నివేశంలో కూడా అర్ఘాభిహారణ పర్వంలో - పాండవులు శ్రీకృష్ణుడికి అగ్రతాంబూలం యివ్వదలచినప్పుడు శిశుపాలుడు ముందుకొచ్చి అనేక నిందాలాపాలాడుతాడు శ్రీకృష్ణుడిపట్ల. తనచుట్టూ యింత ఘర్షణలూ తర్జనభర్జనలు తనగురించి జరుగుతూ వున్నాసరే ఆయన పల్లెత్తు మాటకూడా అనలేదు. పైగా తననుంచి శిశుపాలుడిమీద కొంచెంకూడా అవినయం లేకుండా స్థిరంగా కూచుని, అతడు చెలరేగి నోటికి వచ్చినట్లు నిందిస్తూండగా కూడా కేశవుడు తన సహజ వినయగుణాన్ని విడువలేదు.

చివరికి అతడు తనని ద్వంద్వయుద్ధానికి రావించి సవాలు చేస్తూ కూర్చునివున్న వాసుదేవుడిమీద వాడి బాణాలు నాటి రక్తం తెప్పించేవరకూ కూడా ఆయన కదలలేదు. చివరికి కార్యం నిర్వర్తించక తప్పనిసరి అయ్యాక, రథంలో నిలిచి శిశుపాలుడి సవాలుకు బదులు చెప్పి, పోరి, అతడిని వధించినట్టుగా మనకి వ్యాసభారతం, సభాపర్వం తెలుపుతోంది. (అంతేకాని చేతిలోని చక్రం విసిరితే శిశుపాలుడు చావటం మనం వినే గాలి కథల్లోనే!) ఇంతేకాకుండా యీ శిశుపాల వధ పర్వంలోని భీష్ముడి మాటలు, ధర్మజుడి మాటలు జాగ్రత్తగా గమనిస్తే ఆనాటి సాటివీరులలో శ్రీకృష్ణుడు ఎలాంటి యోధుడో,

---

చూ. సభాపర్వము - అధ్యాయము (అర్ఘాభి)

సమరజిష్ణువో ఆనాటి ఋషిపుంగవుల్లో ఎలాంటి వేదవిదుడో, నాటి జ్ఞాన వయోవృద్ధులలోకల్లా మేటి విజ్ఞాని, మేధావి, విద్యాసంస్కార వంతుడో సుస్పష్టంగా మనకి తెలుపుతున్నవి. ఈ కారణాలవల్ల శ్రీకృష్ణుడికి అగ్రతాంబూలం యిచ్చి అగ్రపూజ చేస్తున్నాముగాని బంధువని గాని, స్వపక్షబుద్ధితోగాని యీనాటి రాజకీయ పదవులిచ్చినట్టుగా యివ్వటం జరుగలేదని, వ్యాసాది మునులు, భీష్మ ద్రోణాది వీరులు, జ్ఞానులు, తపోధనులూ, వృద్ధులూ అందరి ఆమోదంతోనూ వారు వినేట్టుగా సభలో చెప్పిన విషయాలవల్ల, యీ లోకోత్తరవ్యక్తి 'యుగ పురుషుడు'గా గణుతించబడటానికిగల కారణాలు తెలుస్తాయి మనకి.

శ్రీకృష్ణుడి అగ్రపూజకు అడ్డుచెప్పిన చేదిరాజైన శిశుపాలుడికి సమాధానంగా, శాంతనపుడు కురువృద్ధుడు ఆ సభలో లేచి యీ విధంగా అన్నాడు :

"ఈ రోజున యీ రాజసమితిలో చాలామంది శ్రీకృష్ణుని చేతిలో పరాజితులైనవాళ్ళున్నారు. కేవలం పక్షపాతంతో యీ అగ్రపూజని హృషీకేశుడికివ్వటం లేదు. గుణాలుబట్టి చూస్తే మూడు లోకాల్లోనూ గౌరవనీయుడు, అర్చనీయుడు జనార్దనుడే. పరాక్రమంలో చూసినా, యిక్కడున్న రాజులలో చాలమంది ఆయన చేతిలో ఓడించబడ్డవాళ్ళే. పరాక్రమంలోనూ ఆయన అర్చనీయుడే."

"కేవలం బంధుభావంచేతగాని, కామవశులై ఏదో కోరికవల్ల గాని, పక్షపాతంతోనో, అభిమానంతోనో అయన్ని యీ రాజసభలో ఈరోజున అర్చించటం జరగటంలేదు. ఈయనయందు యశస్సు, శ్రీ, విజ్ఞానమువంటి సర్వశుభలక్షణాలు సంపూర్ణంగా అవిష్కారం పొంది

యున్నాయి. అందుచేత ఈయన యీనాడు మనకందరికి అర్చనీయుడు. ఇక్కడెందరో మహనీయులని, వయోవృద్ధుల్ని (భీష్మ ద్రోణ వ్యాసాదులను) అతిక్రమించి, అర్చనీయుడై స్పష్టంగా ప్రతివారికి కూడా వశిష్టుడవటమే కారణం."

"ఎందుకంటే బ్రాహ్మణులలో ఎవడు జ్ఞానంలో జ్యేష్టుడో, అతడే పూజనీయుడు - క్షత్రియులలో బలాధికుడు ఎవడైతే వుంటాడో, అతడే అందరిలోనూ మానార్హుడని పండితులు చెబుతారు. ఈ రెండు విషయాలలోనూ, శ్రీకృష్ణుడు జ్యేష్టుడు కాబట్టి - జ్ఞానులలో శ్రేష్టుడున్నూ, బలవంతులలో జ్యేష్టుడునూ కాబట్టి అన్నివిధాలా ఆయన ఇక్కడ ఈ సభలో అందరికీ అర్చనీయుడు."

ఎందువల్లనంటే ఈయనయందు వేదవేదాంత విజ్ఞానం * సంపూర్ణ పరిణతి పొందియున్నది. బలం, మహాశౌర్యం, బుద్ధి, పరాక్రమం కూడా ఈయనయందు మూర్తీభవించి వున్నవి. ఈ లోకంలో విశేషమైన ఇన్ని లక్షణాలు కలిగినవాడు యీ కేశవుడు తప్ప యింకొకరు లేరు.** ఈయనయందు దానం, దాక్షిణ్యం, బహుశ్రుతమైన పాండిత్యమూ, శౌర్యంతో కూడిన వినయగుణమూ, లోకం అంతా పేరుపొందిన బుద్ధి

---

* న కేవలం వయం కామాచ్చేద్ధిరాజ జనార్ధనం
న సంబంధం పురస్కృత్య కృతార్థం వా కథంచన
వేదవేదాంగ విజ్ఞానం బలంచావ్యధికం తథా
నృణాం లోకే హి కోన్యోస్తి విశిష్టం కేశవాదృతే

** దానం దాక్ష్యం శృతం శౌర్యం హ్రీః కీర్తిరుత్తమా
సన్నతిః శ్రీర్ధృతిః తుష్టిః పుష్టిశ్చ నియతాచ్యుతే.

బలం - మహాపురుషునిలో వుండే ఉత్తమ లక్షణమైన ఉదారత, ధృతి, ఈయనలోని ఆత్మసంతృప్తి, పుష్టి, నిశ్చలత్వం, గాంభీర్యం, నాయకత్వం, యివన్నీ కూడా వున్న మహాపురుషుడు యీ రాజసమితిలో ఈయన ఒక్కడే. తక్కిన వారెవరియందు కూడా ఇన్ని లక్షణాలు లేవు. అందుకని లోకసంపన్నుడు యిక్కడున్న మాకందరికీ ఆచార్యుడైనవాడు, గురువూ, * మాకు తండ్రితో సమానుడైనవాడు - అర్చనీయులందరి లోకి కూడా అర్చనీయుడూ, అర్చనార్హుడూనని యీరోజు, మేము ఈయనని అర్చిస్తున్నాము.''

''ఈయన ఋత్విక్కులలో ఋత్వికుడు, ఆచార్యులలో ఆచార్యుడు, స్నాతకులలో సర్వశాస్త్ర సంపూర్ణుడయిన సర్వశాస్త్ర విశారదుడు, సర్వజనప్రియుడు, దర్శనీయుడు, ఎంతో రూపసంప న్నుడు. ఇటువంటి సర్వగుణాలు కూడా ఒక్కడిలో వుండటం, ఇంకెవరి లోనూ లేకపోవటంచేత మీరందరు కూడా సమ్మతించి యీ మహా పురుషుడిని గౌరవించటాని కనుమతించవలసింది.'' - యీ మాటలు ధర్మజుడి నుంచి అయితే స్వపక్షపాతం అనుకోవచ్చును. కాని చెప్పు తున్నది, కడు వృద్ధుడూ కృష్ణునితో సమానుడైన యోధుడూ నైవున్న శాంతనవుడు. భీష్మాచార్యులవారు, ద్రోణుడూ, వ్యాసుడూ, నారదుడూ లాంటి మహామహులందరూ యీ విషయాలన్నీ ఏకగ్రీవంగా ఆమోదించి ఆనందించారంటే శ్రీకృష్ణుడు ఆనాటి సాటి రాజులలో, మునులలో,

* తమిమం లోకసంపన్నం ఆచార్యం పితరం గురుం
...ఋత్విర్గురు స్తథాచార్యః స్నాతకో నృపతిః ప్రియః

షూరుల్లో మహోత్తముడై యుగపురుషుడుగా వెలగటానికి గల కారణాలు, మనకి తెలుస్తున్నాయిందులో.

శ్రీకృష్ణుడు నిత్యజీవితంలో చాలపవిత్రుడు, సత్యవాది మహాభారత యుద్ధం అంతా అయిపోయింతర్వాత ద్వారకకు చేరుకున్న మాధవుడిని, తండ్రి వసుదేవుడు దగ్గరికి పిలిచి "నాయనా! నువ్వెప్పుడు కూడా జీవితంలో అబద్ధం చెప్పినవాడివి కావు. నిన్ను మొదటి నుంచి కూడా సత్యవంతుడిగా ఎరుగుదును. అందుకని యీ కురుపాండవ యుద్ధంలో అన్యోన్యవైషమ్యాలు, కక్షలు, పరస్పర విరోధాలు ఎలా మొదలయ్యాయి? యీ వినాశం యిలా పరిణమించటం అంతా నాకు యధాతథంగా చెప్పవలసింది" అని అడుగుతాడు. ప్రపంచంలో ఎవరు మెచ్చుకున్నాగాని, తండ్రి నుంచి మెప్పుపొందటం అనేది సామాన్యంగా దుస్సాధ్యమైన పని. ఒకవేళ తండ్రి హృదయంలో మెచ్చుకున్నా కాని, అది ఎదురుగుండా ఆ మెప్పును పైకి చూపెట్టడు. అటువంటిది తండ్రి అయిన వసుదేవుడే శ్రీకృష్ణుడ్ని, "నువ్వెప్పుడూ జీవితంలో అబద్ధం చెప్పి ఎరుగవు" * అని అన్నాడంటే - ఆయన జీవితంలో వ్యక్తిగా ఎటువంటి ఆదర్శజీవిగా బ్రతికాడో మనం ఊహించుకోవచ్చు.

అర్జునుడు శ్రీకృష్ణుడిని సంబోధించినప్పుడు కూడా "సత్యవతాం వర" అని, సత్యవాక్యులందరిలోకి శ్రేష్ఠుడైన ఓ సత్యవచనుడా! అంటూ సంబోధించినట్టుగా ఘటోత్కచవధ పర్వంలో స్పష్టంగా ఉన్నది.

---

* నను త్వం పుండరీకాక్ష సత్యవాగ్భువి విశ్రుతః

(- అశ్వమేధిక, 61 అధ్యా.)

ఇలాగ యింకా చాలా సన్నివేశాలలో శ్రీకృష్ణుడి సత్యావాదిత్వం, యితర లోకోత్తర మానవ లక్షణాలు, జనాభిప్రాయంగా అనేకమంది ముఖతః మనకి తెలియటమేగాక చివరికి దుర్యోధనుడు కూడా ఆయన సర్వసముడని ఎంచి, నిష్పక్షపాత గుణాన్ని నమ్మి యుద్ధంముందు ఆయన సహాయం యాచించి ఆయనని దర్శించటానికై వెళ్ళటంలో కూడా తెలుస్తున్నది. యాదవ సైన్యాన్ని కూడా సహాయంగా శ్రీకృష్ణుడి నుంచి పొందటమేగాక మహాయోధుడైన శ్రీకృష్ణుడు యుద్ధంలో పాల్గొనని మాటను, ఆయుధం పట్టనన్న శపధాన్ని కూడా దుర్యోధనుడు పొందాడంటే వాసుదేవుని సమబుద్ధి మనకి క్రియారూపంలో కూడా స్పష్టంగా కనబడుతోంది.

సర్వసాధారణంగా శ్రీకృష్ణుడు శాంతికాముకుడని అనుకోము. ఆయన యుద్ధోన్మాది అనీ, ఆయన కారణంగా మహాభారత యుద్ధం చెలరేగి అనేకమంది రాజులూ, వీరులు, జనసందోహమూ దుర్మరణం పాలయిందని, ఆయన సంధికి వెళ్ళినప్పుడు కూడా శాంతికిగాక యుద్ధమే అవ్వాలని యత్నించాడని, అంతేగాక సంధి కుదరకుండా పోవాలని, యద్ధమే సమకూరాలని ఆయన ఆశయం అన్నట్టు, ఒక లోకాపవాదం వ్యాప్తిలోవున్నది. ఉండటమే కాకుండా భూభారం తగ్గించటం కోసమే ఆయన అవతారమెత్తాడు కాబట్టి మనుషుల్ని చంపాలని, చంపాడని కూడా ఒక వాదం వున్నది. ఈ వాదం

---

* అర్ఘ్యమర్చితు మర్హార్థం సర్వే నమ్ముతు మర్హథ

(సభా - అర్ఘాభిహరణపర్వ.)

యింతటితో ఆగకుండా అసలు శ్రీకృష్ణుడు రాయబారంలో చేసిన సంధి ప్రయత్నంలోనే చిత్తశుద్ధి లేదనేదాకా కూడా పాకింది. ఈ అపప్రధలు, శ్రీకృష్ణుడిని గొప్ప చేస్తున్నామనుకొంటూ కొందరు కల్పించిన అపవాదులు, ఇది చాలా అన్యాయం. ఆయన పాత్రకే తీరని కళంకం ఆపాదించటం మాత్రమేగాక, ఆయన నిజస్వభావాన్ని కప్పిపుచ్చి, సంస్కృత భారతంలో అనేక అంశాలలో కనిపించే ప్రత్యక్ష నిజాన్ని వ్యతిరేకిస్తున్నది. అందుకని యీ సన్నివేశం కొంత విపులంగానే యిక్కడ పరిశీలింతాము.

వ్యాసభారతంలో శ్రీకృష్ణుని ఉద్దేశ్యాలు మనకి సుస్పష్టం అయ్యేట్లు చెయ్యటమే కాకుండా ఆయన ఆ సమయంలో అవలంభించిన పద్ధతిని తెలిపే ఘట్టాలు కొల్లలుగా వున్నాయి. అందులో కొన్ని మాత్రమే (అందులోనూ భావానువాదంతో) స్థూలంగా ఉదహరించటం మటుకు యిక్కడ వీలుపడుతుంది.

రాయబారము పనిమీద వెళ్ళిన శ్రీకృష్ణుడు, తనకోసం పెద్ద భారీ ఎత్తున దుర్యోధనుడు ఏర్పరచిన వసతులు, శయ్యలు, భూషణాలు, రాజభవనాలు, మహార్హాలంకారాలు, విలాసాలూ యివేవి గ్రహించలేదు. తనయింట్లో భోజనం చెయ్యమని బలవంతం చేసిన దుర్యోధనుడితో ఆయనేమి చెప్పాడంటే 'కార్యార్థి అయి వచ్చిన దూత తన యజమాని కార్యం సిద్ధించనిదే అతిథిగా భోజనం చెయ్య కూడదు. ఇది రాజధర్మం.' అని విదురుడి యింటిలోనే బసచేసాడు. విదురుడు ఆయనకు కూర్చుభక్తుడు, ధర్మాత్ముడు, ఎంతో నీతి పరుడూ అవటమేగాక ఉభయపక్షాలు కార్పణ్యాలు మాని శాంతిగా

ఉండాలని, అన్యాయాలని అరికట్టాలని, ఎన్నిసార్లో ధృతరాష్ట్రుడికి ఓపికతో చెప్పి చూసిన వ్యక్తి. అప్పుడు వారిద్దరికీ జరిగిన సంభాషణలో (ఉద్యోగ-91) ఇద్దరు మిత్రులూ అంతర్యాలు విప్పి మాట్లాడుకున్న మాటలలో మనకి కృష్ణుడి నిజగుణం సుస్పష్టంగా వెల్లడి అవుతున్నది.

రాత్రి భోజనానంతరం శ్రీకృష్ణుడు విశ్రమించినప్పుడు విదురుడు ఆయనతో 'ఓ దేవా! అతిసాహసులూ, దుర్మార్గులు, ఇటువంటి క్రూరులైన వాళ్ళమధ్యకు నువ్విలా స్వయంగా తొందరపడి రావటం క్షేమకరం కాదు. నీ ఉద్దేశం లోకహితమూ, ఆదర్శవంతమూ అయినప్పటికీ, నువ్వు ఉభయులకీ కూడా హితము కోరి వచ్చావన్నది నిజమే అయినప్పటికీ, వీళ్ళు నీమాటలన్నీ వింటారని తోచదు. ఈ రాయబారం సఫలం అవుతుందని అనిపించదు' అని చెపుతాడు. ఎందువల్లనంటే కౌరవపక్షం అప్పటికే తీవ్రంగా యుద్ధం కోసం ప్రయత్నాలు చేస్తున్న సమయమిది. ఐనప్పటికీ శ్రీకృష్ణుడు ఈ పరిస్థితి తెలిసికూడా హస్తినకు వచ్చాడు. తన ఆశయం గురించి ఆయన, ఆ రాత్రి మిత్రుడియింట విందుచేసి సుఖోపవిష్టుడై, తన అంతర్యాన్ని విప్పి చెప్పిన మాటలు ఇక్కడ ఎంతో ముఖ్యమైనవి. ఆయన ప్రేమతో, తన సెజ్జన ఆసీనుడైన విదురుని చూసి అన్నాడు నెమ్మదిగా.

"నిజమే! నీవు చెప్పినదాంట్లో ఒక్క ముక్కకూడా తప్పులేదు. యదార్థమే! ఇవన్నీ నాకు తెలియక కాదు. అన్ని తెలిసే వచ్చాను. యీ సంధిప్రయత్నం కోసం రాయబారిగ. కౌరవుల మనస్తత్వం పూర్తిగా నేనెరిగినదే. వాళ్లు దుస్సాహసులు. ఏ దుష్టపనులు చెయ్యటానికీ

వెనుకాడరని తెలుసు. అందులో ప్రమాదం కూడా గుర్తించక పోలేదు. ఇలా రావడంలో వున్న ప్రమాదం కూడా తెలుసు. కాని విదురా! ఇందులో ఇంకో ముఖ్యవిషయం ఒకటున్నది, చెబుతాను విను.

"ఎవడైతే యీ భూమిని, యీ లోకంలో జీవరాసుల్ని, రథ కుంజర సేనావాహినిని, అశేష జనసమూహాన్ని కూడా మృత్యువు వాత పడకుండా రక్షిస్తాడో, అలాంటివాడు యీ లోకంలో తప్పక మహత్తర ధర్మాన్ని సాధించినవాడవుతాడు.* అందుకనే నేను నా శాయశక్తులా యుద్ధనివారణ కోసం, శాంతి చేకూర్చటానికి ఏ మాయా మర్మం లేకుండా యత్నిస్తాను.**

మానవుడు ఒక ధర్మకార్యాన్ని తలపెట్టి దానికోసం యత్నించటం వల్ల ఆ పని జరిగినాసరే, జరగకపోయినాసరే దాని తాలూకు పుణ్యం మాత్రం తప్పక పొందుతాడు.

"ఈనాడు నా యత్నంవల్ల యుద్ధం నివారణ అయినాసరే యత్నం విఫలమైనాసరే, కౌరవులనీ, పాండవుల్నీ కూడా వారికీనాడు వాటిల్లిన మహావిపత్తు నుంచి తప్పించటానికి - నా శాయశక్తులా యత్నించటానికే వచ్చాను. ధర్మవిదులు ఏమిచెబుతారంటే, ధర్మ కార్యం కోసం ప్రయత్నించినవాడు ఒకవేళ అది సమకూడకపోయినా సరే, ఆ పుణ్యసుకృతాన్ని, ఆ ధర్మఫలితాన్ని తప్పక పొందుతాడు అని. అలాగే పాపకర్మని హృదయపూర్వకంగా ఏవగించుకున్నవాడు, ఒకవేళ దాన్ని

---

* "పర్యస్తాం యో పృదివీం సర్వా, సాశ్వాం సరధకుంజరాం
యో మోచయే స్మృత్యుపాశాత్, ప్రాప్నుయాద్ధర్మముత్తమం"

** సో_హం యతిష్యే ప్రశమం కర్తు మమాయయా" (ఉద్యో-91 అధ్యా.)

నివారించటంలో కృతకృత్యుడు కాకపోయినా ఆ పాపం నుంచి రక్షింపబడతాడు. అందుకే, ఏది పాండవులకీ, కౌరవులకీ కూడా హితమో, ఏది యీ భూమీమ్మీది సర్వజీవులకు కూడా క్షేమకరమో, దాన్ని సాధించటానికి ఏ మాయా లేకుండా ప్రయత్నిస్తాను."

"ఇంకో విషయం కూడా చెబుతా విను. తనకి జ్ఞాతులైన వాళ్ళకి, రక్త సంబంధీకులకీ పరస్పర విరోధాలు రగులుతున్నప్పుడు, మైత్రికి యత్నించక చూస్తూ ఎవడు ఊరుకుంటాడో, వాణ్ణి మిత్రుడు కాడని, అహితుడని పండితులు చెబుతున్నారు.

నన్ను శత్రువులు కూడా "సమర్థుడై వుండికూడా యీ కృష్ణుడు, కురుపాండవ వినాశకరమైన వైరాన్ని వారించలేదని" అనకుండా వుండేట్టు, చిత్తశుద్ధితో ప్రయత్నం చేస్తాను. ధర్మార్థయుక్తంగాను, ఎవరికీ నష్టం లేకుండాను, హితంగానూ ఆప్తవాక్యం పలుకుతాను. ఈ యత్నం గనక ఫలించి, నేను కౌరవులకీ, పాండవులకీ నష్టం వాటిల్లకుండా యుద్ధాన్ని నివారించగలిగితే దీనివల్ల ఎంతో పుణ్యం వుంటుంది. నాకూ ఆత్మసంతృప్తి కలుగుతుంది. నా జీవితం కూడ చరితార్థం అవుతుంది." ఈ మాటలు విన్న విదురుడి కళ్ళు పూజ్య గౌరవ భావాలతో చెమర్చలేదని, ఆ ఆదర్శ మానవావతారమూర్తికి లోలోనే కైమోడ్పులర్పించలేదని ఎవరు అనగలరు? ఇక మర్నాడు రాజసభలో ఏం జరిగిందో చూతాము. ఆనాటి దృశ్యమొక వర్ణనా తీతమైన మనోహర సన్నివేశం.

అది హస్తినాపురం, రాజబాటంతా చూడముచ్చటగా అలంకరించబడి వున్నది కొత్తపెళ్ళికూతురులాగ. ఆనాడు ఊరు ఊరంతా

జనసమర్ధంతోను, వచ్చేపోయే రథఘోషలతోను కోలాహలంగా వున్నది. వృష్టివీరుడు, ప్రజాహృదయ చోరుడైన శ్రీకృష్ణుని ఆగమనవార్త నగరమంతటా పాకింది. ఎక్కడ చూసినా మార్గానికి ఇరుప్రక్కల వున్న భవంతులమీద గుమిగూడిన ప్రజలు యదువీరుని కన్నులారా దర్శించి పులకించాలనే ఉబలాటంతో కలకలలాడుతున్నారు. గంధాక్షతలూ, పూలు, తీసికొని ఆయనకి స్వాగతం తెలుపటం కోసం సౌధాలమీద వేచివున్నారు. మానవోత్తముడు, యుగధర్మ ప్రవర్తకుడు అయిన ఆ మహాత్ముడు తొంభైఏళ్ళ ప్రాయంతో, పండిన రాజకీయపు టనుభవంతో, రాజర్షిగా సకల లోకహితంకోరి, ఇరువేపులా బంధుజనుల హితంకోసం తానై రాయబారం వచ్చాడని తెలిసి ఆనాడు హస్తినాపుర ప్రజలు పౌర్ణమినాడు సముద్రంలాగ పొంగిపోతున్నారు. అది భారతదేశ చరిత్రలోనే ఒక మైలురాయి. హిందూజాతి జీవితం లోనే అది ఒక చారిత్రాత్మకమయిన ఘట్టం.

శ్రీకృష్ణుడు వస్తున్నాడన్న కోలాహలం ఎక్కువైంది అంతటా. రాజమార్గంలో సముద్రం హోరులాగ రొదపెడుతున్న ఆ జన కోలాహలాన్ని మించి ఉరుముల్లాగ వినపడుతున్న ఘోషతో రథాలు పరుగులు పెడుతూ వెళ్ళినాయి దుమ్ములేపుకుంటూ. మార్గానికిరువైపులా మేడల మీదనించి తొంగిచూచే జనసమూహపు కోలాహలం జయజయ ధ్వానాలతో మిన్నుముట్టింది. ఈ కోలాహలంవింటూ పైనుంచి పూవులు, అక్షతలు, తనపై చల్లుతూంటే చూస్తూ, ప్రజాసమూహం ఆయనపట్ల వ్యక్తంచేసే, ఆ ఆనందోత్సాహాలను స్వీకరిస్తూ, ఏదో లోకంలో వున్నట్టుగా తనచుట్టూరా జరుగుతున్న దాంతో తనకేమీ సంబంధంలేనట్లు, తనకివేవి

అంటనట్టుగా కించిత్ మందహాసంతో కూర్చుని యున్నాడు యదు సింహుడు. నగరాకారంతో మేరుపర్వతం లాగ మెరిసే ఆ మహారథం మువ్వలు కింకిణుల ధ్వనిచేసికొంటూ వెళ్ళి, రాజభవనం ముందరగా ఆగింది. అందులోంచి మెరుపు మెరిసినట్టు దిగి, ద్వారం సమీపించాడు శ్రీకృష్ణదేవుడు. మణి కిరీట కాంతులు సూర్యకాంతిలో తళుకు తళుకు మని మెరిసిపోతూంటే, చుట్టూవుండే రాజుల కిరీట రత్నభూషణ కాంతులను అతిక్రమించిన అందంతో నడుస్తున్నాడు. విలక్షణమైన ఆ నడక! ఠీవితో కూడిన అందం ఆయనది. ముందు దుర్యోధనుడు తర్వాత కర్ణుడూ సగౌరవంగా దారిచూపుతూ ముందుగా నడుస్తూంటే తన సరసన, కూడా నడిచే విదురుడి చెయ్యిని చేత్తో పట్టుకుని అలవోకగా, అనాయాసంగా తేలి పోతున్నట్టుగా నడుస్తూ సభాద్వారం ప్రవేశించాడు. అలాగ, వందిమాగధుల స్వాగతశబ్దంతో జయజయ ధ్వానాలమధ్య, గంభీర శాంతమూర్తిగా వృష్టిసింహుడు కురుసభా భవనంలోకి ప్రవేశించాడు.

రాజులు బారులుతీర్చి ఆయన మధ్యనడిచే దారి కిరువేపులా కూర్చున్నారు సింహాసనాలమీద. మధ్యనించి ముందు దారిచూపుతూ కర్ణసుయోధనులు తన వెన్నంటి నడుస్తూండగా కూడా కవచ, శిరస్త్రాణాలు ధరించిన వృష్ణివీరులు, సాత్యకి కృతవర్మలు ఆయుధపాణులై నడుస్తున్నారు. గ్రహాలమధ్య సూర్యుడిలాగ ప్రకాశించాడు, ఆ రాజసమూహం మధ్యనించి అలా నడుస్తున్న వాసుదేవుడు కురుసభలో.

ప్రజ్ఞాచక్షువైన మహారాజు ధృతరాష్ట్రుడు భీష్మద్రోణుల సహాయంతో

ఎదురేగి స్వాగతం పలుకుతూ సగౌరవంగా ప్రత్యుత్థానం చేశాడు. భీష్మ ద్రోణాదులతోపాటు ఆ సభలో ఆసీనులైన రాజలోకం సంభ్రమంగా లేచి నిలబడి స్వాగతం చెబుతూ కోలాహలంగా ప్రత్యుత్థానం చేసింది.

మాధవుడు భీష్ముడిని, ద్రోణాచార్యుడినీ చూచి చిరునవ్వుతో పల్కరించి, తక్కిన రాజుల్ని వయోనుకూలంగా కుశల ప్రశ్న చేశాడు. భీష్ముడిని ప్రక్కకి పిలిచి నెమ్మదిగా అన్నాడు. "ఈ రాజుల సమావేశం దర్శించటానికై మహాత్ములైన మహర్షులు విచ్చేశారు. రాజా! వెంటనే వారికి ఆసనాలు ఏర్పాటు చేయించి సగౌరవంగా వారిని పూజించి ఆహ్వానించవలసింది. వీరు ఆసీనులైన తర్వాతనే మనం కూర్చొనవలసింది." అని రాజసభ మధ్యన నిలబడి కృష్ణుడు అంత రిక్షంలో కనపడిన మహర్షులను చూస్తూ అన్నాడు. ఇంతలోకే భీష్ముడు సభా ద్వారం దగ్గరికి చేరి, నిలచివున్న ఋషిపుంగవుల్ని చూశాడు. వెను వెంటనే సేవకులు హడావిడిగా ఉరుకులు పెట్టుకుంటూ ఆసనాలు తెచ్చివేశారు.

అటుతర్వాత ఆ మహర్షరత్న భూషితాసనాలమీద ఆసీనులై, మహాభాగులైన ఆ మునివర్యులు అర్ఘ్యపాద్యాలు స్వీకరించిన తర్వాతనే శ్రీకృష్ణుడు ఆసీనుడైనాడు. శ్రీకృష్ణుడు కూర్చున్న తర్వాత దుశ్శాసనుడు, మహావీరుడైన సాత్యకికి ఆసనం సమర్పించాడు. కృతవర్మ ఆసీనుడైన తర్వాత కృష్ణుడికి అనతిదూరంలోనే కర్ణసుయోధనులు ఇద్దరూ ఒకే సింహాసనం మీద ఆసీనులయ్యారు. శకుని కూర్చున్న తర్వాత ధృతరాష్ట్రుడు ఉపవిష్టుడయ్యాడు సింహాసనంపైన.

సముద్రంలాగ ఘోషిస్తున్న ప్రేక్షకులు, రాజులు శ్రీకృష్ణుడిని కళ్ళతో తాగేస్తున్నట్టు చూస్తున్నారు. అలా ఆ సభలో ఆసీనుడైన పీతాంబరధారి, తేజోరాశిలాగ వెలిగిపోతూ బంగారులో పొదిగిన వజ్రం లాగ కనబడుతూ, సభాసదుల హృదయాల్ని ఆనందోత్సాహాలతో నింపింపజేశాడు. అలాగ కొద్దిక్షణాలు కూర్చుని వున్నంతలో సభంతా నిశ్శబ్దం అయింది. ఒక్కరు గూడా సవ్వడిలేకుండా చెవులు రిక్కించు కొని వేచివున్నారు. తన ఆసనం మీదనుంచి లేచి నిలబడి చుట్టూ చూస్తున్న శ్రీకృష్ణుడినిచూసి, అది ఒక దివ్యమైన సన్నివేశం - ఆ సభా ప్రాంగణంమధ్యన నిలబడి తనచుట్టూ బారులుతీర్చి ఆసీనులైన రాజసముద్రంలాంటి సభనిచూస్తూ, మేఘ గంభీరస్వరంతో కేశవుడు ప్రసంగిస్తున్నప్పటి ఆ దృశ్యం, వ్యాసుని కవిత యీ సన్నివేశాన్ని వృధా చేయలేదు. ఇక్కడ బంగారు కిరీటాలు, కవచాలూ, మణిహార రత్న భూషణాలతో నిండిన ఆ సభమధ్య శ్రీకృష్ణుడు బంగారంలో తాపిన నీలమణివలె భాసించాడట! శ్రీయొక్క కాంతులు చూపరులకి నేత్రోత్సవం చేయగా, తేజస్సూ, అందం, సింహసదృశమైన రాజసంతో, తోటి రాజుల్ని తలదన్ని, నక్షత్రాలలో చంద్రుడిలాగ భాసించాడు శ్రీకృష్ణుడు.

అలాగ - ఆయన ఆ కౌరవ సభాభవనం మధ్య నిలిచి ధృతరాష్ట్ర మహారాజుకి అభిముఖంగా తిరిగి సవినయంగా, సూటిగా, తను చెప్పదలచుకున్న సందేశాన్ని చెప్పటానికి ఉపక్రమిస్తూ - చుట్టూవున్న రాజుల సమ్మర్దాన్ని ఒక్కసారి కలయచూశాడు.

ఆ సభలోవున్న రాజులందరూ శ్రీకృష్ణుడిని అంతకుముందు

అనేకసార్లు చూసివుండికూడా తృప్తితీరని కళ్ళతో, తాగేస్తున్నట్టు, యింకా చూడాలనే కోరికతో, ఆయన సుందర విగ్రహాన్నే చూస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఆ సభలో వున్న ప్రతివొక్కరూ ఏం మాట్లాడితే ఆ ధ్వనిలో ఆయన మాటలు ఎక్కడ తప్పిపోతాయోనని - ఏమీ మాట్లాడకుండా, కిక్కురుమనకుండా - నిశ్శబ్దంగా కూర్చున్నారు.

అలాగ సభంతా నిశ్శబ్దంగా అయ్యేక శ్రీకృష్ణుడు ముత్యాల్లాంటి తన తెల్లని పలువరుస మెరుస్తూంటే ఉరుములాంటి గంభీరమైన కంఠస్వరంతో ఆ సభలో అందరికీ వినిపించేలాగ ఈవిధంగా ప్రసంగించాడు.

"కురు రాజులకూ, పాండవులకూ శాంతి కలుగుగాక! వీరుల నాశనం జరుగకుండా, ప్రపంచ శాంతికోసం యుద్ధంలో జీవుల మరణం జరగకుండా వుండేట్టు యాచించటానికి, నేనై యిక్కడికి స్వయంగా రావటం జరిగింది. ఇంతకంటే అందరికీ శుభం చేకూర్చే మాట, అందరికీ సర్వశ్రేయస్సునూ కోరేది, ఇంకోటి నేను చెప్పేందుకేమీ లేదు."

"రాజా! నువ్వు అన్నీ తెలిసినవాడివి. ఇప్పుడు నేను చెప్పేది నీకు తెలియనివేమీ కావు. విశేషించి నేను నీకు హితం ఇంతకన్నా చెప్పవలసిందేమీ లేదు, అంతా నీకూ తెలిసినదే!

"సరళంగా సూటిఅయిన మార్గంలో, దయాసత్యాలతో ఆలోచించి, అందరినీ వినాశంనించి రక్షించేట్టు, ధర్మమార్గం వదలకుండా వుండే పద్ధతిలో నిర్ణయం చెయ్యవలసింది. జననాశనం కలుగకుండా ఈ ప్రపంచంలో కృప, సమత్వంతో కూడిన మార్గంలో నడిచి, విశిష్టుడివై

వర్ధిల్లుదువుగాక! ఇలా అయినట్టయితే నీ కులం పేరుప్రతిష్టలతో కీర్తి గడించటమేగాక, మీ రెండు వంశాలూ తామరతంపరగా వర్ధిల్లగలవు!

"అలాకాక స్వార్థం ముందుంచుకుని, ధర్మార్థాలని రెండింటిని వెనక చేసివుంటం మూలాన, ఈరోజున కురువంశానికే మహోపద్రవం సంభవించింది. ఇటువంటి మహా విపత్సమయంలో బంధువుల్ని ఆపద లోంచి రక్షించటం అనేది నీ చేతిలో వున్నపని. అది కోరినట్టయితే, నువ్వీనాడు కురువంశాన్నే కాకుండా యీ భూమిమీదనున్న అనేక మందిని జననాశనం నించి తప్పించగలవు. కాని ఉపేక్ష చేసినట్టయితే లోకోపద్రవమైన ప్రజావినాశనానికిది దారితీస్తుంది. ఇలాంటి విపత్కర పరిస్థితినించి తప్పించి శాంతిని నిలబెట్టాలంటే యిది నీకు పెద్ద దుష్కర మైన పనేమీ కాదు. ప్రయత్నిస్తే అది నీకు చేతిలో పనియని నాకు తోస్తున్నది.

"రాజా! అన్యోన్య కలహాలవలన, పరస్పర కక్షల మూలాన్న దేశంలోవున్న రాజులందరూ కూడా యీనాడు యుద్ధోన్మాదంలోపడి కొట్టుకుపోతున్నారు. రెండు పక్షాలలోనూ చేరి వినాశనానికే తయారవు తున్నారు. ఈనాడు ప్రజ్వరిల్లుతున్న పరస్పర ద్వేషాగ్నిమూలాన సంభవించగల మహాయుద్ధంలో అనేకమంది అమాయక జీవులు అన్యాయంగా నశించిపోతారు. ఈ మధ్యన నలిగిపోయే అమాయక ప్రజల్ని, నశించిపోయే జీవుల్ని, * యీ వినాశనంనుంచి రక్షించమని సవినయంగా ప్రార్థిస్తున్నాను. ఇందులో ఇంకా గౌరవనీయులు,

* "త్రాహిరాజ్యాన్నిమంలోకం....etc.

వదాన్యులు, మహాత్ములూనైన పుణ్యపురుషులు అనేకమంది కూడా యీ మారణహోమంలో సామాన్య ప్రజలతోపాటు ఆహుతి అయి పోతారు. యీ మహాభయంకర విలయంనించి, రాజలోకాన్ని, వీరులను, సామాన్య ప్రజల్నీ కూడా ఈ యగ్నిలోపడి శలభాలలాగ నాశనం కాకుండా - ఈ లోకాన్నంతటినీ కాపాడమని ప్రార్థిస్తున్నాను." అంటూ సవినయంగా వేడుకున్నాడు లోకహితుడూ, సర్వ భూతహితుడూనైన బాశార్ష్నుడు. ఆయన ఇంకా యిలా అన్నాడు.

"పాండునందనులు బాలకులుగానే తండ్రిని కోల్పోయిన దురదృష్ట వంతులు. వారు నిన్నే నమ్ముకుని వున్నారు. అనేక కష్టాలు అనుభవించి నీమాటని జవదాటకుండా పన్నెండేళ్ళు అడవులపాలై పోయారు. పదమూడోయేడు కూడా నీ శాసనాన్ని అనుసరిస్తూ బహు దుఃఖాలలో గడిపి, నువ్వే తల్లివి తండ్రివి అనే ఉద్దేశంతో, ఆశలన్నీ కూడా నీ మీదనుంచి నీ నిర్ణయంకోసం నిలచివున్నారు. ఇవన్నీ ఓర్పుతో సహిస్తూ తమరాజ్యం తమకి లభిస్తుందని ఆశతో జీవిస్తున్నారు. వారి మాటగా నీకీ సందేశం చెప్పమన్నారు."

'నువ్వే గురువుగా భావించి నిన్ను గౌరవిస్తున్నాము. గురువు ఏవిధంగా ప్రేమతో తన శిష్యుల్ని ఆదరిస్తాడో ఆ విధంగా నువ్వు మమ్మల్ని చేరదీసి ప్రేమతో ఆదరించవలసినవాడివి. నిన్ను చూసి మేమీ కష్టాలు అన్నీ భరించి చేరాము. నువ్వే మాకు తండ్రివి, తల్లివి. ధర్మం, అర్థం అన్నీ తెలిసిన నీకు మేము వేరుగా ఏమీ చెప్పేదంటూ లేదు. నువ్వే మమ్మల్ని కూడా ధర్మమార్గంలో నడిచే లాగు చేసి నువ్వూ ధర్మమార్గంలో నిలిచి, ధర్మాన్ని స్థాపించవలసింది.' అని యీవిధంగా

పాండునందనులు నీకు తమ మాటగా చెప్పమన్నారు."

"ఇంకో విశేషం కూడా వున్నది. ఇక్కడ నీవు సావధానంగా వినవలసింది. ఈ లోకంలో అన్యాయంచేత న్యాయం చంపబడుతూ ఉంటేను, అధర్మం పెచ్చుపెరిగి ధర్మాన్ని అణచివేస్తూంటేను, ఎవరైతే చూస్తు ఊరుకుంటారో, అలా కేవలం ప్రేక్షకులుగా వుండే వాళ్ళంతా నిశ్చయంగా హతులైపోతారు. ఇది ప్రకృతి ధర్మం. అన్యాయం చేత న్యాయం, అధర్మంచేత ధర్మం కొట్టబడుతూంటే ఎవరైతే చూస్తూ ఉపేక్షిస్తారో వాళ్ళని, పెల్లుబికిన ఆ ధర్మవిప్లవం వరదలలో పొంగిన నది ఎలాగ తన గట్లమీద నిల్చిన ప్రేక్షకసమూహాలని ముంచివేస్తుందో, అలాగే, మహావిలయంలో అందరినీ నాశనం చేస్తుంది నశిస్తున్న ధర్మం తనతోపాటు లోకాన్ని నశింపజేస్తుంది. ధర్మాన్ని రక్షిస్తే అది అందరినీ కూడా కాపాడుతుంది.

"కాబట్టి రాజా! పాండవులు నీ మాటకోసం నిలిచివున్నారు. ఎదురుచూస్తూ సిద్ధంగా వున్నారు - నీకు సేవలుచేసి శుశ్రూష చెయ్యటానికైనా సరే, యుద్ధం చెయ్యటానికైనా సరే, దేనికైనా సిద్ధముగా నిలిచివున్నారు.

"నీకు ఏమార్గమైతే శ్రేష్టతమమైన పథ్యంలాగ రుచించకపోయినా గాని శ్రేయస్కరమైనదో - ఆ మార్గాన్నే అవలంబించవలసిందిగా కోరుతున్నాను."

ఇలా మాట్లాడిన శ్రీకృష్ణుడి మాటల్ని వింటూవున్న ఆ సభలో వాళ్ళంతా, హృదయాలలోనే ఆయనను పూజించారు. ధర్మయుక్తములూ, అందరి శ్రేయస్సును కోరేవి, అర్థవంతములూ, జగద్ధితాన్ని కోరేవి,

ప్రపంచశాంతిని, అహింసను ప్రతిపాదించేవైన ఆ మాటలు విన్న ఏ ఒక్కరికీ సమాధానం చెప్పడానికి నోరాడలేదు.

అయితే యిక్కడ మనం గమనించాల్సిన విషయం ఏమిటంటే శ్రీకృష్ణుడు ప్రతిపాదించే యీ శాంతివాదం యీనాడు గాంధీ, ఏసుక్రీస్తు ప్రతిపాదించే అహింసావాదం మాత్రం కాదు. "నీ శత్రువు ఒక లెంపకాయ కొడితే రెండో చెంప చూపించ"మనే అహింసకాదు యిది. నీ శత్రువుని ప్రేమించమనే శాంతివాదమూ కాదిది. ఈ విషయం మనం ప్రత్యేకంగా గమనించాలి.

క్రీస్తు అహింస, గాంధీ సిద్ధాంతాలూ గొప్పవే కావచ్చు. అవి సాధు సత్పురుషులకీ, సర్వకోరికలూ సన్యసించిన మానవోత్తములకి సరిపోవచ్చుగాక. కాని అవి మాత్రం సాధారణ మానవుడు లోకంలో ఆచరించే ధర్మంకాదు ఇది ఏ దేశమైనా అతర్జాతీయ రంగంలో అమలు జరిపితే నశించకుండా మిగిలివుండటం అసహజం. ఆత్మవినాశనానికే దారితీస్తుందీ విధానం. అలా అని శ్రీకృష్ణుడికి, యీ సర్వోత్కృష్ట మైన ఆదర్శ ఆధ్యాత్మికపథం తెలియదా? తెలుసు. కాని అది నిర్దేశించింది యోగికి, యీ ప్రపంచ బంధాల్నించి విముక్తుడవటానికై సన్యసించిన ముముక్షువుకి మాత్రమే. దీన్ని

"సమశ్శత్రౌచ మిత్రౌ చ తథా మానావమాన యోః"

అని గీతలో వేరే చెప్పాడు. కానీ ప్రాపంచిక మానవుడికి ధార్మిక మైన మార్గం ఏది? తను నశించటమా? కాదు. ఇతరులని దురా క్రమణ చెయ్యటమా? అదీకాదు. మరేమిటి? కర్తవ్యం ఆచరించటమే - ఆదర్శమానవుడి ధర్మం. దైవపోటీలోని ముముక్షువుల సంగతి,

సన్యాసియైన యోగి సంగతి కాదు యీ ధర్మంలో ఉద్దేశించ బడినది. తనకి రావలసిన హక్కుల్ని వదులుకోమని చెప్పలేదు శ్రీకృష్ణుడు. ధర్మమైనది, తనకి రావలసినదీ అయిన హక్కును యితరులు అన్యాయంగా అపహరించి, నిరంకుశంగా లాక్కుంటూ వున్న సమయంలో 'శాంతి-అహింస' అంటూ అసమర్ధతని సమర్థించుకుంటూ మగతనం లేని స్థితిని పొందవద్దని అర్జునుడికి ("క్లైబ్యం మాస్మగం పార్ధ") గీత లోను, ధర్మజుడికి, ఇంకా ఇతరులకీ శ్రీకృష్ణుడు తన జీవితంలో అనేక ఘట్టాలలో చెబుతాడు. చెప్పటమే కాదు, అవసరం - ప్రమాదం, వాటిల్లినప్పుడు - తన ప్రాణాల్ని తృణ ప్రాయంగా ఎంచి పోట్లాడి న్యాయమైన తన హక్కును నిలబెట్టుకోవటం అన్న ధర్మం ఎలాగ రక్షించాలో, ఆ కర్తవ్యాన్ని శిశుపాల వధలో అతిసాహసంతో కూడుకొన్న పరాక్రమం ద్వారా తను చూపెట్టాడు. ఇతరులకి హాని కలిగించని రీతిలో, వీలైతే ఎవరికీ హాని, హింస కలిగించకుండా, మానవుడైనవాడు తన ధర్మాన్ని రక్షించుకోవాలి. అదే కర్తవ్యం, కర్తవ్యమే దేశానికి - దేశాన్ని పాలించే రాజుకీ కూడా యిదే ఆచరణీయమైన ధర్మం అని చాటిచెప్పాడు.

ఇదొక మహాసత్యం. అనుభవానికి నిలిచే ఆదర్శం. ఊరికే "ఈ చెంప కొడితే ఆ చెంప చూపించు" అంటూ అణుబాంబులు తయారు చేసే కృత్రిమధర్మం కాదిది.

అయిదువేల సంవత్సరాలుగా భారతదేశం హీనాతిహీనమైన బానిసత్వం అనుభవించి, ప్రతివాడిచేతుల్లోనూ ఓడిపోయి, యీనాడు స్వాతంత్ర్యం వచ్చినా తను ధైర్యంగా నిలబడలేని మానసిక దాస్యంతో

మళ్ళీ, అధఃపతనం కావటానికి కారణం శ్రీకృష్ణుడు చూపిన రాజబాటని, ఆదర్శాన్ని మనం విడనాడి కర్తవ్య నిర్వహణని చూచి దాక్కుని పైకి అసంబద్ధమూ, అనాచరణీయమూ అయిన అహింసా, మిధ్య, మాయ లాంటి కృత్రిమ నినాదాలు మాత్రం చేస్తూండటం ఆత్మవంచన చేసు కోవడమే! శ్రీకృష్ణుడి ఆదర్శం మనం అనుసరించి నన్నాళ్ళూ, భారత దేశం జాజ్వల్యమానంగా వెలిగి వైభవాన్ని అనుభవించి ప్రపంచానికే ఆదర్శం అయింది. ఈనాడు పురోగమించిన అమెరికా, ఇంగ్లండు, జర్మనీలు పైకి క్రీస్తుపేరు చెప్పినా, కాపాడుకుంటున్నది వాళ్ళ హక్కులే. అవి ఇప్పటికి అంతర్జాతీయరంగంలోనూ, సామాజిక ఆదర్శంగానూ అనుసరిస్తున్నది యీ సహజధర్మమే.

ప్రతి మనిషి న్యాయంగా తనకివున్న హక్కుల కోసం వీరుడి లాగ పోరాడాలి! అంతేకాదు, అధర్మంగా తనికి కాని అన్యాయార్జిత సుఖాలకంటే జీవితమే త్యజించటం మేలు అనికూడా శ్రీకృష్ణుడు ఉద్బోధించాడు. ఇది ఆయన నిర్దేశించిన ధర్మరూపం. న్యాయం ప్రతి వాడి హక్కు. హక్కులు ప్రతివాడికి న్యాయం అన్న సామాజిక ధర్మం దీనివెనక దాగివుంది. ఆదర్శ మానవుడిగానే ప్రపంచానికి తన జీవితం ద్వారా శ్రీకృష్ణుడు నేర్పిన యుగధర్మం యీ కౌరవ సభలో చెప్పిన ప్రసంగంలోనూ, మళ్ళీ సంజయుడు రాయబారిగా వచ్చినప్పుడు యిచ్చిన కార్యాచరణ సిద్ధాంతంలోనూ, మనకి అవగతం అవుతుంది. ఇది భారతదేశం యీనాడు అవశ్యం ఆచరించవలసిన యదార్థ సత్యం తన ఆత్మవినాశానికే కారణమైన మిధ్యావాదాల్ని దేశం ఎంత త్వరగా విడిచిపెట్టగలిగితే, బలహీనులమైన మనజాతికి, భారతీయులమైన

మనకీ కూడా అంత మంచిది. దేశాన్నే సన్యాసు లుగా చెయ్యటం కాదు శ్రీకృష్ణుడు నిర్దేశించిన ధర్మంయొక్క గమ్యం - జీవితంలో ధీరులైన సజీవమైన జాతిగా మనుషుల్ని మార్చటమే దీని ఉద్దేశ్యం.

శ్రీకృష్ణుడు మనకి అనుసరణీయుడై, వ్యక్తిగా జాతీయాదర్శం కాగలిగిననాడు మనలో యీనాడున్న అనేక బలహీనతలు, పారతంత్ర్యం, భావదాస్యం రూపేణా తాండవిస్తున్న కుళ్ళూ అంతా నశిస్తుంది. ఎందు వల్లనంటే, మనిషిలో అనేకమైన లోపాలకి మూలకారణాలుగా యీ బలహీనతకి కారణం, శతాబ్దాలుగా మనలో జీర్ణించుకుపోయిన బల హీనతాదర్శాలే (Weak ideals). ఆచరణకీ, ఆదర్శానికి మధ్యన యీ సందుకు కారణం అసంభవమైన, అసహజమైన సామాజిక సిద్ధాంతం, భారతీయుల వ్యక్తిత్వం పటిష్ఠము కానిదే, మనదేశంలో పెరిగిపోతున్న "దొడ్డిదోవ" మనస్తత్వం నిర్మూలన కాదు. అంతదాకా మనం చీకటి మనుషులమే. ఇది చీకటియుగమే అవుతుంది. ఈ "అసత్య యుగం" అంతరించే మార్గం ఒక్కటే. అది శ్రీకృష్ణుడు మనకి చూపి వెళ్ళిన సరైన భావాల్ని, దేశంలో పునఃప్రతిష్ఠించటమే. అంతదాకా మన నాడు లలో ప్రవహించేది నీరు! రక్తం కాదు; మన కుండేది ఆదర్శమూ కాదు, బలహీనత.

తన కర్తవ్య నిర్వహణనించి ప్రాణాపాయం వాటిల్లినా వెనుదీయ రాదంటే అర్థం శ్రీకృష్ణుడు యుద్ధోన్మాది అనికాదు. శ్రీకృష్ణుడి శాంతి కాముకత్వం, యీనాటి భారతీయులలాగ ప్రతి క్రియచేతగాని, బల హీనతవల్లగాని చెప్పే శుష్కోపన్యాసంకాకుండా, అప్రతిమాన బల సాహసాలతో కూడుకున్న సామర్థ్యం కలిగిన మహాపురుషుడి నుండి

వెలువడినది! అది ఆయనలోని సర్వభూతకారుణ్యాన్ని చూపుతుంది. జీవకారుణ్యంవల్ల, తనకున్న శక్తిని ప్రయోగించటంవల్ల కాకుండా, సౌమ్యమార్గాలద్వారా ధర్మం సాధించటానికే ఆయన చేసిన ప్రయత్నము. కాని అది వీలుకానప్పుడు అశక్తతతో, అధర్మం జయిస్తూంటే చేతులు కట్టుకుని చూస్తూ, శాంతిపాఠాలు వల్లించటంకన్న ప్రాణాలకు తెగించి ధర్మం నిలబెట్టటానికి రక్తమే ధారపోయటం మేలు అని ఆయన సిద్ధాంతం. అందుకే రాయబారాలు విఫలమైనప్పుడూ, యుద్ధం మధ్యన అనేకసార్లు ఆయన పాండవులను వెనుకంజ వెయ్యనివ్వలేదు. సంక్షేపంగా చెప్పాలంటే శ్రీకృష్ణుడు జీవితంలో అనుసరించిన వేదాంతమే మాటలలోనూ ఉపదేశించాడు. ఈయన సిద్ధాంతాలు పుస్తకాలలోంచి వచ్చినవికావు. జీవితం నుంచి వచ్చినవి. అనుభవం మీద, సత్యం మీదా ఆధారపడ్డ ఆచరణీయ శాస్త్రసత్యాలు కాని, శుష్కోపన్యాసాలూ, రాజకీయ నినాదాలూకావు ఈ విషయాలు. అందుకనే ఆయన చూపిన ఆదర్శం ప్రతి మానవుడూ అనుష్ఠించవలసినది. ఎవరో ఏ మారు మూలనో ముక్కుమూసుక్కూచునే మునులకో, ఏ కొండలమీదనో, అరణ్యాలలోనో, జీవితం చూసి దాక్కొనే కాందిశీకులకో పనికి వచ్చేది కాదు ఈ సిద్ధాంతం.

భారతదేశంలో శ్రీకృష్ణుడి అస్తమయం తర్వాత ఉద్భవించిన మతాలు, వేదాంతాలూ, ఉపదేశాలూ అన్నీ పైచెప్పిన రెండో తరగతివి కావటంచేత జనం వాటిని ఆచరించటం మూలాన కొద్ది శతాబ్దాల లోనే దేశ స్వాతంత్ర్యం పోగొట్టుకుని భారతీయులు బానిసలైపోయా రన్నది చరిత్రపుటలలో చెరపరాని సత్యం.

"నిత్యజీవితాన్ని ధీరుడుగా ఎదుర్కో!" అనేదే శ్రీకృష్ణుడి సిద్ధాంతంగా కనిపిస్తుంది. ఈయన ఆధ్యాత్మిక ధ్యేయం కూడా - ప్రపంచం చూసి, అందులోని లోతుపాతులు, సమస్యలూ చూసి, జీవిత యుద్ధ రంగం నుండి పారిపోయి, యీ నిత్యజీవిత సమస్యని 'మాయ' అని, 'మిథ్య' అనీ, నశ్వరం, అశాశ్వతం అని కర్తవ్యంనించి, కర్మానుష్టానం నించీ తప్పించుకుని తిరిగే వేదాంతం కాదు - జీవితంలో అన్ని వైపులా నిజంతో, సానపట్టబడిన ఆదర్శం ఆచరణ ద్వారా గట్టిచేసుకుంటూ గృహస్తుగా, కర్మయోగిగా, శక్తియుతుడైన సాధుమూర్తిగా, పరాక్రమశాలియైన యోధుడిగా శాంతియుత జీవనం చెయ్యటానికి కావలసిన కర్మకౌశలమే 'యోగం' (యోగః కర్మసు కౌశలం" - గీత). ఇదే జీవిత యుద్ధభూమిలో విజయుడైన నరుడికి కావలసిన పరమోత్సాహశక్తి. తన కర్మల ఫలితం అనే బానిసత్వం నుండి విముక్తి తప్ప, పనులు చెయ్యటం అనే బాధ్యతనుండి విముక్తి లేదు - అన్నదే ఈ కర్మవీరుడు చాటిచెప్పిన మోక్షస్వరూపం.

అందుకే ఈయన ఆలపించిన యుద్ధగీతిక, కర్మభూమి నుండి వెన్నిచ్చి పారిపోయే నరుడికి, జీవిత సమరంలో మంచీ చెడులనే ఉభయసేనల మధ్య - ఆచరణచెయ్యి ("కురు" = చెయ్యి, ఆచరించు!) అని ప్రబోధించే కురుక్షేత్రమైన జీవిత క్షేత్రంమీద - యివ్వబడింది. ఇది భారతజాతి ఐదువేల సంవత్సరాల బానిసత్వానికి కారణమైన నపుంసక వేదాంత రూపంలో వున్న కశ్మలాన్ని వదలగొట్టే దివ్యౌషధం. సరిగ్గా ఆచరిస్తే మనం గుర్తిస్తే, రానున్న కాలంలో భారతదేశ భావిభాగ్యోదయానికి నాందిపలికే జాతీయగీతమే ఈ భగవద్గీతము.

బానిసత్వం నుంచి, భయం నుంచీ, చెడుగు నుంచీ, అశక్త దౌర్బల్యము నుండి, దారిద్ర్యం నుంచి, అన్యోన్య పరపీడనం నుంచి, అన్యోన్య వినాశక సిద్ధాంతాల నుంచి, వర్గవిప్లవం నుంచి, వర్గవైషమ్య విషానలంనుంచీ, ఆర్థిక బానిసత్వం నుండి, భావదాస్యంనుంచీ, ఓర్వలేనితనం నుండి - ఇలాంటి అసంఖ్యాక జాతి విద్రోహకరమైన అనేకవేల బలహీనతల నుంచి, కుష్ఠురోగిలాగ బాధపడుతూ, పతితమై హీనమై, నీచాతినీచ స్థితిలో తననుతానే నాశనం చేసుకుంటూ, తనను తానే మోసం చేసుకుంటూ, ద్వేషించుకుంటూ, విభజించుకుంటూ, గుడ్డినాయకుల వల్ల, కుంటి అనుయాయులవల్ల వ్యధితమైన ఈ భారతీయులకి, కలియుగ చీకటి రాక్షసి కొడుకులమైన.... నెత్తురు బిడ్డలమైన మనకి ఈ అంధకూపంలోంచి బైటపడే వెలుగురేఖని చూపించే ధృవతారే - ఈ యుగపురుషుడైన శ్రీకృష్ణుడు.

నవయుగ మహోషస్సుని సూచించే వెలుగే, ఈయన మనకిచ్చిన మందు. దాని అర్థం ఇది.

"భారతజాతికి కావలసింది వేదాంతం కాదు, మతం కాదు, కావలసిందొక్కటే. అది బుజురేఖలో ధైర్యంగా నిలిచి, సంపూర్ణ జీవితాన్ని కడుపునిండా త్రాగగలిగే ధీరత." అది ఎలాగో, జీవించి చూపాడు, యీ చీకటియుగం ప్రారంభించకముందే - చీకటి మనుషుల మైన మనకి. ఇది అవలంబిస్తే, యిప్పుడు ప్రారంభించే కొత్తయుగానికి అది ఓం-కారమే కాగలదు. గడపమీద పెట్టిన దీపకళికలాగ తను జీవించిన కాలంలోనే గాక, గడప అవతల యుగానిక్కూడా వెలుగిచ్చిన యుగపురుషుడు వాసుదేవుడు.



8

# శ్రీకృష్ణుడు - భక్తియోగం

భగవంతుడిమీద మనకి ఉండే ప్రేమని 'భక్తి' అంటారు. భగవంతుణ్ణి ప్రేమించటానికి మనకి అనేక మార్గాలు ఉన్నాయి. భగవంతుణ్ణి చేరుకోవడానికి, ఆయన్ని తెలుసుకొని ఆయనతో తాదాత్మ్యం అనుభవించి, ఆయనని అనుభూతితో అర్థం చేసుకొని తద్భావం పొంది ఆ జ్ఞానం ద్వారా భగవంతుని చేరుకోవచ్చు. దీన్ని 'జ్ఞానయోగం' అంటారు. లేదా భగవంతుణ్ణి ప్రేమించి, ఆ ప్రేమతో ఆయనకి దగ్గరవాళ్ళం అయి - బంధువులుగానో, స్నేహితులుగానో, భక్తుడిగానో, తండ్రిగానో, కొడుకుగానో, ఏదో ఒక విధంగా ఆయనను మనం హృదయానికి దగ్గర చేసుకునే మార్గాన్నే భక్తియోగం అంటారు.

ఈ భక్తియోగం చాలా సులభం. ఎందుకంటే, జ్ఞానయోగాని కైతే చాలా తెలివితేటలుండాలి. ప్రజ్ఞావివేక విచికిత్సలు ప్రబలంగా

వుండాలి. కర్మయోగాని కేమిటంటే మనిషికి ఆత్మవిశ్వాసం వుండాలి. ప్రతిపనీ తనంతటతానే చేసి భగవంతుడిమీద ఆధారపడకుండా, క్రియలు నిర్వర్తించటంలో తానే బాధ్యతవహిస్తూ చేసుకుపోగల సమర్థత వుండాలి. తర్వాత అష్టాంగయోగం ఆచరించాలంటే ప్రాణాయామం, ఆసనాలు యివన్నీ చేయాలి. ఇవి చేయాలంటే వీటిద్వారా భగవంతుడ్ని చేరుకోవాలంటే ఒక గురువుండాలి. ఆయన ఆధ్వర్యం క్రింద, ఒక ఆశ్రమంలాంటిచోట సంవత్సరాలు సాధన చెయ్యాలి. ఆ గురువుద్వారా యోగశాస్త్రం నేర్చుకోవాలి, యోగసిద్ధి ద్వారా భగవంతుడి స్థితిని అందుకోవాలంటే. అందువల్ల యోగమార్గము కూడా చాలా కష్టమైంది.

ఇలాటి మార్గాలన్నింటిలోకల్లా తేలికైంది భక్తిమార్గం. భక్తి అంటే భగవంతుడిని ప్రేమించటమే.

భగవంతుడిని ప్రేమించటానికి తొమ్మిది మార్గాలున్నాయి. దీనినే 'నవవిధ భక్తి' అంటారు.

అంటే భగవంతుడిని ఓ చిన్ని పాపాయిగా ఎత్తుకొని ముద్దాడింది యశోద. కొడుకుగా ఆయనను ప్రేమించింది. కన్నది దేవకిగాని పెంచింది యశోద.

మనకి పురాణాలలో చూస్తే, చక్కగా ముద్దులు మూటగట్టుతూ, పనసపండులాగ వొడి నిండిపోయేలాగున్నటువంటి బాలకృష్ణుడిని ఎత్తుకొని, తనవితీరా ముద్దాడి, ఆనందించి పాలుపట్టి, ఉయ్యాల ఊపి, జోకొట్టి, లాలిపాటలతో నిద్రపుచ్చి, తన కొడుకుగా, ప్రేమించే

ముద్దుల బుజ్జాయిగా, చిన్నారి పాపడుగా శ్రీకృష్ణుడిని ప్రేమించి అతనికి మాతృమూర్తిగా తన ప్రేమని కురిపించింది యశోద. కురిపించి తన బ్రతుకు పండించుకుంది ఆ తల్లి. ఈ ప్రేమద్వారా తల్లిగా ఆయనకు దగ్గరైంది. ఆయన ద్వారా భగవంతుడిని చేరుకోగలిగింది. అంటే భగవంతుడిని కొడుకుగా ప్రేమించి మాతృమూర్తిగా మోక్షాన్ని పొందింది యశోద. నవవిధ భక్తి భావాలలోనూ ఇది మాతృభావం.

అలాగే గొల్లపిల్లలందరూ శ్రీకృష్ణుని అవతారమూర్తి అనుకున్నారా? అనుకోలేదు. ఏదో గొప్ప మహావ్యక్తి అనిగాని, ఒక చారిత్రాత్మక పురుషుడనిగాని, అనుకున్నారా? అలాగూ అనుకోలేదు. ఇలాటివేవీ పట్టించుకోలేదు. వాళ్ళు కేలం ఒక స్నేహితుడుగా, తోడు దొంగగా వాళ్ళతో కలిసి ఆడుకునే మంచి బుజ్జాయిగా, ముద్దుల క్రిష్ణయ్య అనే ఊహించుకున్నారు.

కృష్ణుడితో చద్దిఅన్నాలు తిన్నారు. కృష్ణుడితో కలిసి అడవులలో, అరణ్యాలలో, వనాలలో, అనేకచోట్ల సంచరించారు. పువ్వులూ, ఆకులూ, లతలతో ఆయన్ని అలంకరించి చూసి ఆనందించారు. కృష్ణుడితోకలిసి అడవిలో కూర్చుని ఎండవేళ చల్లటి చెట్లనీడన, ఆవులమందలు చుట్టూ మేస్తుంటే సమీపాన చెరువు, కాళిందీ సరస్సు మీదనుంచి చల్లటి వాయువులు వీస్తూంటే - గుండ్రంగా కూర్చొని పెరుగూ అన్నం ముద్దలు చేసుకొని బంతి చల్దులు తిన్నారు.

ఇలాగ అనేక విధాలుగా శ్రీకృష్ణుడితో స్నేహితులుగా ఆడుకున్నారు. చెట్లెక్కి దూకటం, కోతికొమ్మచ్చి ఆడటం, ఒకరి వీపుమీద

యింకొకర్ని ఎక్కించుకుని పరుగులుపెట్టడం, దాగుడుమూతలు ఆడటం ఇలా అనేక విధాలుగా కృష్ణుణ్ణి స్నేహితుడిగా వాళ్ళు ప్రేమించి కృష్ణుడికి దగ్గరయ్యారు. తద్వారా అది స్నేహ భావమనే భక్తిలో వాళ్ళు భగవంతుడిని హృదయంద్వారా చేరుకోగలిగారు. దీన్ని నవవిధ భక్తి మార్గాలలో 'సఖ్యభావం' అంటారు.

గోపికలేం చేశారు? శ్రీకృష్ణుడిని భర్తగా ప్రేమించారు. ప్రియుడిగా అరాధించారు. హృదయపూర్వకంగా వాళ్ళకున్నటువంటి ఆస్తికంటే మనస్సు, ఆత్మ, శరీరం అన్నిటినీ కూడా సమర్పణ చేశారు. భక్తిలో ముఖ్యంగా చెప్పబడిందేమిటంటే, భగవంతుడికి సంపూర్ణంగా ఆత్మ సమర్పణ చేసుకోవటమే. దీన్నే 'పరిపూర్ణ భక్తి' అంటారు. అలాగ శ్రీకృష్ణుడిని ప్రేమించారు గోపికలు. ఆయనకు దగ్గరవాళ్ళయ్యారు.

అలాగ గోపికలు శ్రీకృష్ణుడిని ప్రేమించి, ఎప్పుడూ ఆయన్ని గురించే ఊహించి ఆయన రూపమే ధ్యానిస్తూ కళ్ళు తెరిచినా, కళ్ళు మూసుకున్నా లోపలా బైటాకూడా భగవంతుడి రూపమే నిత్యం కనపడుతూ జగన్మోహనమైన శ్రీకృష్ణుడి ముఖారవిందాన్ని అందంగా ఉంగరాలు తిరిగి గాలికెగురుతూవుండే ముంగురులతో, చక్కటి లేత నీలపు కలువపూవులా వున్న ఆయన ముఖం, విచ్చిన తెల్లతామర రేకుల్లా అందంగావున్న ఆ కళ్ళుచూస్తూ, గులాబి మొగ్గలాగ ముద్దులు మూటగట్టే ఆ శ్రీకృష్ణుడి మూతినే నిత్యం ధ్యానిస్తూ ఆయన పరమ ప్రేమ స్వరూపాన్ని, నిత్యం ప్రేమచిందించే ఆయన హృదయాన్ని ఎప్పుడూ జ్ఞప్తికి తెచ్చుకుంటూ అలా రోజురోజుకీ ఆ ప్రేమలో మునిగి,

సొక్కి, సోలి, చివరికి ఆ ప్రేమే పచ్చిపుండులాగ హృదయంలో బాధించే టటువంటి పరమోత్తమ స్థితిని పొందారు గోపికలు.

పొందటమేగాకుండా ఆ స్థితిలో ఆనంద పారవశ్యంలో వాళ్ళను వాళ్ళే మరిచారు. ఆనందప్రేమ రసావధిలో, పంచదార చిలకల్లాగ కరిగిపోయి, వాళ్ళ వ్యక్తిత్వాన్ని భగవద్భావంలో లీనం చేసుకున్నారు. తియ్యటికలలాగ జీవించారు, ఆ గోపికలు. అందువల్లే ఒక్క క్షణం శ్రీకృష్ణుడు కనిపించకపోయినా ఎంతో తల్లడిల్లిపోయేవారు.

ప్రొద్దున ఆవుల్ని మేపటానికై ఆయన అడవులకి వెళితే సాయంత్రం వచ్చేదాకా కూడా యీ గోపికలకి హృదయంలో ఎంతో బెంగగా వుండేదిట. అయ్యో! అడవిలో కృష్ణుడి కాళ్ళకి ముళ్ళు గుచ్చు కుంటాయో ఏమో! ఎలాగ అని, లేకపోతే ఆటల్లోపడి వాళ్ళతోనో వీళ్ళతోనో పరుగులుపెడుతూ మధ్యాహ్నం వేళ దాటిపోయినా అన్నం తినటం మర్చిపోతాడేమో! పాపం శ్రీకృష్ణుడికి వాళ్ళ చిన్నారి సుకుమారి కిష్టమ్మకి ఆకలేస్తుందో ఏమోనని "అరె! ఎండతాకి మొహం వాడి పోతుందేమో! దుమ్ముకొట్టుకుని యీ ఎండలో తిరిగినందువల్ల ఎండ కొట్టుకొని ఆయన అందం తగ్గిపోతుందో, కంది మాసిపోతుందేమో! అని యిలాగ, నిత్యం ప్రలోభపడేవాళ్ళట. ఆయన రూపంచూసి, అందం చూసి, ఆయన ప్రేమచూసి, నిత్యం ప్రలోభపడేవాళ్ళు గోపికలు. అంటే ఒక్కక్షణం కూడా ఆయన రూపం తలచుకోకుండా వుండలేక పోయే వారు.

వాళ్ళకి ఒక్కక్షణం ఆయన కనపడకపోతే, హృదయాలు తల్లడిల్లి పోయేవి. ఇలాగ నిత్యం - అనవరతంగా పెంపొందుతూండే వాళ్ళ

భక్తిని మధురభక్తి అంటారు. మధురిమ అంటే తియ్యటిది అని అర్థం.

అలాటి భక్తిలో చేరినవాళ్ళే రాధ, రుక్మిణీ, సత్యభామ, శ్రీకృష్ణుడిని భర్తగా, ప్రియుడిగా ఆరాధించినటువంటి అనేకమంది ఈ మధుర భావం ద్వారా భక్తిని పొందగలిగారు. ఇదీ మధురభక్తి అంటే.

ఇలాగే కంసుడూ, శిశుపాలుడూ, పౌండ్రకవాసుదేవుడు, దంత వక్త్రుడు ఇలా అనేకమంది రాక్షసులు శ్రీకృష్ణుడిని ద్వేషించి వైరభక్తిని పొందారు. ఇంకా సాళ్వుడు, దంతవక్త్రుడూ, నరకాసురుడూ అనేకమంది అసురభావం కలిగి, అహంకారంతో, మదంతో, గర్వంతో శ్రీకృష్ణుడిని ఎప్పుడూ ద్వేషిస్తూ ప్రతినిత్యం ఆయనపేరు తలచుకుని ఆయనను నిందిస్తూ ప్రతిక్షణం ఆయన రూపాన్ని తలచుకుని, భయపడుతూ, ప్రతిక్షణం ఆయన్ను శత్రువుగా హృదయంలో ఏదో మూల దాచి వుంచుకుంటూ, ఈ విధంగా శత్రుభావంతో ఇరవైనాలుగు గంటలూ ఆయన్ని స్మరిస్తూ తద్వారా ఆయనని చేరుకోగలిగారు. ఇది వైరభక్తి.

అంటే ఏదోమూలంగా భగవంతుడి హృదయం దగ్గరగా రావటమే భక్తియోగంయొక్క మూలసూత్రం. మాతృభావంతో దేవకీదేవి, మిత్ర భావంతో గొల్లపిల్లలూ, ఆడుకునే సఖులు, భక్తిభావం (పరాభక్తి) తో అక్రూరుడూ, భీష్ముడు, విదురుడు, అర్జునుడు, మహర్షులూ, ఇటువంటి మహాత్ములూ, ఇంకా ఆధ్యాత్మిక పరిణతినందిన అతీతులూ, వైర భావంతో కంస, శిశుపాల, జరాసంధులూ, వాత్సల్యభావంతో యశోదా అంటే కన్నకొడుకుగా కన్నయ్యను చూసుకుని మురిసి శరీరమంతా

పొంగి తామరపువ్వులాగ వికసించే మనస్సు నిండిపోయేది ఆ మాత్ర మూర్తికి. దాస్యభావంతో అంటే, దాసానుదాసుడనే భక్తితో జాంబవంతుడు, కుచేలుడు, మధురభావం ద్వారా గోపికలు, రాధా ఇలాగ అనేకమంది అనేక విధాలుగా శ్రీకృష్ణుడిని ప్రేమించి, నిత్యం ఆయనను స్మరించి, ఆయన రూపం వాళ్ళ కళ్ళల్లో, మనస్సుల్లో, వాళ్ళ గుండెల్లో నిత్యం ముద్రితమయ్యేటట్టు చేశారు. కాబట్టి యీ తొమ్మిది పద్ధతుల్లో (తొమ్మిదేకాదు, ఎన్నైనాసరే) భగవంతుడిని చేరుకొనే మార్గం శ్రీకృష్ణుడు అందరికీ చూపించాడు.

తనను ఏవిధంగా ఆరాధిస్తారో వాళ్ళకు ఆవిధంగానే దారి చూపిస్తానని భగవద్గీతలో చెప్పాడు గదా! ఈ తొమ్మిది విధాలుగా తనని దగ్గరకి తీసుకున్న వాళ్ళకి తొమ్మిది విధాలుగా మోక్షం యిచ్చాడు. భగవంతుడిని ప్రేమించటమే భక్తియోగం యొక్క ముఖ్య సూత్రం.

ఈ భక్తియోగానికి ప్రాముఖ్యం యిచ్చినటువంటిది కృష్ణావతారమే. రామావతారంలో కూడా భగవంతుడు మనుషరూపుడై హనుమంతుడితోను, జాంబవంతుడితోను, అలాంటి మహాభక్తులు అనేకమందితో తిరిగినప్పటికీ రామావతారంలో భక్తిభావాలకి ఎక్కువ సావకాశం లేకపోయింది. ఎందుకంటే ఆయన కర్మిష్ఠి. నిత్య జీవితంలో చేయవలసిన కర్తవ్యం కోసం, కర్తవ్యాచరణ కోసం కంకణం కట్టుకున్నవాడు శ్రీరాముడు. కాని శ్రీకృష్ణుడి విషయం అలాకాదు, శ్రీకృష్ణుడు భక్తసులభుడు.

తెలివితేటలక్కర్లేదు. పెద్ద పాండిత్యం అక్కర్లేదు. కఠినమైన

యోగసాధనముతో పనిలేదు. తపస్సు అక్కర్లేదు. వేదాధ్యయనం అక్కర్లేదు. మంత్రాలు, యజ్ఞాలతో పనిలేదు. కష్టమైన కఠిన వ్రతోప వాసాలవసరం లేదు. తేలికగా అతన్ని ప్రేమించి మనస్సు, హృదయం, శరీరం, ఆత్మ, తనకి సమర్పించి సర్వస్యశరణాగతి చేసినవాళ్ళని రక్షిస్తానని శపథం చేసిన అవతారం శ్రీకృష్ణావతారం.

అందుకనే 'కాత్యాయినీ' వ్రతం చేస్తూవున్న గోపికలు, వ్రతం చేస్తున్నామనే సంగతి మరిచిపోయి తమ బట్టలు విడిచిపోయి చెరువులో దిగి స్నానాలు చేస్తూవున్నారు. చెరువులో దిగి స్నానాలు చేస్తూ వున్నప్పుడు వ్రతంలో వున్న వీళ్ళు బట్టలు లేకుండా స్నానాలు చెయ్యటం అనేది వ్రతానికి విరుద్ధం, శాస్త్రానికి విరుద్ధం. అందువల్ల వాళ్ళని వాళ్ళే మరిచి పోయి ఈ గోపికలు వ్రతభంగం చేశారు. ఈ విషయంలో వాళ్ళకి గుణపాఠం నేర్పడానికి శ్రీకృష్ణుడు వాళ్ళ చీరలన్నీ ఎత్తుకుపోయి చెట్టు మీద కూర్చున్నాడు. వాళ్ళు సర్వస్య శరణాగతి చేసి శరీరంమీద వుండే అభిమానం, వ్యామోహం, ఆత్మగౌరవం, శరీరాభిమానం, సిగ్గు యిటు వంటివన్నీ విడిచిపెడితేగాని భక్తికి పరాకాష్ఠ రాదు. భక్తుడు తనకున్న కులాభిమానం, తనకి జ్ఞానం వున్నదన్న అహం, రూపం వున్నదన్న స్వాభిమానం, బలం వున్నదని తనే భక్తుడనని, ఏ రూపంలో నైనాసరే ఆత్మాభిమానం గనక వున్నట్టయితే అదే భక్తికి అడ్డుపడుతుంది.

శరీరాభిమానం, కనీసం సిగ్గు, నలుగురూ చూస్తూవున్నారనే లజ్జ, భయం, అసహ్యం అనేవి ఆరు 'పశుబంధాలు'. అంటే యీ ఆరు తాళ్ళతోటి మనుష్యుడు పశువుగా, జంతువులాగ కట్టివేయబడు

చున్నాడు. ఈ ఆరు తాళ్ళవంటి బంధాల్ని గనక తెంచినట్టయితే మనిషి నరత్వం, జంతుస్వభావం పోయి మనిషికి దివ్యత్వం వస్తుంది. మనిషి దివ్యుడుగా అవటమే మోక్షం.

ఈ మోక్షానికి అడ్డంగా వున్నవే ఈ పశుసంబంధాలనబడే అహంకారం, లజ్జ, భయం, లోభం యివన్నీ వదిలేసినట్టయితే వాటి నుంచి విముక్తి లభిస్తుంది. అప్పుడే సర్వస్య శరణాగతి చెయ్య గలుగుతాడు. శరీరాభిమానం వదిలిపెట్టింతర్వాతనే గోపికలు చెరువు లోంచి బైటికొచ్చి, దిసమొలలతో దిగంబరులై వుండికూడా సిగ్గుపడకుండా, కళ్ళుమూసుకొని ఆయనను పరమాత్మగా, వాళ్ళలోపల వున్నట్టి ప్రాణస్పందనగా, హృదయంలో 'నేను' రూపంలో వున్న భగవంతునిగా ధ్యానించి రెండు చేతులూ పైకెత్తి నమస్కరించారు. అలా చేసిన మీదటనే ఆయన వాళ్ళకి బట్టలు ప్రసాదించాడు.

ప్రసాదించటమే గాకుండా శరదృతువులో పౌర్ణమినాడు రాత్రి రాసక్రీడ అనే వంకతో వాళ్ళని ఆటల్లోకి దింపి పుచ్చపూవులాగ కాచే చక్కటి పండువెన్నెట్లో వాళ్ళకి అమృతగానం వినిపిస్తూ, వాళ్ళకి చూచిన చోటల్లా కనపడుతూ మనిషికోమూర్తిగా దర్శనమిస్తూ, సర్వత్రా అన్ని రూపాలతోనూ ప్రపంచం అంతటా అన్నిచోట్లా ఎంతమందికి కావలిస్తే అంతమందికీ, ఎలా కావలిస్తే అలా దర్శనమిచ్చి వాళ్ళకి లీలామానుష విగ్రహుడై ప్రేమరూపంలో వున్న వాళ్ళ భక్తిని పరాకాష్ట నందుకునేట్టుగా చేశాడు.

అందువల్ల రాసక్రీడలో కూడా భగవంతుడుగా తాను చూపెట్టిన

గొప్ప నిదర్శనం ఏమిటంటే సర్వరూపాల్లోను తానే వున్నాననీ, ఏ విధంగా కోరితే ఆవిధంగా దర్శనమిస్తాననీ, మనం ఎలా భగవంతుడిని ప్రేమిస్తే ఆయన అలానే, మనకిష్టమైన రూపంతోనే మనకి చూస్తే ప్రేమ కలిగించే రూపంగానే మనకి దర్శనమిస్తానని మనం ఏవిధంగా భగవంతుడిని సమీపిస్తే ఆ బాటలోనే ఆయన మనల్ని ఎదురుగా వచ్చి ఆహ్వానించి ఆదరిస్తానని, స్వాగతమిస్తాడని ఋజువు పరిచాడు. మనం ఎన్నుకున్న మార్గాన్నే ఏ రూపంలో ప్రేమిస్తే అలాగ ఏ మార్గాన వెడితే ఆ మార్గానే స్వాగతమిచ్చే యిలవేల్పుగా శ్రీకృష్ణుడు తన అవతారంలో అందరికీ అన్నీ అయినాడు. వివిధ భక్తిమార్గాల ద్వారా, నవరసాలుగా, తొమ్మిది విధాల అమృతం చిలికిస్తూండే శృంగారమూర్తి గనక భక్తి యోగానికి ఆయనను ప్రేత్యకంగా చెప్పుకుంటారు. జీవితం లో నవరసాలు వొలికించిన మధురమూర్తిగదా శ్రీకృష్ణుడు!

అందువల్లనే భక్తసులభుడుగా, మనందరికీ ప్రేమైకమూర్తిగా శ్రీకృష్ణుడు యిన్నివేల సంవత్సరాలు గడిచిపోయినా మన హృదయాలలో చెరిగిపోకుండా యుగపురుషుడిగా, మధురంగా, అందమైన తన నవ్వు మొహంతో మనల్ని చూస్తూ ఈనాటికి మనల్ని ఆహ్వానిస్తున్నాడు, విశ్వ విశాలమైన తన హృదయమందిరంలోకి రమ్మని.

